THE LARGEST CIRCULATED TELUGU MONTHLY

# చతుర

ఆగస్ట్ 1998

రూ. 7/-



**ఆర్తి** తనికెళ్ల కల్యాణి

# చతుర ప్రపంచం

## కోటి అవార్డుల విలువ

డాక్యుమెంటరీ చిత్రాలను తీయడం అంత సులువైన విషయమేమీ కాదు. అందులో శృంగారం, హాస్యం, హింస వగైరా రసాలేవీ రంగరింపబడి కనుపించవు. ఏ డాక్యుమెంటరీ చిత్రమైనా ఏదో ఒక నీతిని, ప్రజోపయోగాన్ని కలిగివుంటాయి. కాబట్టి ఇలాంటి విసుగు కలిగించే విషయాల్ని వినోదాత్మకంగా చూపించడం కష్టమైనపని. కానీ రాధానారాయణన్ అనే మహిళ కష్టనష్టాలను పట్టించుకోకుండా గ్రామీణ ప్రజలకు ఉపయోగకరమైన ఇతివృత్తాలను తీసుకుని ఎన్నో డాక్యుమెంటరీ చిత్రాలను నిర్మించింది. తన శక్తిని, తెలివిని, కృషిని డాక్యుమెంటరీ చిత్రాలను తీయడంలో వినియోగించింది.

ఈ చిత్రాలు సామాన్యులకు ఎంతో మేలు చేస్తాయనడంలో ఎలాంటి సందేహం లేదు. రాధానారాయణన్ మొత్తం 26 డాక్యుమెంటరీ చిత్రాలను నిర్మించింది. అందులో చాలా చిత్రాలు జాతీయ అవార్డులను పొందాయి. రాధ తమిళియన్ అయినా చిన్నప్పటినుంచీ ఢిల్లీలోనే పెరిగింది. కాలేజీ రోజులనుంచీ కూడా ఆమె ఎన్.ఎస్.ఎస్.లో మెంబరుగా వుంటూనే 'ఇంటర్నేషనల్ వలంటరీ సర్వీస్ కార్ప్స్'లో కూడా యాక్టివ్ మెంబరుగా వుండేది. దాంతో ఆమెకు సామాజిక సంబంధాలు బాగా వుండేవి. గ్రామాల్లో రోడ్లు వేయించడంలో, వెనుకబడిన ఆరోగ్య కేంద్రాలను సమీక్షించి వాటికి సహాయం చేయడంలోనూ ఆవిడ ముఖ్యపాత్ర వహించేది. అలాంటి సమయాల్లోనే ఆమెకు గ్రామీణ ప్రజలకు ఉపయోగించే డాక్యుమెంటరీ చిత్రాలను తియ్యాలనే సంకల్పం కలిగింది. ఆ ఉద్దేశంతోనే రాధానారాయణన్ 'హిల్‌మాన్ ఫిల్మ్ ప్రైవేట్ లిమిటెడ్' కంపెనీలో పార్టనర్ అయింది.

ఆవిడ ఎన్నో సినిమాలు తీసినా ప్రధానంగా చెప్పుకోదగిన రెండు సినిమాల్లో 'ఓవల్‌క్రాప్' ఒకటి. ఇది కోళ్ల ఫారంని



ఎలా నడపాలి, దాంట్లో వుండే సాధక బాధకాలు ఏమిటి, వాటిని ఎలా అధిగమించవచ్చు అన్న విషయాలను తెలియచెప్పే చిత్రం. ఇది కేవలం సందేశాత్మకంగానే కాకుండా పట్టణవాసులు కూడా మెచ్చేరీతిలో చక్కని కథానేపథ్యంతో, ఉత్సాహపూరితంగా వుంది. ఈ చిత్రం అనేక జాతీయ, అంతర్జాతీయ అవార్డులను పొందింది.

మరో సినిమా 'ఆవులు, గేదెలతో డైరీ ఫారమ్‌ను ప్రారంభించి చక్కని లాభాలతో వ్యాపారాన్ని ఎలా చేసుకోవచ్చు' అన్న విషయంమీద తీసినది. ఇది కూడా విసుగు కలిగించనిరీతిలో తీయడంతో ప్రేక్షకులను ఆకట్టుకోగలిగింది. వేరొక చిత్రం 'సుబాబుల్'. ఇది మందుల సమస్యపై చిత్రీకరించబడింది. ఇలా మొత్తం 26 చిత్రాలను తీసిందామె.

**"ఎన్ని అవార్డులను పొందినప్పటికీ ఈ చిత్రం చూసిన తరువాత గ్రామీణుల కళ్లల్లో కనుపించిన సంతృప్తే నాకు కోటి అవార్డులతో సమానం" అంటుంది రాధానారాయణన్**

---

## చిత్రాలద్వారా వైద్యం

నీలగిరి పర్వతాలలోని కొన్ని గుహల్లో గోడలపై వేసిన పెయింటింగ్స్‌ని పరిశీలిస్తే ఎన్నోవేల సంవత్సరాల క్రితమే మనిషి 'ఫ్లయింగ్ సాసర్స్'ని చూశాడని చెప్పవచ్చంటున్నారు పరిశీలకులు. చిక్కని ఎరుపు రంగులో కనుపించే ఈ వర్ణచిత్రాలు చక్కని గీతలు, వృత్తాలు, చుక్కలతో నిండి ఇప్పటి ఆధునిక చిత్రకళకి సన్నిహితంగా కనుపిస్తాయి.

పెద్ద పెద్ద గుండ్రాళ్లు కొన్ని త్రికోణాకారంలోనూ, విభిన్న ఆకృతుల్లోనూ అందంగా మలిచారు. ఇవి ఎన్నో శతాబ్దాలకు పూర్వపువని అంటున్నారు శాస్త్రజ్ఞులు. ఆ పరిసరాల్లో నివశించే కొండజాతివారు మాత్రం ఆ రాళ్లనీ, వర్ణచిత్రాల్నీ ఏ దేవతలో తయారుచేశారని నమ్మి వాటియందు భయభక్తులను ప్రదర్శిస్తారు. పశువులను మేపుకునేందుకు ఆ ప్రాంతానికి వచ్చినా ఆ రాళ్ల దగ్గరకు మాత్రం పోకుండా దూరంనుంచే తప్పుకుపోతారు. అందువల్లనే బహుశా ఆ రాళ్లపై చిత్రాలు ఇప్పటికీ చెక్కుచెదరకుండా వున్నాయి.

పరిశీలకులు అక్కడికి వెళ్ళినప్పుడు దుమ్ము కొట్టుకునివున్న ఆ చిత్రాలను, నీళ్లతో కడిగి శుభ్రం చేయగా అవి స్పష్టంగా కనుపించాయి. వాటిని మధ్యప్రదేశ్‌లోని బిమ్‌పట్కా గుహలలోని చిత్రాలతో పోల్చిచూస్తే వాటికన్న ఇవే పురాతనమైనవని తేలింది. బిమ్‌పట్కా గుహల్లోని చిత్రాల్లో విల్లు, అమ్ములు కూడా చిత్రించి వున్నాయి. కానీ ఇక్కడి నీలగిరి గుహల్లోని చిత్రాలలో కేవలం చేతి ఆకారంలో వున్న ఆయుధాల వర్ణచిత్రాలున్నాయి. అంటే బిమ్‌పట్కా గుహల చిత్రాలు క్రీ.పూ. 5,000 సంవత్సరాల నాటివైతే ఇవి సుమారు 8,000 నుంచి 10,000 సంవత్సరాలకి పూర్వంవి కావచ్చు. వాటిని మరింతగా పరిశీలించగా మరిన్ని ఆశ్చర్యకరమైన చిత్రాలు బయటపడ్డాయి. ఆ చిత్రాలలోని రకరకాల గీతలు, చుక్కలు కోట ఆకారాల్లో కనుపించాయి.

అక్కడి ప్రజలను గుచ్చి గుచ్చి అడిగితే వారు చెప్పిందేమంటే ఈ గుహలగుండా మరికొంత ముందుకుపోతే అక్కడ 'తోడవర్ మండు' అనే ఓ ప్రాంతమొస్తుందనీ, బహుశా ఈ చిత్రాలని 'తోడా' తెగకు చెందినవారు చిత్రించి వుండవచ్చుననీ! ఈ చిత్రాలున్న రాళ్లను వాళ్లు 'తోడవన్ పరయ్' అని పిలుస్తారు.

కొందరయితే, ఇవి అప్పటి వైద్యులు వేసిన చిత్రాలనీ, వీటి ద్వారా అప్పట్లో రోగాలను నయం చేసేవారనీ కూడా అంటారు. నీలగిరిలోనే సికూర్ ఫారెస్ట్ ఏరియాలో





కూడా కొన్ని పురాతన చిత్రాలున్నాయి. కట్టుదిట్టమైన రక్షణ ఏర్పాట్లతో తప్ప ఆ ప్రాంతాన్ని చేరుకోవడం కష్టమని అంటున్నారు అక్కడివారు.

నీలగిరిలోనే 'కొనవాకొరయ్' అనే మరో ప్రాంతంలో కూడా గుహల గోడలపై, కొండరాళ్లపై ఇలాంటి చిత్రాలున్నాయి. ఈ ప్రాంతానికి చేరుకోవడం కొంచెం తేలికే. ఇక్కడి పెయింటింగ్స్ రెండు రకాలు. రాతిపై రంగులతో వేసిన చిత్రాలు 'పిక్టోగ్రాఫ్స్' రాతిలోనే మలచిన చిత్రాలు 'పెట్రోగ్లిఫ్స్!'

నీలగిరి జిల్లాలో కోటగిరి వద్ద ఈ 'కొనవాకొరాయ్' గుహలున్నాయి. ఈ గుహద్వారం

చిత్రాలు ఫ్లయింగ్ క్రీచర్స్‌కి సంబంధించినట్లుగా ఉన్నాయి. రాకెట్ ఆకారంలో ఓ చిత్రం వుంది. అదికాక పక్షి తల కలిగిన మనిషి బొమ్మ ఒకటుంది. మరికొన్ని బొమ్మల్ని ప్రాచీనకాలపు మంత్రగాళ్లు వేశారేమోనని పిస్తుంది. ఆ బొమ్మల్లో ప్రధానంగా శూలం కనిపిస్తుంది. ఆ ప్రాంతాల్లో రాత్రుళ్లు ఎవరూ వుండలేరు. ఎలుగుబంట్లు విచ్చలవిడిగా తిరుగుతాయి గనుక!

ఇవన్నీ పరిశీలిస్తే పూర్వం కూడా ఎగిరేపళ్లాల వంటివి వుండవచ్చునంటున్నారు పరిశీలకులు. మరయితే ఇతర గుహలలోని ప్రాణులతో కూడా ఆనాటి మనిషికి సంబంధా




మనిషి ఎత్తునవుండి, 10 అడుగులు లోపలికి వుంటుంది. ఇవి మనుషులు నిర్మించిన గుహల్లాగే కనుపిస్తాయిగానీ, అంత సహజంగా వుండవు. గుహ పరిసరాలను పరిశీలిస్తే నిత్యం జంతువులు వచ్చి అక్కడ నిద్రించి వెడుతున్నట్లనిపిస్తుంది.

ఈ చిత్రాల్లో కొన్ని పరిశీలకులకు చాలా ఆశ్చర్యాన్ని కలిగించాయి. ఓ మనిషి ఏదో ఎగురుతున్న వస్తువునుంచి తాడు సహాయంతో వేలాడుతున్నట్లుగా కొన్ని చిత్రాలున్నాయి. మరో మనిషి ఈనాటి స్పేస్ సూట్ లాంటిది ధరించినట్టుగానూ వుంది. ఎక్కువ

లుండేవా? అన్న అనుమానం కలుగుతుంది. ఇలాంటి చిత్రాలు గీయడాన్ని మనిషి వేరే గ్రహవాసుల వద్ద నేర్చుకున్నాడా అనిపిస్తుంది. ముఖ్యంగా అప్పటి కొన్ని చిత్రాలను పరిశీలిస్తే ఆధునిక విజ్ఞానయుగానికి సంబంధించినవిగా కనపడుతున్నాయి.

కాబట్టి మనిషి నాగరికుడుగా ఎప్పటినుంచి మారాడు అనేది నిర్దిష్టంగా చెప్పడం కష్టమే.



# చతుర

సంపుటి : 21    సంచిక : 7    ఆగస్ట్ 1998

స్కూలుకి లేటుగా వచ్చిన విద్యార్థినిని ఆలస్యానికి కారణమేమిటని నిలదీసింది టీచర్.

"మా ఇష్టం. సవాలక్ష కారణాలుంటాయి. అన్నీ మీకు చెప్పాలా?" అంటూ ఎదురు తిరిగిన ఆ అమ్మాయిని చూసి నివ్వెరపోయింది టీచర్.

కానీ... అనతికాలంలోనే పదవతరగతిలో స్కూలుకే ఫస్ట్ వచ్చిన ఆ అమ్మాయి అంతకుముందు తానెదిరించిన ఆ టీచర్‌యందే ఆరాధనాభావాన్ని పెంచుకోవడం ఎలా సంభవమైంది?

స్కూల్లో అందరికీ అత్యంత ప్రీతిపాత్రురాలయిన ఆ ఉపాధ్యాయురాలిని అక్కడినుండి బదిలీ చేసినప్పుడు... విద్యార్థుల స్పందన ఏ తీరులో వుంది?

మొండి విద్యార్థులను సైతం తనవైపుకు తిప్పుకుందుకు ఆమె అవలంభించిన మార్గం ఏమిటి?

పాఠకుల మనసులను మరొక్కమారు తమ విద్యార్థిదశలో విహరింపచేసే తనికెళ్ళ కల్యాణి రచన 'ఆర్తి' ఈ నెల చతుర సమగ్ర నవల.



చల్లటి గాలి వారిద్దరి శరీరాలను తాకి గిలిగింతలు పెడుతోంది. త్రోవ పొడవునా ఉన్న చెట్ల ఆకులు, కొమ్మలు గాలికి అటూ ఇటూ ఊగుతున్నాయి.

"ప్రకృతి అంత అందమైంది మరొకటి లేదేమో సృష్టిలో" పరవశంగా చుట్టూ చూస్తూ అనుకుంది శిరీష.

సూర్యుడి బంగారు కిరణాలు చెట్ల ఆకులపై పడి అవి తళతళా మెరుస్తున్నాయి. రోడ్డుకిరుపక్కలా పొదలు, ఆ పొదలపై నీలం, ఎరుపు చిన్నచిన్న పువ్వులున్న ఏవేవో మొక్కలు, అవి ఆ ఉదయ సంధ్య వేళలో ఆకర్షణీయంగా కన్పిస్తున్నాయి.

శిరీష గాలికెగురుతున్న ముంగురులను అలవోకగా సర్దుకొంది. రెప్పవేస్తే ఈ అందాలు చూడటం అవదేమోనన్నట్లు కళ్లను విప్పార్చి ఆనందంగా చూస్తోంది.

"శిరీ!" రవి అపురూపంగా పిలిచాడు.

"ఊ..." అందేగానీ తన లోకం నుండి ఈ లోకానికి రాలేదు.

"అదిగో నీ సామ్రాజ్యం వచ్చేస్తోంది"

రవి మాటలకి ఆమె తన ధోరణిని విడిచి అతడి భుజానికి తల ఆనించింది.

"రాణీగారు ప్రకృతి ఆస్వాదన నుండి బయటపడ్డారన్న మాట" చిన్నగా అన్నాడు రవీంద్ర.

"నాకు ఈ ఉదయం పూట స్కూళ్లంటే చాలా ఇష్టం. ఎంత ప్రశాంతంగా, అందంగా ఉన్నాయో కదా ఈ పరిసరాలు. నిజం చెప్పండి, ఈ ఉద్యోగం అంటూ ఉంది కనుక ఇంత ఉదయమే ఇలా రాగలిగాం. లేకపోతే ఇంత శ్రద్ధగా వస్తామా?" దూరంగా కన్పిస్తున్న కొండలను పరవశంగా చూస్తూ అంది శిరీష.

స్కూటర్ స్కూలుని సమీపించడంతో అతడు ఏమీ సమాధానం చెప్పలేదు. శిరీష ఆరాధనగా ఆ స్కూలువైపు చూసింది.

'జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల' అన్న బోర్డు గేటుపైన అందంగా కనబడింది. ప్రతి రోజూ శిరీష ఆ బోర్డు చూస్తుంది. ఆ పెద్ద గేటు దాటగానే ఎదురుగా పెద్ద బిల్డింగ్. ఆ బిల్డింగ్‌కి అటూ ఇటూ దగ్గరలో మరో రెండు చిన్న బిల్డింగ్‌లు.

పసుపు రంగులో ఆ బిల్డింగ్స్ ఠీవిగా కన్పిస్తున్నాయి. బిల్డింగ్స్‌కి ముందు విశాలమైన గ్రౌండ్. పిల్లల ఆటలకొరకు సగం స్థలం కేటాయించారు. మిగతా సగం కూరలు, పువ్వులు తోటవేసి పెంచుతున్నారు. బిల్డింగ్ ముందు వరుసగా అశోక వృక్షాలు, టేకు చెట్లు.

స్కూలు కాంపౌండ్ చుట్టూ ఉన్న ఫెన్సింగ్ చూడగానే శిరీషకి నవ్వు వస్తుంది. ప్రతీ సంవత్సరం టీచర్లంతా కలిసి బందోబస్తుగా ఆ ఫెన్సింగ్ పెట్టించడం, త్వరలోనే ఊళ్లోవాళ్లు దాన్ని పీకి రహదారి చేయడం మామూలైపోయింది.

అయినా సరే పట్టువదలని విక్రమార్కుళ్లాగ మళ్లీ కంచె ఏర్పాట్లు మొదలు. ఫెన్సింగ్ చుట్టూ ప్రభుత్వం ఇచ్చి పెంచమన్న నిమ్మ, నారింజ, జామ మొదలైన మొక్కలు.

శిరీషని చూడగానే అప్పటికే వచ్చేసిన కొందరు విద్యార్థులు వచ్చి చుట్టుముట్టేశారు.

"గుడ్‌మార్నింగ్ మేడమ్, గుడ్‌మార్నింగ్ సార్" అంటూ వాళ్లు దగ్గరికి రావడంతో శిరీష నవ్వుతూ వాళ్లందరినీ విష్‌చేసి ముందుకి నడవసాగింది.

ఆఫీసు రూంలోకి వెళ్లి హెడ్‌మాష్టార్ను విష్‌చేసి తిరిగి గ్రౌండ్‌లోకి వచ్చింది. హెడ్ మాష్టార్ సుబ్బారావుగారు రవీంద్రతో కబుర్లలో పడ్డారు.





'ఈ దంపతుల్లాగ అందరూ వర్క్‌మైండ్‌తో ఉంటే విద్యాభివృద్ధి ఎందుకు జరగదు?' అనుకొన్నారు ఆయన దూరం నుండి కన్పిస్తున్న శిరీషను, పిల్లలను చూస్తూ.

ప్రార్థన టైమ్ అవడంతో బెల్ కొట్టించి గ్రౌండ్‌లోకి వచ్చారు వాళ్లిద్దరూ.

డ్రిల్లుమాష్టారు ప్రదీప్ చండశాసనుడు. పిల్లలను కొట్టాడంటే గుబగుయ్‌మనవలసిందే. ఎంత కోపిష్టో, అంత మంచివాడు. పిల్లలను ఎన్ని రకాల ఆటలు ఆడిస్తాడో చెప్పలేం. క్రమశిక్షణకి మారుపేరు అతడు. అతడి కోపాన్ని చూడటానికి పిల్లలు ఇష్టపడరు.

"మోర్నింగ్ స్కూల్ అయినా త్వరగా తెమిలి వచ్చేశారే? " అతడు నవ్వుతూ శిరీషను పలకరించాడు.

"నిజం చెప్పాలంటే నాకు ఈ టైములో స్కూల్‌కి రావడం ఎంతో ఇష్టం" నవ్వుతూ చెపుతున్న శిరీషను ఆప్యాయంగా చూశాడు రవీంద్ర.

ఈ ఉదయం స్కూల్ సమయంలోనే కదూ తనకీ శిరీషకి పరిచయం ఏర్పడింది. అతడి పెదవులు నెమ్మదిగా నవ్వుకొన్నాయి.

ప్రేయర్‌కు టీచర్లు తప్పక ఉండాలన్నది ఆమె అభిమతం. క్రమశిక్షణ మొదట ఉపాధ్యాయుడే పాటించకపోతే విద్యార్థులేం పాటిస్తారు? వాళ్లకి చెప్పే అర్హత మనకి ఎలా ఉంటుంది?

ప్రేయర్ అవుతోంటే కొందరు, అయిన పావుగంటకి కొందరు చొప్పున అందరూ స్కూల్‌కి చేరారు.

"ఉదయమే లేవడం, ఈ పరుగులు పెట్టడం గొప్ప కష్టం" ఆయాసపడుతూ అన్నాడు తెలుగు మాష్టారు.

"ఏం స్కూళ్లు లెద్దురా! ఇటు ఉదయమే పరుగులు, అటు ఎండలో చెమటలు కక్కుకుంటూ కొంపకి వెళ్లడం. మన ప్రాణాలకి వచ్చాయి ఈ స్కూళ్లు" సైన్సు అసిస్టెంటు కినుకగా అన్నాడు.

"మనమే ఇలా అనుకొంటే పాపం విద్యార్థులకి ఎంత అవస్థ? వాళ్లు చుట్టుపక్కల ఊళ్లనుండి రావాలి. ఎండలో అంత దూరం వెళ్లడం ఎంత కష్టం? " సెకండరీ అసిస్టెంటు శ్యామల వాళ్లని చూస్తూ అంది.

"వాళ్లకేం లెండి. వాళ్లు పల్లెటూరివాళ్లు. ఎటువంటి కష్టాన్ని అయినా ఓరుస్తారు" మరొకరు తేలిగ్గా అన్నారు.

అప్పటికే శిరీష తన క్లాసుకి వెళ్లడానికి డస్టర్, సుద్దముక్క తీసికొని బయలుదేరింది. శ్యామల ఆమెని అనుసరిస్తూ "వాళ్ల మాటలు వింటున్నావా" అంది.

"వాళ్లంతే. అలాగే ఆలోచిస్తారు. సర్లే గానీ పాపకి జ్వరం తగ్గిందా? "

"లేదు. సాయంత్రం మళ్లీ డాక్టరుదగ్గరికి తీసుకెళ్ళాలి" శ్యామల జవాబు చెప్పి తన క్లాసు రావడంతో లోపలికి వెళ్ళిపోయింది.

శిరీష తొమ్మిదవ తరగతిలోకి ప్రవేశించింది. మార్చినెల కావడంవలన, కోర్సులు అయిపోవడం వలన రివిజన్ ప్రారంభించింది. రివిజన్‌లో విద్యార్థులు ఎక్కువగా పాలు పంచుకోకపోతే ఆమె ఒప్పుకోదు. రోజుకి రెండు పాఠాలు చదువుకొని రమ్మనడం, అందులో ప్రశ్నలు వేసి, వాళ్ళచేత చెప్పించడం, వాళ్లకి డౌట్స్ ఉన్నవి, అర్థంకానివి మళ్ళీ చెప్పడం, ఇలాగ కాలం తెలియకుండానే నడుస్తుంది.

పిల్లలకి ఆమె అంటే ఎంత ఇష్టమో, గౌరవమో అంతే భయం కూడా ఉంది. ఆమె మెప్పు పొందాలని వాళ్ళు ఎంతో తాపత్రయపడతారు. పోటీపడి ఆమె సబ్జక్టు శ్రద్ధగా చదువుతారు.



క్లాసునుండి వచ్చేస్తూ టెన్త్‌క్లాసు దగ్గర ఆగింది. అక్కడ రవీంద్ర లెక్కలు చెపుతు న్నాడు.

బోర్డుమీద చేసిన లెక్కను వాళ్ళకి అర్ధమ య్యేలాగ వివరిస్తున్నాడతను. గంభీరంగా వినబడుతున్న అతడి గొంతు వింటూ అక్కడే అయిదు నిముషాలుండిపోయింది.

"అమ్మ దొంగా! ఇదా నువ్వు చేస్తున్న పని" ఎప్పుడు క్లాసునుండి వచ్చాడో రవీంద్ర చిలిపిగా అంటూ ఆమెవైపు నడిచాడు.

అతడికి దొరికిపోయినందుకు సిగ్గుప డింది. అతడు తరువాత పీరియడ్ నైంత్ క్లాసుకి వెళ్లిపోవడంతో శిరీష స్టాఫ్ రూంవైపు నడిచింది.

రవీంద్ర లెక్కలు చాలా బాగా చెపుతా డని ప్రతీతి. అతడు చెపుతుంటే ఎప్పుడో ఏ అయిదు నిముషాలో వినడం తప్ప పూర్తిగా వినలేదెప్పుడూ!

లెక్కలు, ఇంగ్లీషు ఎంతో కష్టమైనవని, పిల్లలు భయంతో వాటికి దూరమవుతున్నా రని ఎందరో టీచర్లు అనుకుంటూంటారు. కానీ పదవ తరగతి లెక్కలంటే అతడికి నల్లే రుమీద నడకే. ఎంతో సులువుగా, పిల్లలకి అర్థమయ్యేలాగ చెపుతాడు. సాధారణంగా అతడి లెక్కల్లో ఎవరూ ఫెయిలవరు.

ప్రైవేట్లు చెప్పమని అతడినందరూ అడు గుతారు. ప్రైవేట్లు చెప్పడంవలన నాలుగు డబ్బులు వెనకవేసుకోవచ్చునని స్నేహితులు చెపుతారు. అయినా అతడు వినడు.

"నా శక్తి, తెలివితేటలు ఈ స్కూలు పిల్ల లకి ఉపయోగపడాలి. క్లాసులో బాగా చెపితే ప్రైవేట్ల అవసరమేముంటుంది? నాకంటూ నా కుటుంబంతో గడిపే టైము ఉండ వద్దా? డబ్బు సంపాదనకి అంతు ఏం ఉంది." అనే అతడితో వాదించలేక వాళ్లు నోరుమూసుకొంటారు. కొందరు మాత్రం ఎదగడం చేతకాని వాడంటారు. వారికీ వీరికీ చిరునవ్వే అతడి సమాధానం.

ఒంటిగంటకి శిరీష కేరేజీ విప్పి టిఫిన్ ఇద్దరికీ సర్దుతుంది. కొలీగ్స్, వాళ్ల అన్యోన్యతని చూసి ఉడుక్కుంటారు. వాళ్ల ఇద్దరినీ ఒకే బెంచీలో కూర్చోమంటారు. రవీంద్ర వినడు. వేరే కుర్చీ తెచ్చుకొని బెంచీకి ఎదురుగా వేసుకొంటాడు.

మధ్యాహ్నం వేళ ఊళ్లోని టీచర్లు ఇళ్లకి వెళ్లిపోతారు. రవీంద్ర శిరీషని చూస్తూ కబుర్లు చెపుతూ తింటాడు. అతడికి ఆమె అంటే ఎంత ప్రాణమో అనిపిస్తుంది చూసే వారికి.

లాస్టు పీరియడ్‌లో వరండాలో గలాభా అవుతుంటే టీచర్లూ, క్లాసులలోని వాళ్లు కూడా బయటికి వచ్చారు.

ఊళ్లో అతను గట్టిగా అడుగుతున్నాడు "మా పిల్ల ఏడవ తరగతని తెలుసును. పబ్లిక్ పరీక్ష రాసే పిల్లని కూరలకి పంపి స్తారా? మా పిల్లలని చదువు చెప్పమని మీ దగ్గరికి పంపిస్తున్నామా, కూరలూ, పువ్వులూ తేవడానికి పంపిస్తున్నామా? "

జానకమ్మగారు అతడికేం తీసిపోలేదు. "పిల్లలని నేను ఒక్కర్తెనే పంపుతున్నానా? వేరెవరూ పంపడం లేదా? నేనంటే గిట్టక ఇలా తగాదాకి వచ్చారా? " అంటోంది.

"అదే బుద్ధిలేనిమాట. ఏ మాష్టారైనా పాఠం వినేపుడు అలా పంపడం లేదు. మీరే అలాగ చేస్తున్నారు" అతడు ఒంటికాలి మీద లేస్తూ అన్నాడు.

హెడ్‌మాస్టారు ఇద్దరినీ ఆపలేక సతమత మవుతున్నారు. జానకమ్మని తగ్గమంటే తగ్గదు. క్రాఫ్టు మాస్టారు, సైన్సు మాస్టారు తగాదా చల్లార్చలేకపోతున్నారు.

"పిల్లల్నిలా పంపిస్తారాండీ! అసలీమె పాఠం చెపుతుందాండీ? నా పిల్లకి పాఠాలు పోవడంలేదా? " అంటున్న అతడి మాటలకి





ఏం జవాబు చెప్పగలరు?

"నీ బిడ్డ నిద్రమొహంది. ఎక్కడికి పంపినా ఏడుపు మొహం, ఈడుపుకాళ్లూ. చదువుసరిగా రాకపోతే నేనేదో పాఠాలు చెప్పకుండా జీతం తీసుకొంటున్నట్లు ఈయన గింజుకొంటాడు. పనికిమాలిన ఊరు, దిక్కుమాలిన సంత" జానకమ్మ విసురుగా అనేసింది.

హెడ్‌మాష్టారు ఆవిడ మాటలకి తలప ట్టుకొన్నాడు.

ఊరి అతడికి దాంతో అగ్నిమీద ఆజ్యం పోసినట్లయింది. అతడు కాస్త చదువుకొన్న వాడు. కూతురికి క్లాసు పాఠాలు పోతున్నా యని అతడి బాధ.

"చెప్పేస్తున్నావు లేమ్మా మాలావు చదువు. నా బిడ్డని నీ ఇష్టం వచ్చినట్లు అంటే ఎవరూ ఊరుకోరు" అతడు కోపంతో ముందుకు అడుగులేస్తూ అన్నాడు.

వాళ్లిద్దరినీ శాంతింపచేయడానికి అందరూ ఎంతో కష్టపడ్డారు. చివరికి మరొకసారి అలాగ జరగనివ్వనని హెడ్ మాష్టారు గారు మాట ఇచ్చాక అతడు వెళ్లాడు.

"ఆ.. వెధవ ఫోజు. వీళ్ల పిల్లలని ఇంట్లో ఏ పనులూ చేయనీయకుండానే పెంచుతు న్నారా? మావర్గం వాళ్లకి చెప్పానా సాయంత్రం వీడి పనవుతుంది" జానకమ్మగారు ఇంకా వదలలేదు.

"మేడమ్‌గారూ! కాస్త మీరు ఊరుకొం టారా" హెడ్‌మాష్టారు చిరాకుగా అరిచారు.

వెళ్లినవాడు ఈవిడ మాటలు విని మళ్లీ వెనక్కి ఎక్కడవస్తాడో అని ఆయన భయం. అక్కడికీ ఆయన అతడికి ఎంతో నచ్చచెప్పారు. మిగిలిన మాష్టార్లు కూడా "ఈ పిల్లలు మా పిల్లలే కదండీ! మా పను లకి అప్పుడప్పుడు వాళ్లని పిలవకపోతే అవ్వవు" అని సర్దిచెప్పారు.

అయినా జానకమ్మ గారికి అదే దుర్గుణం. పిల్లలిని అందరినీ ఒక్కలాగ చూడదు. కొందరిని చేరదీస్తుంది. కొంద రిని సాధిస్తుంది. ఆవిడకి ఎప్పుడూ ఏవో పనులు ఉంటూనే ఉంటాయి.

పిల్లలని ఆరుగురిని, ఏడుగురిని తలో పనిమీద బయటికి పంపిస్తుంది. ఆయన ఎన్నిసార్లు హెచ్చరించినా వినదు.

"సింగిల్ సెషన్ స్కూలప్పుడు కూడా పిల్లలని కూరలకి ఎందుకు పంపారు? ఎండలో వాళ్లు తిరుగుతూ ఉంటే తల్లిదం డ్రులూరుకొంటారా? ఎన్నిసార్లు చెప్పినా మీరు విన్పించుకోరు" హెడ్‌మాష్టారు గట్టి గానే ఆవిడని నిలదీశారు.

"మీదంతా మరీ చోద్యం. సింగిల్ సెషన్ అయితే కూరల అవసరం ఉండదా? మన వాళ్లు పొలాలనుండి ఉదయమప్పుడే తెస్తూ ఉంటారని పంపాను. పెద్ద రాద్ధాంతం చేస్తున్నారు" ఆవిడ విసవిసలాడుతూ వెళ్లి పోయింది.

మరికాసేపు ఆ విషయంమీదే టీచర్లు మాట్లాడుకొన్నారు. శ్యామల ఆసక్తిగా శిరీష వైపు రవీంద్రవైపు చూసింది. ఇందరు ఇన్ని విధాలుగా మాట్లాడుతున్నా వాళ్లిద్దరూ ఆ విషయంపై ఏం మాట్లాడలేదు. రవీంద్ర పిల్ల తండ్రికి సర్దిచెప్పడం ఆమెకి గుర్తు వచ్చింది.

"శిరీషా! నువ్వేం మాట్లాడవేం? " శ్యామల ఉండబట్టలేక అడిగేసింది.

"ఏం మాట్లాడను? అది నాకు అనవసర విషయం" నిక్కచ్చిగా అంటున్న శిరీషను శ్యామల ఆశ్చర్యంగా చూసింది.

"ఔను శ్యామలా! మేడమ్‌గారు ఆ అలవా టుని మానుకోరు. ఆవిడ విషయంలో ఏదన్నా మాట్లాడవలసింది హెచ్. యమ్ కదా"




"అయితే పిల్లల్ని మన పనులమీద పంపడం మంచిపననా నీ ఉద్దేశ్యం!"

"నేను అలా అన్నానా? పాఠం చెప్పే సమయంలో పంపడం తప్పే. మన పనులు మనం వేరే సమయాల్లో చూసుకోవాలి. అయితే పిల్లలకి, టీచర్లకి మంచి అనుబంధం ఉంటే ఇలాంటివి ఎదురవ్వవు. తగాదాలూ రావు

"పిల్లలు మాత్రం వాళ్ల పనులు కొన్ని మన మాష్టర్లకి చెప్పడం లేదా? టౌను నుండి వచ్చేవాళ్లను నోట్సులు, వైట్ పేపర్స్, పెన్నులు తెచ్చిపెట్టమని కోరడం లేదా? కొందరు మాష్టర్లు తెస్తారు, కొందరు ప్రెస్టేజ్ పోతుందని తీసికొనిరారు"

శ్యామల శిరీష విశ్లేషణకి ఆశ్చర్యపోయింది. అమ్మదొంగా అనుకొంది. తామందరూ అయితే ఇటో అటో ఏదో ఒకటి అనేస్తారు.

"దేవిగారికి ఇంకా ఆకలి వేయడంలేదా?" రవీంద్ర స్కూటర్ స్టార్టు చేస్తూ అడిగాడు. శిరీష నవ్వుతూ అతడిని అనుసరించింది.

మధ్యలో కిళ్లీషాపు దగ్గర స్కూటరాపి ఇద్దరికీ నిమ్మ షోడాలు తీసుకొన్నాడు. ఇంటికి వెళ్లిపోతుంటే ఇవెందుకు అన్నా విన్పించుకోలేదు.

* * *

"అరుగో! వాళ్లిద్దరూ వచ్చేశారు. ఇహనయినా మీరు భోజనానికి లేస్తారా?" సావిత్రమ్మ చిరాకుగా కూతురిని, కొడుకును చూస్తూ అంది.

మరిది, ఆడపడుచు అప్పటివరకూ భోజనాలు చెయ్యకుండా తమ కోసం ఉండిపోయినందుకు శిరీష ఎంతో నొచ్చుకొంది.

"అమ్మ మాటలకేం గానీ నువ్వు తాపీగా మొహం కడుక్కొని రా వదినా" లావణ్య ఆప్యాయంగా అంది.

శిరీష త్వరగానే కాళ్లూ చేతులూ, మొహం కడుక్కొని మొహానికి కుంకుమ బొట్టు పెట్టుకొని వచ్చింది. సావిత్రమ్మ అందరికీ వడ్డించింది.

"అశోక్! మేం వచ్చేటప్పటికి ఒంటిగంటన్నర అయిపోతుంది. రేపటినుండి మా కోసం ఉండకండి. ఇంత లేటయితే అమ్మకి అన్నం సయిస్తుందా?" శిరీష మరిదిని చూస్తూ అంది.

"అన్నం తినబుద్ధి వెయ్యదు వదినా! అన్నయ్య, నువ్వూ వచ్చాక కబుర్లు చెప్పుకొంటూ తిందామని ఆగాం"

అశోక్ మాటలకి లావణ్య కవ్వింపుగా చూసింది. "ఏమిటి బాబూ? అన్నం తిన బుద్ధి కాదా? అన్నయ్యకోసం ఉండిపోయావా? పాపం వట్టి కడుపుతో ఎలా ఉండిపోయాడో? అంతే కదూ చిన్నీ!"

లావణ్య మాటలకి అశోక్ ఉడుక్కున్నాడు.

"అయితే చిన్నూ ఏం తిన్నావురా ఈ లోపల?" రవీంద్ర నవ్వుతూ అడిగాడు తమ్ముడిని.

"ఏం లేదన్నయ్యా! రెండు అప్పడాలు, రెండు అరటిపళ్లు, నాలుగు దొండకాయలు, గరిటెడు పెరుగు కప్పులో వేసికొని చెంచాతో తినడం, ఇలాగ ఏదో సర్దుకొన్నాడు" లావణ్య చిన్నన్నయ్యని ఉడికిస్తూ అంది.

అశోక్ కళ్లతోనే చెల్లెలివైపు ఉరిమి చూశాడు.

"అబ్బబ్బ. ఇద్దరికీ క్షణం పడదుకదా! రవీ నువ్వు వీళ్ళని మరీ గారాబం చేస్తున్నావురా! వాళ్లని భరించలేక చస్తున్నాను" సావిత్రమ్మ పెద్ద కొడుక్కి ఫిర్యాదు చేసింది.

"వాళ్లనేం అనకండి అత్తయ్యగారూ! వాళ్లు లేకపోతే ఇంటికి కళేలేదు" శిరీష వాళ్లని

వెనకేసుకొచ్చింది.

"ఇదిగో శిరీ! నువ్వు వచ్చాక వీళ్ల అల్లరి మరీ ఎక్కువైపోయింది. వాళ్లమీద ఈగ వాలనివ్వవు" ఆవిడ కాస్త కినుకగానే అంది.

"ఈగ ఏంకర్మ? ఏనుగులాంటి మాటలే విసురుతున్నావు కదమ్మా! పైగా ఈ ఫిర్యాదు దేనికి? " అశోక్ నిలదీశాడు.

ఆవిడ వాళ్లని తిడుతూనే ఉంటుంది. ఏ వయసుకి ఆ వయసు అల్లరి ముద్దంటుంది శిరీష. వదినగారి సపోర్టుతో వాళ్లు తల్లిని పట్టించుకోరు.

శ్వేత, శశాంక వీళ్ల కబుర్లకి లేచిపోయారు. "డాడీ! వచ్చేశారా? " శ్వేత తండ్రి దగ్గరికి వచ్చి కూర్చుంది. అతడు కూతురిని ఆప్యాయంగా చూస్తూ పెరుగుముద్దలు అందించాడు. శశాంక తల్లి దగ్గర చేరిపోయాడు.

"ఒరేయ్ రవీ! వాళ్లకి నేను కడుపునిండా పెరుగూ అన్నీ వేసి పెట్టానురా! నువ్వు తినరా!" సావిత్రమ్మ కొడుకుని హెచ్చరించింది.



"నువ్వు పెట్టలేదని కాదమ్మా! నాకు అల వాటు" రవి నవ్వుతూ అంటూ కొడుక్కి కూడా పెట్టాడు.

"అమ్మా! నీ మాతృహృదయం అన్నయ్య కోసం, అన్నయ్య పితృహృదయం తన బిడ్డ లకోసం ఎంత పరితపించిపోతున్నాయి. అందుకే అన్నారు పెద్దలు పెళ్లి, పిల్లలు ఇవన్నీ బంధాలని" అశోక్ ఎగతాళిగా అన్నాడు.

"అవునురా! రేపు నువ్వయితే పిల్లల దగ్గ రివి కూడా లాక్కొని తినేస్తావు" లావణ్య వెక్కిరింపుగా అంది.

"అవునత్తా! మా దగ్గర అలాగే తీసేసు కొంటాడు" శ్వేత ఫిర్యాదుకి అందరూ నవ్వే శారు.

ఎప్పుడూ ఆ ఇల్లు పెళ్లివారి ఇల్లులాగ కళకళలాడుతూ ఉంటుంది. తండ్రి పోవ డంతో తండ్రి ఉద్యోగంతోపాటు బాధ్యతలు కూడా రవి భుజంమీద పడ్డాయి.

తమ్ముడు యం.సి.ఏ ఆఖరి ఏడాది చదు వుతున్నాడు. నాలుగురోజులు సెలవులొ చ్చినా ఇంటికి వచ్చేస్తాడు. లావణ్య బి.య స్.సి ఫైనల్ ఇయర్ చదువుతోంది. ఈ ఏడాది పూర్తి అయితే చెల్లెలి పెళ్లి చేసెయ్యా లని రవి ఆలోచన.

శిరీష ధర్మమా అని ఇద్దరి జీతాలతో ఇల్లు చల్లగా సాగిపోతోంది. శిరీషతో తన పెళ్లి గుర్తుకు రాగానే రవి పెదవులు చిరు నవ్వుతో విచ్చుకున్నాయి.

"ఇంకా పడుకోలేదా? "

సెలవుపూట అయితే భోజనం అయ్యాక ఒక గంట అటూ ఇటూ దొర్లడం రవికి అల వాటు. ఇప్పుడైతే ఎండ చల్లబడే వరకూ ఉంటాడు.

భార్య ప్రశ్నకి అతడు కళ్లు విప్పాడు. అతడి చూపులు అందమైన ఆమె మొహం మీద నిలిచిపోయాయి.

రూపం, గుణం రెండూ ఉన్నతంగా ఉండటం ఎంత అదృష్టం అనుకున్నాడు.

"నిద్ర రావడం లేదు శిరీ! నీ గురించేఆ లోచిస్తున్నాను" అతడి మాటలకి ఆమె చివ్వున తలెత్తి చూసింది. ఆ సోగకళ్ల చూపులు మన్మథ బాణాల్లాగ అతడిని తాకాయి.

"మీకున్న అలవాటు అదేకదా! గతాన్ని హాయిగా నెమరువేసుకోండి" ఆమె వెళ్లిపో బోయింది.

అతడు ఆమె పమిట పట్టుకొని ఆపాడు. "పక్కన నువ్వు ఉండగా గతంలోకి వెడితే ఇంకా బావుంటుందేమో? " అతడు చిలిపిగా అడిగాడు.

"ఏం బావుండదు. అత్తయ్యగారు చెగో డీల పిండి కలిపారు. వెళ్లి చేసిఇవ్వాలి" ఆమె సున్నితంగా వదిలించుకొని వెళ్లిపో యింది.

అమ్మ మరీను. ఈరోజే పిండి వంట పెట్టెయ్యాలా? అతడు భార్యకి విశ్రాంతి దొరకలేదని చిరాకుగా అనుకొన్నాడు. చెల్లెలు భార్యని వెళ్లిపొమ్మనడం, తను తల్లికి సాయం చేస్తాననడం అతడికి విన్పిస్తూనే ఉన్నాయి.

అశోక్ ఎక్కువ పిండి కలిపిందని తల్లిని విసుక్కొంటూ అక్కడికి చేరాడు "వదిన అలి సిపోతుందని వచ్చావా నాయనా? " అంటూ తల్లి నిలదీసింది.

"అదేంకాదు. నువ్వు కలిపిన పిండితో ఈ రాత్రి అయిపోతుందనే భయంతో వచ్చాను." అతడు చేతికి నూనె రాసుకొంటూ అన్నాడు.

"వెధవ! ఊరు వెళ్లేటప్పుడు బోలెడు కావా లంటాడు. పనికి సాయం చేసేటప్పుడు గొణుగుతాడు. ఈసారి డబ్బా దగ్గరికి రా చెయ్యి విరిచేస్తాను" సావిత్రమ్మ కొడుకుతో





దెబ్బలాడింది.

"అమ్మా! నీ చిన్న కొడుకునికదే! నేను తినకపోతే నీకు అసలు తోచదు. చిన్నా! తినరా! చిన్నా నాలుగు నోట్లో వేసుకోరా అని నా ప్రాణం తినేస్తావని ఏదో తింటు న్నాను" అతడు తల్లి బాధపడుతుందని తింటున్నట్లు మొహం పెట్టి అంటూంటే వాళ్లందరూ నవ్వారు.

"బాబాయ్! నేనూ చెయ్యనా? " శశాంక అశోక్ భుజాల పైకెక్కబోతూ అడిగాడు.

"నీకెందుకు నాన్నా ఈ ఖర్మ. హాయిగా వెళ్ళి కేరమ్స్ ఆడుకోండి. నాలాగ పెద్ద య్యాక ఎలాగూ చాకిరీ తప్పదు" అంటున్న అశోక్‌ను సావిత్రమ్మ నమిలిమింగేసేలా చూసింది.

పిల్లలకి అశోక్ అంటే ఎంతో ఇష్టం. బాబాయ్ ఎంతో మంచివాడు. ఎప్పుడూ ఆడుకోమంటాడు అని బయటివాళ్ళతో చెపుతూ ఉంటారు.

శ్వేత కేరమ్‌బోర్డు తీసి తమ్ముడిని పిలి చింది. శిరీష మరిదిని కూడా వెళ్ళి వాళ్లతో ఆడుకోమంది. అతడు వదినగారు కష్టప డితే చూడలేడు. లావణ్య ఈ విషయంలో అతడితో దెబ్బలాట వేసుకొంటుంది. తను, అమ్మే ఉన్నప్పుడు వంటింటివైపే చూడడని ఫిర్యాదు వదినకి చేస్తూవుంటుంది.

రాత్రి తమ గదిలోకి వచ్చిన భార్యను రవీంద్ర కినుకగా చూశాడు. ఎప్పుడూ ఇంట్లో పనంటూ అత్తగారి వెనకాలే తిరుగు తుందని అతడికి చిరాకు. "నాకన్నా నీకు అమ్మ, ఆవిడ తలపెట్టే పనులు ఇష్టం" అంటూ గొణుగుతాడు.

శిరీష మాత్రం ఏం చేస్తుంది? అత్తగారికి ఎప్పుడూ డబ్బాల్లో స్వీట్లు, హాట్లు ఉంటే కానీ నిద్రపట్టదు. చేసినవి పూర్తిగా అయి పోకుండానే మళ్ళీ మొదలు పెట్టేస్తుంది. ఏమన్నా అంటే ముగ్గురం ఆడవాళ్లం ఉన్నాం, ఆమాత్రం పిండివంటలు చేసుకో వద్దా అని వాదిస్తుంది. ఈ రోజుల్లో బజార్లో అన్నీ డబ్బుపెడితే దొరుకుతు న్నాయి. బాదుషాలు, మైసూర్‌పాక్‌లాంటివి కూడా ఎందుకు జేయడమని రవి ఉద్దేశం. పెద్దావిడ ఎవరి మాటా వినదు.

అన్నీ చేయడం, ఇంట్లో వాళ్లకి, ఇంటికి వచ్చినవాళ్ళకి పెట్టడం ఆవిడకి సరదా. సావిత్రమ్మ చేతికి ఎముకే లేదు. మా మంచి మనసు అంటూ ఇరుగు పొరుగు వాళ్లు అవన్నీ తింటూ, మెచ్చుకొంటూ ఉంటే ఆవిడకి ఏనుగెక్కినంత సంబరంగా ఉంటుంది.

శిరీష తన మనసులోని అభిప్రాయం ఏమిటో ఎప్పుడూ చెప్పదు. చెప్పే అవకా శాన్ని ఆమెకి అత్తగారు ఏనాడూ ఇవ్వలేదు. లావణ్య ఏదన్నా అన్నా ఆవిడ కూతురి మాటలు కొట్టిపారేస్తుంది. "ఆ... చిన్నపిల్ల. దానికేం తెలుసును? ఎదిగే బిడ్డలకి, మన వలకి పెట్టుకోవద్దా" అంటూ వాదిస్తుంది.

శిరీష భర్త పక్కనే అలసటగా మంచంపై వాలింది. ఆరోజు భార్యతో సినిమాకి వెళ దామనుకొన్నాడు రవి. వీలవలేదు. ఆ కోపాన్ని తాత్కాలికంగా పక్కన పెట్టి ఆమె చేతిగాజులు సవరిస్తూ అడిగాడు "శిరీ! నీకు జీవితంలో ఇష్టమైనది ఏమిటి? "

శిరి అతడివైపు చూసింది. "నాకు ఇష్టమై నవి ఒకటి కాదు అనేకం ఉన్నాయి. ముఖ్యంగా ఈ సంసారజీవితం, నా ఉద్యోగ జీవితం అంటే ప్రాణం"

అతడు ఆమె మాటలకి కాస్త దెబ్బతి న్నాడు. తను, పిల్లలు తప్ప వేరే లోకం లేదంటుందనుకొన్నాడు. తర్వాత నెమ్మదిగా అన్నాడు. "ఉద్యోగజీవితం అంటే నీకు అంత ఇష్టమా? "

శిరీష భర్తవైపు సాలోచనగా చూస్తూ

# తిండే వాళ్ళకి ప్రాణం




ఇంగ్లండులోని వాన్‌ఛెస్టర్ నగరానికి చెందిన కెల్‌విన్ (13), లియాంహే లు రోజుకు 10 సార్లు భోజనం చేయాలి. అంత తిన్నా వాళ్ళు లావెక్కరు. ఓ అరుదయిన వ్యాధి వారిద్దరికీ సంక్రమించడం వల్ల ఒంట్లోని కొవ్వు పిండి పదార్థంగా మారదు. దాంతో గంట గంటకీ సరిపడ పిండిపదార్థాలు తింటేగానీ శరీరంలో శక్తి వుండదు. అలా తినకపోతే రక్తంలోని గ్లూకోజ్ లెవెల్ తగ్గి వాళ్ళు కోమాలోకి వెళ్ళే ప్రమాదం కూడా వుంది. ఆ ఇద్దరన్నదమ్ములకి ఆ వ్యాధి పుట్టుకతోనే వచ్చింది.

అంది. "ఉద్యోగజీవితం అంటే నాకు చెప్పలేనంత ఇష్టం. మీతో గడుపుతున్న ఈ జీవితం ఎంత తృప్తినిస్తుందో, ఉద్యోగం చేయడం కూడా నాకు అంత తృప్తిని ఇస్తుంది. రవీ! అసలు చిన్నప్పటినుండే నాకు ఉపాధ్యాయవృత్తి అంటే ఎంతో ఆరాధన. ఎందుకో తెలుసా? "

ఎప్పుడో తప్ప శిరీష అతడిని పేరు పెట్టి పిలవదు. అతి సంతోష సమయంలో, ఏకాంత సమయంలో అలాగ ఆప్యాయంగా పిలుస్తుంది. అతడికి ఆ పిలుపు ఎంతో బావుంటుంది.

అతడు శిరీషలోని కొత్త వ్యక్తిని చూస్తున్నాడు. శిరీష మంచి టీచరని అతడికి తెలుసు. కానీ వృత్తిని ఇంతగా ఆరాధిస్తుందన్నది ఆశ్చర్యం కలిగించింది.

"నా చిన్నప్పుడు నా కళ్లకి మా బేగం టీచర్ ఎంతో గొప్పగా కన్పించేవారు. మమ్మల్ని ప్రేమతో దగ్గరికి తీసికొని, చదువు గొప్పదనం చెప్పి, చదువంటే ఇష్టం కలిగించారు మా మేడమ్. బెల్లం చుట్టూ చేరే చీమల్లాగ పిల్లలందరం ఆవిడ చుట్టూ చేరేవాళ్లం.

"ఆవిడ చెప్పే కథలు, పాటలు, పాఠాలు, నీతిసూత్రాలు అన్నీ మాకు కొత్తగా, ఇష్టంగా ఉండేవి అమ్మ, నాన్నల తర్వాత ఆవిడే ఎక్కువగా అన్పించేవారు.

ఆమె ఉపాధ్యాయురాలు కావడం వలననే కదా పిల్లల దృష్టిలో అంతటి ఉన్నత స్థానం లభించింది. నాకు ఆ ఉద్యోగం చాలా గొప్పగా అన్పించేది.

"తర్వాత నా జీవితంలోకి వచ్చిన మేష్టార్లు, మేడమ్‌లు నా అభిప్రాయాన్ని పెంచి పెద్దది చేశారు. వారి ఉన్నత వ్యక్తిత్వాలతో నా మనసును జయించారు. ఎంతో ప్రేమతో మాకు విద్యాదానం చేశారు. మమ్మల్ని తీర్చిదిద్దారు. ఆనాడే నిర్ణయించుకొన్నాను వారిలాగా నేనూ మంచి ఉపాధ్యాయురాల్ని అవ్వాలని. నా శిష్యుల జీవితాలలో నాకంటూ ఒక స్థానాన్ని సంపాదించుకోవాలని కలలు కనేదాన్ని.

"మిమ్మల్ని ఇష్టపడింది కూడా మంచి టీచర్ అనే. వృత్తిపట్ల మీకున్న గౌరవం, కుటుంబం ఎడల మీకున్న ప్రేమ, బాధ్యతలను సక్రమంగా నిర్వహించాలనే మీ తపన నాకు మీరంటే ఇష్టాన్ని కలిగించాయి. మీతో జీవితం పంచుకోవాలన్పించింది. నన్ను వ్యక్తిగా మీరు ఇష్టపడ్డారు. నా అభిప్రాయాలకి విలువ ఇచ్చారు. ఇద్దరం మనకి తోచినవిధంగా మన వృత్తి ద్వారా దేశసేవ చేయాలని నా కోరిక"

రవీంద్ర అప్రతిభుడయ్యాడు. సామాన్యంగా కన్పించే శిరిలో ఇంత ఉన్నత వ్యక్తిత్వమా? వృత్తిపట్ల ఇంత ఆరాధనా? ప్రతి స్త్రీ తన భర్త గురించి, తన పిల్లల గురించి ఆలోచిస్తుంది. ఉద్యోగాన్ని డబ్బు సంపాదనకు మార్గంగానే చూస్తుంది. కానీ కుటుంబానికి విలువ ఇచ్చినట్లే ఉద్యోగ జీవితానికి విలువ ఇచ్చే ఆడవాళ్లు ఉన్నారన్న మాట. ఉద్యోగ జీవితాన్ని ఛాలెంజిగా తీసుకొన్న కిరణ్‌బేడీ వంటి వాళ్ళంటే అతడికి ఎంతో ఆరాధన. ఎన్నో ఉద్యోగాల్లో, ఎన్నో పదవుల్లో ఆడవాళ్లు ప్రకాశిస్తున్నారు. వాళ్ళందరి గురించి వినడం మాత్రమే కానీ ఈనాడు తన పరిధిలో, తన జీవన సహచరి వృత్తిని ప్రాణాధికంగా ప్రేమించడం అతడికి అపరిమితమైన ఆనందాన్ని కలిగించింది.

మనుష్యులు మనకి తెలుసునని భ్రమపడతాం. మన చుట్టూ ఉన్నవారి ఆలోచనలు మనకి కూలంకషంగా తెలుసనుకొంటాం. కానీ పైకి కన్పించేదే వాస్తవం కాదు. మనసు దగ్గరగా వెళ్ళగలిగితేనే అసలైన వ్యక్తిని చూడగలుగుతాం.



ఆ క్షణంలో అతడు చాలా సిగ్గుపడ్డాడు. ఇన్నేళ్ల వైవాహిక జీవితంలో ఆమె మనసుని చదవలేకపోయానే అన్న పశ్చాత్తాపం అతడిలో కలిగింది.

ఇంటి విషయంలో తన బాధ్యతలను ఉదాత్తంగా పంచుకోవడంలో ఆమెను అతడు ఎప్పుడూ మనసులో అభినందిస్తూనే ఉంటాడు. తనకి ఇంట్లో దొరికే నిశ్చింత వెనకాల ఆమె కృషి ఎంత ఉందో అతడికి కాక ఎవరికి తెలుస్తుంది?

నిద్రపోతున్న భార్యను అతడు అపురూపంగా చూశాడు. ఈ అమూల్యమైన రత్నాన్నిచ్చిన భగవంతుడికి తను ఎప్పుడూ కృతజ్ఞుడే. "శిరీ! నీ ఆశయాల సాధనలో నా సహకారం ఎప్పుడూ ఉంటుంది. నీ వృత్తిలో నువ్వు ఇంకా రాణించే విషయంలో శ్రద్ధ వహిస్తాను. అతడు ఆమె నుదుటిపై ముద్దు పెట్టుకొంటూ అనుకొన్నాడు.

ఆమె నిద్రపోయినా అతడు మాత్రం నిద్రపోలేకపోయాడు. అతడి మనసు దూదిపింజెలాగా తేలిపోతోంది. ఆ క్షణంలో అతడి ఆలోచనలన్నీ తన భార్య చుట్టూ తిరుగుతున్నాయి. నిద్రలోనే అతడికి మరింత దగ్గరగా జరిగి పడుకొందామె!



స్టాఫ్ మీటింగ్ జరుగుతోంది. హెడ్‌మాష్టారు సుబ్బారావుగారు టీచర్స్‌కి జాగ్రత్తలు చెపుతున్నాడు. పేపర్లు వేళకి దిద్ది ఇవ్వమని, ప్రోగ్రెస్ కార్డులు విద్యార్థులకి అందజేయమని హెచ్చరించారు. పిల్లలని బయటి పనులకి పంపవద్దని చెప్పారు.

'ఈ వెధవ మీటింగ్ నా గురించే పెట్టినట్లున్నారు. అంతమందిని పిలిచి మరీ ఈ సుత్తివేసే బదులు నన్ను పిలిచి చెప్పవచ్చు కదా!' జానకమ్మగారు గొణగడం అందరికీ విన్పించింది.

"మీరే కాదు మేడమ్‌గారూ, నేనూ నాల్గవ యూనిట్ పేపర్లు, హాఫియర్లీ దిద్దలేదు. కనుక ఇందులో నా కోటా కూడా ఉంది" హిందీమేష్టారు నవ్వుతూ అన్నారు.

హిందీ మేష్టారు ఏ విషయాన్నీ సీరియస్‌గా తీసుకోరు. నాలుగు రోజులు అటూ ఇటూ అవుతాయి. అంతమాత్రంచేత కొంప మునిగిపోదు. మన పేపర్లు మనం దిద్దక ఇతరులు దిద్దుతారా? అని ఆయన వాదన.

సైన్సుమేష్టారికి ఇవేవీ పట్టవు. డబ్బు సంపాదన ఎలాగ అని నిత్యం ఆలోచిస్తాడు. ఆయన హడావుడిగానే స్కూలుకి వస్తాడు. హడావుడిగానే వెళ్ళిపోతాడు. వర్క్ ఏదీ పెండింగ్‌లో ఉంచడు కనుక హెడ్‌మాష్టరు ఏమీ అనరు. అయినా వాళ్ళిద్దరిలో ఒక అండర్‌స్టాండింగ్ ఉంది. హెచ్.ఎం. ఏ పనిచేసినా ఈయన సమర్థిస్తాడు. ఈయన రాకపోకల గురించి ఆయన చూసీచూడనట్లు వదిలేస్తాడు.

అందుకే సైన్సుమేష్టారు కూడా "మరీ ఆలస్యం చేస్తే ఏం బావుంటుంది చెప్పండి. డి.యి.ఓ.గారు చూస్తే పరమ స్ట్రిక్టు. ఎవరైనా స్కూలుకి వస్తే ఆయనే జవాబు చెప్పుకోవాలికదా" అనేశాడు.

'వెధవ బడాయి. ప్రతీ మాటకి తందాన తాన అనకపోతే తోచదు కాబోలు. ఎంతైనా ఫస్టు అసిస్టెంటుకదా! అందుకే ఈ

'వత్తాసు.' జానకమ్మగారు మనసులోనే అను కొంటే మిగిలినవారిలో కొందరు బయటికి అనుకొన్నారు.

"మన మేథ్స్ సార్‌ని, మేడమ్‌గారిని చూడండి. వర్క్ విషయంలో ఏనాడైనా చెప్పించుకొన్నారా? " సుబ్బారావుగారు అర్థోక్తిలో ఆపారు.

"ఇంతేనా? ఇంకా మాట్లాడుకొనేవి ఉన్నాయా? నా క్లాసు పోతోంది" డ్రాయింగ్ మేష్టారు అనడంతో అందరూ నవ్వుల్లో పడ్డారు. ఎందుకంటే ఆయన ఎప్పుడూ "మీకు ఎవరికైనా క్లాసు కావాలా? " అంటూ తిరుగుతారు. సబ్జెక్టు టీచర్స్ అవసరమున్నప్పుడు తీసుకొంటారు. మరొకవేళల్లో ఆయన బాధపడలేక తీసు కొంటారు. ఆశ్చర్యం ఏమిటంటే ముఖ్యమైన పని ఉందంటూ క్లాసు ఉన్నప్పుడు వల్లిస్తారు. అయినా హైస్కూల్స్‌లో డ్రాయింగ్ మేష్టర్లకి మరికొన్ని స్కూలు పనులూ ఉండ నేఉంటాయి.

ప్రభుత్వం ఇచ్చే పుస్తకాలు తేవడం, పిల్లలకి పంచడం లాంటివి డ్రిల్లు, డ్రాయింగ్‌లకి తప్పవు. స్టాఫ్ రూంలో ఖాళీగా కన్పించే వాళ్ళు క్రాఫ్ట్, డ్రాయింగ్ మేష్టర్లే. స్కూలు విషయాలు, ఊరు విషయాలు మొత్తం రాజకీయ విషయాలన్నీ వేడివేడిగా చర్చలు జరిపేది వాళ్లే. ఇంకా మాట్లాడితే పేపరు శుభ్రంగా చదివేది వాళ్ళేనని, స్కూలు పేపర్ బాగా ఉపయోగపడేది వాళ్ళకేనని అందరికీ తెలుసు.

"మరొక ముఖ్య విషయం మీకు చెపుదామని పిలిచాను. ఎవరూ ట్రాన్స్‌ఫర్లకి ప్రయత్నించకండి. మన స్టాఫ్ బావుంది. మనం తట మనం ఎందుకు అప్లికేషన్స్ పెట్టుకోవాలి. మనమే ఉంటే పదవతరగతి మంచి రిజల్ట్సు సాధించవచ్చు" హెచ్. యం. గారు అర్థింపుగా స్టాఫ్‌తో చెప్పారు.

అయిదారు సంవత్సరాలుగా ఆ చుట్టుపక్కల స్కూళ్లలో వాళ్ళ స్కూలుకే ఎక్కువ ఉత్తీర్ణతా శాతం వస్తోంది. ఆయనని ఈ విషయంలో అందరూ అభినందిస్తున్నారు.

అందరూ ఇవతలికి వచ్చేశాక సైన్సుమేష్టారు అన్నారు. "మనం ఎక్కడ ఉన్నా చేసేపని ఇదే. మన సదుపాయం మనం చూసుకోవద్దా. అయినా ప్రభుత్వం ట్రాన్స్ఫర్లు చేసేస్థితిలో అదనపు భారం మోసే స్థితిలో లేదు" అంటూంటే కొందరు అవునంటే అవుననుకొన్నారు.

"మీకెందుకు, నేనున్నాను, మన సంఘాలున్నాయి. మీకు మనవి చేసేది ఒకటే మీ అంతట మీరు ఈ స్కూలు వదలకండి" హెడ్‌మేష్టారు ప్రత్యేకంగా రవితో అన్న మాటలు అతడి చెవులలో మారుమోగుతున్నాయి.

"ఆ... బాగా పనిచేసే పనివాళ్లను వదలడానికి మనం ఎలాగ ఇష్టపడమో, బాగా పనిచేసే టీచర్స్‌ను వదలడానికి హెచ్. యం. లు ఇష్టపడరు" శ్యామల ఒక్క ముక్కలో తేల్చిచెప్పింది.

"అయినా ఎవరికున్న పరపతి వారికుంటుంది. ఎవరి సుఖం వాళ్ళు చూసుకొంటాం. సెలవలయ్యాక కదా ఈ గోల" జానకమ్మ సైన్సుమేష్టారి వాటర్ బాటిల్‌లో నీళ్లు తాగుతూ అంది.

"ఏదో నాలుగైసు ముక్కలు వేసిన నీళ్లు తెస్తావని తాగాను. అంత మాత్రానికే ఆ చూపులేమిటి? " జానకమ్మ చిరాకుగా సైన్సు మాష్టారివైపు చూశారు.

"ఎలా చూసినా మీకు లెక్కా? నీళ్లు నేను ఇంటికెళ్లేవరకూ సరిపోవాలని చెప్పినా అర్థమవదు" ఆయన విసుక్కొన్నాడు.

"మీరందరూ ఇంతే. మా రవీంద్ర మాష్టారుగారు అలాగకాదు, ఏ విషయంలో ఎవ



రినీ నొప్పించరు" జానకమ్మగారు వాళ్ళని నిరసిస్తూ, రవీంద్రని పొగుడుతూ అనే శారు.

"నిజమే, మీరు వాళ్ల బాటిల్‌లోంచి మంచినీళ్లు తీసుకున్నా ఏమీ అనరు. బ్యాగ్‌లోంచి పళ్లు తీసుకున్నా ఏమీ అనరు. మీ పేరు లాగే వారి అమ్మగారి పేరుక్కూడా పురాణాల్లో ఎంతో మంచి స్థానం వుంది" క్రాఫ్ట్ మాస్టారు కొత్త విషయం కనిపెట్టినట్టు చెప్పారు.

"నేను చెప్పేది అదే. తల్లికి, తల్లిపేరుకి విలువనిచ్చే వాళ్లు తన పరిసరాలలోని అందరికీ విలువనిస్తారు. అలాంటివి చూసి నేర్చుకోండి" ఆవిడ ఒక సవాల్ విసిరి వెళ్ళిపోయారు.

ఏదిఏమైనా కుండబ్రద్దలు కొట్టినట్లు మాట్లాడటం ఆవిడ నైజం. అందుకే ఎవరూ ఇష్టపడరు. ఉన్నది ఉన్నట్లు మొహం మీద అంటుంది. తనకి తోచింది నిర్మొహమాటంగా చేసి ఊరుకొంటుంది.

ఎవరైనా క్లాసు వదిలేస్తే సుబ్బారావుగారికి చెప్పి వదులుతారు. ఆవిడ చెప్పరు. అదేమని హెచ్.యమ్. నిలదీస్తే "అన్ని విషయాలూ చెప్పి మీకు హై బి.పి తేవాలా? అంటుంది. ఇంకా కోపం వస్తే "ఈయన ఒక్కడిదే ఈ స్కూలనుకొంటున్నాడా? మా యం.ఎల్.ఏకి చెప్పానంటే శంకరగిరి మాన్యాలు పడతాడు" అని నిర్మొహమాటంగా అంటుంది.

యం.ఎల్.ఏ ఆవిడకి దూరపు చుట్టమనీ, ఆవిడతో వాదించడమంటే కొరివితో తల గోక్కోవడమేననీ స్టాఫ్ అంటారు. రవీంద్ర మాత్రం "ఆవిడ, క్రాఫ్ట్ మాస్టారు గారు లేకపోతే మనకి ఏంతోస్తుంది చెప్పండి" అంటాడు.





ఆ నియోజకవర్గ యం.పి.గారు తమ కుటుంబానికి దగ్గరవాడని క్రాఫ్ట్ మాస్టారికి గర్వం. ఆయనొకరు ఎవరినీ లెక్కచేయరు. అందరి విషయాలూ స్కూలుకి చేరవేస్తాడు

ఒకసారి శిరీష జానకమ్మగారినడిగింది. "మన యం.ఎల్.ఏగారు బాగా చదువుకొన్నారా? " అని.

శిరీషనిచూసి ఆవిడ జాలిపడింది. ఈ పిల్ల కావడానికి మూడు యం.ఏ.లు చదువుకొంది. ఏం లాభం? బొత్తిగా పరిసరాల విజ్ఞానం తెలియదనుకొంది.

"చూడండి మేడమ్‌గారూ! రాజకీయ నాయకుల్లో సగంమంది వేలిముద్రలవాళ్ళే. దేశం అందుకే భ్రష్టుపట్టిపోయింది" అంటూ ఆవిడ తమ నియోజకవర్గ యం.ఎల్.ఏ. కథ చెప్పుకొచ్చింది.

యం.ఎల్.ఏ అమ్మపేరు నాగమ్మట. అయితే ఆడపిల్లలు బ్రతకని కారణంగా ఆమె తల్లిదండ్రులు పెంటమ్మ అని పిలిచేవారుట. పేరు పోకూడదని ఆమె చిన్నతనంనుండి పేడ ఎత్తుకొంటూ తిరిగేదిట. అతి పేద కుటుంబంలో పుట్టడం వలన ఈపని తప్పలేదు. కూలిపనికి వెళ్లడం, పేడ తెచ్చి పిడకలు పెట్టడం చేసేదిట.

తండ్రి పనిమీద వెళితే గేదెలు మేపడం కూడా చేయవలసివచ్చేదిట. ఆ మాటకి వస్తే గేదెలుకొని పాలు అమ్ముకోవడంవలననే వాళ్ళ కుటుంబం పైకి వచ్చిందిట.

"మరి అలాంటి వ్యక్తి ఎలా యం.ఎల్.ఏ. అయ్యారు? " శిరీష ఆశ్చర్యంగా ప్రశ్నించింది.

శ్యామలకి ఆమె ప్రశ్నకి నవ్వు వచ్చింది.

"ఈ దేశంలో ఎవరు ఎప్పుడు ఏదైనా అవగలిగేది ఒక్క రాజకీయాలలోనే. అదే ఒక టీచర్ కావాలంటే కష్టపడి కొన్నేళ్లు చదువుకోవాలి. ఇంజనీరు కావాలంటే ప్రతిభతోనో, డబ్బుతోనో అయినా సరే కొంత

కాలం చదవాలి. అలవోకగా పైకి వచ్చేది, అతి సునాయాసంగా పదవులు పొందేది రాజకీయాలలోనే"

"మరీ చదువులేకుండా..." అని ఇంకా ఏదో అనబోయేంతలోనే

"ఆ... ఏం ఉంది? ఈ నియోజకవర్గం మహిళకి కేటాయించారు. మన ప్రాంతంలో బాగా నోరు ఉన్న మహిళ ఎవరా అని వాళ్ళు వెదికారు. మన పెంటమ్మ వాళ్ళ దృష్టిలో పడటమేమిటి? ఎం.ఎల్.ఏ. అవడమేమిటి జరిగిపో యాయి. మరి పేద పోగుచేయడం కోసం తన జట్టువాళ్ళతో చచ్చేలాగా పోట్లాడేది కదా!" వివరించింది శ్యామల.

శిరీష ఇంటికి వెళ్ళాక ఇంట్లోవాళ్ళకి ఈ విషయాలు ఆశ్చర్యంగా చెప్పడం మొదలు పెట్టింది.

అయితే తను ఆవిడకి ఈ పదవి అంటే ఇష్టమేనా? అని అడగడం, "ఏం దొబ్బి డాయి? పదవి, అధికారం అంటే ఎవరికి చేదు? ఇప్పుడు కారు, హోదా, షోకులు, డబ్బూ, దస్కం అన్నీ అనుభవిస్తోంది. చూడు శిరీషా! నా మటుకు నాకు ఈ వెధవ ఉద్యోగం కంటే ఆ రాజకీయ నాయ కత్వమే బావుంది" అని అన్న ఆవిడ మాటలు నవ్వు తెప్పించాయి.

రవీంద్ర అప్పుడప్పుడూ అంటాడు, "మన మేడమ్‌గారు ఏ యం.పి.గారో అయిపోయి తీరతారు" అంటూ. ఆవిడ మనసారా నవ్వే స్తుంది.

రవి తనలోతను ఆలోచిస్తాడు ఎందుకని ఆవిడకి చేసే ఉద్యోగం ఇష్టం ఉండదని! ఆవిడ సిద్ధాంతం ప్రకారం అయితే జీవి తంలో "ఎదుగుదల" ముఖ్యం. ఈ మాష్టరు ఉద్యోగంలో చాకిరీ తప్ప ఏం సుఖం ఉంది. ఏడాదికి అతికష్టంమీద రెండు డి.ఏ.లు పెరుగుతాయి. పెరిగే కరు వురోజుల్లో ఇవి ఏ మూలకి?

ఆవిడా, క్రాఫ్ట్ మాష్టారూ, డ్రాయింగ్ మాష్టారూ ఎప్పుడూ వాదించుకొంటూ ఉంటారు. తెలుగుమాష్టారుగారైతే ఈ రోజుల్లో టీచర్లకి ఏం తక్కువని వాదిస్తాడు. "పూర్వం అయితే బ్రతకలేక బడిపంతులు అనేవారు. ఇప్పుడు బ్రతకనేర్చినవాడు బడి పంతులు" అంటారు.

"ఏదో మీలాంటివారి విషయంలోనే ఆ సూక్తి. రాజకీయనాయకులని ఆశ్రయించు కొని పబ్బం గడుపుకొనే వాళ్ళకి భయం ఏమిటి? మన స్టాఫ్‌లో కొందరిని చూడండి. వట్టి కూపస్తమండూకాలే" క్రాఫ్ట్ మాష్టారు నిర్మోహమాటంగా అంటారు.

వాళ్ళ స్కూల్లో పెద్ద తెలుగు మాష్టారు గారు అతిజాగ్రత్తపరులు. ఆయనకి ముందుచూపు ఎక్కువ. ఎప్పటికప్పుడు అవ కాశం కలిసి వచ్చినప్పుడు దగ్గర్లోకి ట్రాన్స్ ఫర్ చేయించుకొంటూ ఉంటారు.

"మావాడే అమాయకుడంటే మా కోడలు వాడిని మించిపోయింది. ఇద్దరూ ఒకలాం టివారే" ఇంటిదగ్గర సావిత్రమ్మ రవీంద్ర గురించి శ్రీనివాస్ దగ్గర వాపోయింది.

"అన్నయ్య, వదినల్లాంటి వాళ్లు అరు దమ్మా! నీకు వాళ్ళ గురించి తెలియడం లేదు" మధ్యలో అశోక్ కల్పించుకొంటూ అనేవాడు.

సావిత్రమ్మ తల్లిగా తన బిడ్డ బాగా ఎద గాలని, నాలుగురాళ్లు సంపాదించుకోవాలని అనుకొంటూ ఉంటుంది.

"మీరు అనుకొంటున్నారుకానీ మాష్టారు డబ్బు దుబారా చేయరమ్మా" శ్రీనివాసు నెమ్మదిగా అంటాడు.

"డబ్బు దుబారా చేయక్కరలేదు. సంపా దించవలసిన వయసులో సంపాదించకపో వడం లోకం దృష్టిలో నేరమే. అసలు వీడి

దారి ఎప్పుడూ వేరేకదా" అని ఆవిడ నిట్టూర్పు విడుస్తుంది.

శ్రీనివాసు, రవీంద్ర మంచి స్నేహితులు. శ్రీనివాసుది మధ్యతరగతి కుటుంబమే. తండ్రి ఉద్యోగి అయినా వచ్చిన డబ్బు అంతా తాగి తగలేస్తాడు. ఇద్దరు చెల్లెళ్లకీ పెళ్ళిళ్లుచేసి తను చేసుకోవాలని శ్రీనివాసు ఉద్దేశం. అందుకే తల్లి ఎంత పోరినా అతడు విన్పించుకోడు.

రవీంద్ర, శ్రీనివాసులు ఒకే బాధ్యతల బరువుతో ఉండటం వారిని మరింత దగ్గరికి చేర్చింది. ఇద్దరూ భేషజాలు లేనివాళ్లు.

వాళ్లిద్దరి స్నేహం పిండిమిల్లు దగ్గర కలిసింది.

చెల్లెలు లావణ్యని బయటికి కొన్నిరకాల ఇంటిపనులమీద పంపడం రవీంద్రకిష్టం ఉండదు. సావిత్రమ్మగారికి పిండిమరల పనులు ఎక్కువే. రవి అదేదో తానే వెళ్ళి పిండి ఆడించుకొని వచ్చేవాడు. జంతికలని, చేగోడీలని ఆవిడ ఏవో ఒకటి తలపెడుతూనే ఉంటుంది.

శ్రీనివాసు తండ్రి ప్రవర్తనవలన చుట్టుపక్కల వాళ్ళకి అతని కుటుంబం అంటే చులకన. కాలేజీ కుర్రాళ్లు ఆ వీధిలో ఎక్కువ. అందుకే చెల్లెళ్లని బయటికి పనుల నిమిత్తం పంపడు.

పరిచయం కలిగాక రవీంద్రకి అతడు మున్సిపాల్టీ హైస్కూల్లో బి.యిడి. టీచర్‌గా చేస్తున్నాడని తెలిసింది. ఇద్దరూ మంచి స్నేహితులైపోయారు.

రవీంద్ర అంటే శ్రీనివాసు ప్రాణం, పెడతాడు. ఇద్దరూ కలిసి సంబంధాలకి తిరిగేవారు. రవీంద్ర వల్లనే అతడి పెద్ద చెల్లెలికి పెళ్లి కుదిరింది. శ్రీనివాసుకి ఆ కృతజ్ఞత ఎంతయినా ఉంది. కాని తన కొడుకు లెక్చరర్ చేస్తున్న పిల్లవాడిని శ్రీనివాసు చెల్లికి చూడటం సావిత్రమ్మకి రుచించలేదు.

ఆ సంబంధం తన కూతురు లావణ్యకే కుదిరిస్తే బావుండేదని ఆవిడ అభిప్రాయం. చెల్లెలు బి.యస్.సి. పూర్తిచేశాకే పెళ్లిచేద్దామని రవి ఉద్దేశం. ఆడపిల్లకి చదువు చాలా అవసరమని అతడి అభిప్రాయం. తను నమ్మినదాన్ని అతడు తప్పక పాటిస్తాడు. రోజూ సాయంత్రం రవీంద్రని కలవందే శ్రీనివాసుకి తోచదు. ఇద్దరూ ఆరోజు విశేషాలు చెప్పుకొంటారు. రవీంద్రకి స్వంత ఇల్లంటూ ఉంది. శ్రీనివాసుకీ ఓ ఇల్లు అమర్చాలని రవీంద్ర తాపత్రయం.

రవీంద్ర ఇల్లు కట్టడం కూడా తల్లి బలవంతంమీదే. తండ్రి పోయినప్పుడు వచ్చిన డబ్బు కొంత తల్లిపేరుమీద వేశాడు. కొంత చెల్లి పెళ్లికి దాద్దామనుకొంటే తల్లి ఒప్పుకోలేదు. ఆ డబ్బుకి కొంత అప్పు చేయించి చిన్న ఇల్లు కట్టించింది. ఇంటి వెనుక ఎంతో ఖాళీ జాగా ఉంది. ఎప్పుడైనా చిన్నవాడు అక్కడ ఇల్లు కట్టుకోవచ్చునని ఆవిడ అభిప్రాయం.

అప్పంటే ఇష్టపడని రవీంద్ర మొదటిసారిగా ఇల్లు కట్టడం కోసం అప్పుచేశాడు. ఇల్లంటూ ఉంటే అద్దె మిగులుతుందని తల్లి వాదన. కొడుక్కి పెళ్లిచేస్తే వచ్చే కట్నంతో కూతురి పెళ్లి చేద్దామనుకొంది.

పెరుగుతున్న ఖర్చులు, తమ్ముడి చదువు, చెల్లి చదువు రవీంద్రకి తలకు మించిన భారమే అయ్యాయి. అయినా శ్రీనివాసు ప్రోత్సాహంతో చీటీకట్టి, పాట పాడి ఇంటి అప్పు తీర్చాడు. ఆ అప్పు ఉన్నన్నాళ్ళూ అతడికి నిద్ర పట్టేది కాదు.

తల్లికి వచ్చేకొద్దిపాటి పెన్షనూ ఆవిడ కూతురి పేర కొంత వేస్తుంది. మిగిలినది ఆవిడ ఖర్చులకి ఉంచుకొంటుంది. ఆవిడకి కావలసిన బట్టలకూ, గుడులూ, పూజలకూ

దాంతో సరిపెట్టుకొంటుంది.

శ్రీనివాసుని కలిసినప్పుడు రవీంద్ర అడిగాడు సెలవలైతే ఏదైనా బదిలీల గోల ఉంటుందా అని. "ఎవరు చెప్పగలరు? క్షణ క్షణముల్ జవరాండ్ర చిత్తముల్ అని ఎవరన్నారో కానీ తప్పుగా అన్నారు. క్షణక్షణముల్ రాజకీయ నాయకుల చిత్తముల్ అని అనవలసింది" అని నవ్వుతూ తేల్చేశాడు శ్రీనివాసు.

"పోనీ ఇద్దరూ ముందుగా ఎవరికైనా మ్యూచువల్ ఇచ్చెయ్యండి. అప్పుడు ఎక్కడికో వేస్తారన్న బాధ ఉండదు" మళ్లీ శ్రీనివాస్ తనే అన్నాడు.

ఇల్లు చేరాక భార్యతో శ్రీనివాసు అన్న మాటలు రవీంద్ర చెప్పాడు. శిరీష ఆలోచనలో పడింది.

"మళ్లీ ఏడాది పదవతరగతికి డబ్బైమంది పిల్లలు వస్తారండీ! వాళ్ళు ప్రైవేటు స్కూళ్ళల్లో మనం ఉన్నామనే చేరడంలేదు. మంచి ఉత్సాహమున్న వాళ్ళు. అనవసరంగా వాళ్ళని వదిలి ఎందుకు వెళ్ళడం? " అని అంటున్న భార్య మాటలకి అతడు ఏమీ మాట్లాడలేకపోయాడు.

ఇద్దరూ ఆ ఊరి స్కూలుకి వచ్చి ఈ ఏడాదికి పదేళ్ళు అవుతుంది. ఆ ఊరు స్కూలు దాటేస్తే బావుండునేమో?

"అయ్యో! రాత! ఊళ్ళో పిల్లలకోసం మన సుఖం మనం వదులుకొంటామా? " సావిత్రమ్మ విస్తుపోతూ కోడలిని అడిగింది.

సెలవలయ్యాక చూసుకొనే విషయానికి ఇప్పటినుండి వాదనెందుకని రవీంద్ర ఊరుకున్నాడు.

శిరీష పెళ్లినాటినుండే ఆవిడకి కొంత అసంతృప్తి ఉంది. బాగా కట్నం ఇచ్చే సంబంధాలు రవికి బోలెడు వచ్చాయి కానీ, వీడు ప్రేమ అంటూ ఈ సంబంధం గురించి చెప్పాడు.

లావణ్య, అశోక్ అన్నకే మద్దతు ఇచ్చారు. తల్లికి శిరీష సంబంధం ఒప్పుకోమని నచ్చచెప్పారు. అన్నయ్య ఇప్పటికే కుటుంబంకోసం ఎంతో పాటుపడుతున్నాడు. వైవాహిక జీవితం అయినా అతడి ఇష్టంమేరకు గడపనీయాలని వాళ్ళు వాదించారు.

కానీ కట్నం లేకపోయినా కోడలికి ఉద్యోగం ఉంది కదా అని తర్వాత ఆవిడే సర్దుకొని పోయింది. శిరీష తన జీతం భర్త చేతిలోనే పెట్టి ఆడపడుచు పెళ్ళికని కొంత ప్రతీనెలా దాచమంది. అతడు జీతం ఆమెనే ఉంచుకోమని ఎంత బలవంతం చేసినా ఆమె ఒప్పుకోలేదు. అతడే కొంత డబ్బు ఆమెకి వేరే ఇచ్చేవాడు.

స్కూలుకి, సినిమాలకి, షికార్లకి ఎక్కడికైనా అతడితోనే గదా వెళ్ళడం. ఇంకా తనికి వేరే ఖర్చు ఏం ఉంటుందన్నది శిరీష అభిప్రాయం.

రెండు జీతాలు కళ్ళచూడటంతో సావిత్రమ్మలో కోరికలు బయలుదేరి బట్టలకి, నగలకి ఖర్చుపెట్టడం మొదలుపెట్టింది. భర్త బతికి వున్నప్పుడు చాలీచాలని జీతంతో, పిల్లలతో, వచ్చేపోయే చుట్టాలతో ఆవిడ ఏ కోరికలూ తీర్చుకోలేకపోయింది. ఇప్పుడు నగలు, వస్తువులు కావాలన్పిస్తోంది.

శిరీష పుట్టింట్లో తల్లిదండ్రులను ఇది కావాలని ఏనాడూ అడగలేదు. ఆఖరి బిడ్డ గదా అని వాళ్ళే అన్నీ అమర్చేవారు. పెళ్ళికి ముందే శిరీషకి ఉద్యోగం వచ్చేసింది. రెండు సంవత్సరాలు ఉద్యోగ జీవితం అయ్యాకే రవీంద్రతో పెళ్లి జరిగింది.

స్కూల్లో శ్యామల, శారదమ్మ తరచుగా బంగారం కొంటూనే వుంటారు. శ్రావణ మాసం, మార్గశిరమాసం, ఉగాది ఇలాగ వాళ్ళ చీటీలడబ్బు వచ్చినా, ఎరియర్స్



వచ్చినా వస్తువులు చేయించుకోవడానికే ప్రాధాన్యత నిస్తారు.

అలవాటు ప్రకారం శ్యామల శిరీష నడిగేసింది. "నువ్వేం చేయించుకొన్నావు వరలక్ష్మీ వ్రతానికని? "

శిరీష ఏం సమాధానం చెపుతుంది? ఉమ్మడికాపురం, బాధ్యతల బరువులతో ఏం కొనగలదు?

రవీంద్ర వాళ్లమాటలు విన్నాడు. మర్నాడు ఉదయం తల్లిని "అమ్మా! ఆడవాళ్ళు శ్రావణమాసం, మార్గశిరమాసం బంగారం కొనుక్కుంటూ ఉంటారా? " అని అడిగాడు.

ఇన్నాళ్ళకి కొడుకు బంగారం గురించి అడిగినందుకు ఆవిడ పొంగిపోయింది. "ఒకసారే అన్నీ చేయించుకోవడం అంటే అవదుకదరా! ఇలాగ పూజలలో పెట్టుకున్నట్టూ ఉంటుంది. ఆడవాళ్ళకీ వస్తువులు అమరినట్టూ ఉంటాయి. అందుకే అన్నారు 'అదునుకి బంగారం- ఆలికి శృంగారం' అని అవసరాలప్పుడు వస్తువులు బేంక్‌లో పెట్టుకోవచ్చును" అంటూ తేల్చి చెప్పేశారు.

మర్నాడు వెళ్ళి తులంన్నర నెక్లసు కొని ఇంటికి తెచ్చాడు. "అమ్మా! నీ కోడలికి పూజకని కొన్నాను" అంటూ తల్లికి చూపించాడు.

కూతురి సంగతి వదిలి కొడుకు భార్యకి తెచ్చినందుకు ఆవిడ మొహం ముడుచుకుంది. పైకి ఏం అంటుంది? కూతురి దగ్గర, కోడలి దగ్గర తన అసంతృప్తి బయటపెట్టింది.

లావణ్య తల్లితో దెబ్బలాడింది. అన్నయ్యా తనకి గాజులు, గొలుసు చేయించాడు. తండ్రి ఉన్నప్పుడు తమస్థితి ఎలా ఉందో మరిచిపోయిన తల్లిమీద కోపం వచ్చింది. రేపుతన పెళ్ళి బాధ్యత అన్నయ్యా, వదిలన మీదే ఉంది. అన్నింటికీ వంతు పెట్టుకోవడం సబబుకాదని తల్లికి తెలియనందుకు బాధపడింది. కాని, కూతురు ఎన్ని చెప్పినా ఆవిడ దారి ఆవిడదే.

భర్త తన గురించి ఆలోచించడం తనకి బట్టలు, వస్తువులు చేయించడం ఆనందం కలిగించని అత్తగారి దృష్టిలో ఇవి ఏం గొడవలు తెస్తాయో అని భయపడింది శిరీష. రవీంద్ర అలాగ చెప్పా పెట్టకుండా కొన్ని పనులు చేసేసి ఊరుకుంటాడు.

లావణ్య వయసుకి మించి ఎదిగిపోయింది. అన్నయ్యా, వదిన సినిమాలకి కలిసి వెళ్ళాలని కొన్ని తను చూడనంటుంది. మరీ మంచివనుకొంటే వదిన బలవంతం వలన ఆమెకి వెళ్లక తప్పదు.



పదవ తరగతి ఇన్విజిలేషన్ ఆర్డర్స్ స్కూలుకి వచ్చాయి. మాష్టర్లందరూ హెడ్ మాస్టారి దగ్గర కూర్చుని ఎవరెవరికి ఆర్డర్స్ వచ్చాయో, ఏయే ఊర్లు వేశారో చెప్పుకోవడం మొదలుపెట్టారు. బియిడీలు ముగ్గురికి, హెడ్ మాష్టారుకి, శ్యామలకి ఆర్డర్స్ వచ్చాయి. ఇంక చూడాలి మిగిలినవాళ్ళ బాధ.

క్రాఫ్టు మాష్టరు ఏ విషయాన్నీ దాచుకోడు.

"డి. యి. ఓ. ఆఫీసుచుట్టూ తిరిగి, గుమాస్తాకి డబ్బు ఇస్తే ఎందుకు పడ"వని ఆయన వాదన. సైన్సు మాష్టరు "మీరూ ఆపని చేయవచ్చు కదా? " అంటాడు.

హెడ్ మాష్టార్ని డిపార్టుమెంటులో ఆఫీసర్‌గా వేశారు. "ఆయనయితే హెడ్ క్వార్టర్స్‌కి తిరుగుతూ ఉంటాడు. సైన్సుకి లంచాలు ఇవ్వడం, పనులు జరిపించుకోవడం తెలుసును. కానీ రవీంద్ర వాళ్ళూ అలాగ కాదు కదా! ఏనాడూ వాళ్ళు ఏ విషయానికీ బయటికి వెళ్లలేదు. మరి వాళ్ళ





కెలా పడ్డాయి ఆర్డర్స్" అని డ్రాయింగ్ వాదన.

జానకమ్మగారికి ఆర్డర్ రాకపోయినా పర్వాలేదు. ఏ స్కూలు సెంటర్‌లోనో ఎడ్జస్టు చేయించుకొంటుంది. బి.యి.డి.లు అందరూ వెళ్లిపోతే 15 రోజులు ఎనిమిది, తొమ్మిది తరగతుల మాటేమిటి అని క్రాఫ్ట్ వాదన. వేసేవాళ్ళు స్కూలు విషయం ఎందుకాలోచించరని గొడవ.

అంతటితో ఆగక "అసలు బి.యి.డి.లనే పదవ తరగతి పరీక్షలకి ఎందుకు వేయాలి? వాళ్ళవలన కాపీయింగ్ జరిగే అవకాశం ఉంది. అదే డ్రిల్లు, డ్రాయింగ్, క్రాఫ్టుల వంటివారిని వేస్తే ఏ గొడవా ఉండదు కదా? " అంటారాయన.

క్రాఫ్టు మాస్టారితో వాదించలేక అందరూ చేతులెత్తేశారు.

శిరీషకి, రవీంద్రకి ఇన్విజిలేషన్ వర్క్ ఒకే సెంటర్‌లో పడింది. "ఆదర్శ దంపతులు! ఈ వర్కు దగ్గరకూడా ఇద్దరికీ ఒకే చోట!" డ్రాయింగ్ మాష్టారు తన దుఃఖాన్ని బయటికి వెళ్లగక్కాడు.

"వాళ్ళ భారం నువ్వేం మోస్తున్నావు నాయనా? ఎందుకా ఏడుపు? ఒకరికి ఉందని ఏడిస్తే ఒక కన్ను పోయిందిట, నాకు లేదో అంటే మరోకన్ను పోయిందిట'' శ్యామల గట్టిగానే అంది.

"చూడండి. శ్యామలగారూ! ఏడుపు, గీడుపూ అనకండి. మాటవరసకి అన్నానంతే. మాకేం లేదా పోదా, ఈ డబ్బుల మీద, ఈ ఉద్యోగంమీద ఆధారపడిలేం. సుసంపన్నమైన పొలాలు ఉన్నాయి" అతడూ గట్టిగానే అన్నాడు.

శ్యామల భర్త టైపు ఇనిస్టిట్యూట్ పెట్టుకొన్నాడు. శ్యామలే ఉద్యోగం చేస్తోంది. అందుకే అలాగ హేళన చేస్తూ ఉంటాడు.

వాదన పైకి వెళ్ళిన కొద్దీ ఏమవుతుందో తెలుసు కనుక హెడ్‌మాష్టారుగారు వాళ్ళని అంతటితో ఆపుచేశారు.

శ్యామల గొణుక్కొంటూ శిరీషను వెతుక్కుంటూ వెళ్ళింది. శిరీష ఎనిమిదవ తరగతిలో కూర్చుని పిల్లలకి కథ చెపుతోంది. యం.ఐ. పీరియడ్ ఆమెకుందని శ్యామలకి అప్పుడు గుర్తు వచ్చింది.

శ్యామల ఆమెని చూసి నిట్టూర్పు విడిచింది. "ఈమె అదృష్టవంతురాలు. ఏ బాధా, ఆతృతా ఉండదు. తన క్లాసులే తన లోకం" అనుకుంది.

"టెన్త్‌క్లాసు ఇన్విజిలేషన్ ఆర్డర్స్ వచ్చాయి. ఈ సారి నీకు పడలేదు" శ్యామల తమాషా చేస్తూ అంది.

శిరీష ఆమె దగ్గరికి వస్తూ "పోనీ లెద్దూ. మనం హాయిగా స్కూలుకి వచ్చి వీళ్ళకి రివిజన్ చేసుకోవచ్చును" అంటూ చెప్పేసింది.

కనీసం ఎవరెవరికి పడ్డాయని కూడా ఆసక్తి ప్రదర్శించని ఆమె వైఖరికి శ్యామల విస్తుపోయింది. "మీ వారికి పడ్డాయి. నాకు పడ్డాయి. మరి నువ్వు ఎలా స్కూలుకి వస్తావు? " నిలదీస్తూ అడిగింది.

"నీకు పడిందా? పోనీలే. ఏ ఖర్చుకైనా డబ్బు పనికి వస్తుంది. ఇంక నేను స్కూలుకి రావడమంటావా? ఆరున్నర బస్సుకి వచ్చేస్తాను. ఒక గంట ఈ మొక్కల దగ్గర హాయిగా గడపవచ్చును"

శ్యామల శిరీష మొహంలోకి చూస్తూ ఉండిపోయింది. ఒకరిగురించి ఈర్ష్య ఉంటే బావుండును.

శిరీష మనసులో అప్పుడే తను ఒక గంట ముందు రావడంవలన ఏ స్కూలు పని చేసుకోవాలా అన్న ఆలోచన బయలుదేరింది. ఎంతో కష్టపడి కూరగాయల తోట, పూలతోట పెంచారు. ఈ మధ్య ఒంటి




పూట స్కూలు వలన తోటకి నీళ్ళు పోయడం అవడంలేదు. నలుగురు పిల్లల్ని రమ్మని ఆ పని చేయించాలనుకుంది.

"ఏమిటి! మా ఆవిడ దగ్గర కూర్చుని ఏదో ఆట పట్టిస్తున్నారు?" రవీంద్ర నవ్వుతూ వచ్చి అడిగాడు.

"మేష్టారూ! మీరు అదృష్టవంతులు. ఏ విషయానికీ చలించని భార్య దొరికింది" శ్యామల నవ్వుతూ అంటూంటే లాంగ్ బెల్ మోగింది.

తెలుగు, హిందీ పరీక్షలు జరిగాయో లేదో పదవ తరగతి ఇంగ్లీషు పేపర్లు రెండూ అవుటైపోయాయన్న సంచలనవార్త వచ్చేసింది. అవి రెండూ మళ్ళీ సెలవల్లో పెడతామని ప్రభుత్వ ప్రకటన. లెక్కల పరీక్షలు ఎలాగో సజావుగా వ్రాసి గట్టెక్కామన్న విద్యార్థుల ఆశ ఫలించలేదు. సైన్సు-II పేపర్ అవుటైందని, పేపర్ పూర్తిగా దినపత్రికల్లో ప్రచురించేశారు.

విద్యార్థులు, విద్యార్థుల తల్లిదండ్రులు హతాశులయ్యారు. మండు వేసవిలో మళ్ళీ పరీక్షలు వ్రాయాలి. పరీక్షలు తెమిలి ఒడ్డున పడి, ఏ పోలిటెక్నిక్కో, ఏ పోటీ పరీక్షలో వ్రాసుకొందామనుకొన్న పిల్లలకి తీరని నిరుత్సాహం కలిగింది.

విద్యార్థుల భవితవ్యాలతో ఆటలాడుకొనే హక్కు వీళ్ళకి ఎవరిచ్చారు? ఊరికి నాలుగు రెసిడెన్షియల్ స్కూళ్ళు, కాలేజీలు వెలుస్తున్నాయి. తమ స్కూళ్ళలో చదువుతున్న విద్యార్థులు పాసైపోవాలి, మంచి రాంకులు తెచ్చుకోవాలి. ఈ పోటీ వాళ్ళని అడ్డదారులు తొక్కిస్తోంది.

రవీంద్రకి ఈ పరిస్థితి ఎంతో బాధగా ఉంది. ఆ సాయంత్రం ఇంటికి వచ్చిన శ్రీనివాసుతో అదే వేదన వ్యక్తం చేశాడతను.

"విద్య ఒక వ్యాపారం అయిపోతోంది. డబ్బు సంపాదించాలంటే ఏ చింతపండు వ్యాపారమో, ఏ బట్టల వ్యాపారమో చేసుకోవచ్చును. కానీ ఈనాడు విద్యావ్యాపారం అందరినీ ఆకర్షిస్తోంది. పుట్టగొడుగుల్లాగ స్కూళ్ళు, కాలేజీలు వెలుస్తున్నాయి. పోనీ విద్యాస్థాయిని పెంచి, విద్యార్థులను ఉన్నతంగా తీర్చి దిద్దవచ్చుకదా!

"ఏ సెంటర్లలో తమ స్కూలు పిల్లలు పడకూడదో, ఏ సెంటర్లలో పడవచ్చునో వాళ్ళే అధికారులకి తెలియచేస్తారు. ఏ ఇన్విజిలేటర్లు తమ పిల్లలకి వస్తే బావుంటుందో, ఎవరు రాకూడదో పైరవీలు చేస్తారు.

"అధికారులు నిజాయితీ పరులైతే, తమ పప్పులుడకకపోతే ఇంక సెంటర్లు దగ్గర మాష్టర్లకి బెదిరింపులు. ఎదురు తిరిగితే కొట్లాటలు. 'దినదినగండం'తో మాష్టర్లు ప్రాణాలు పిడికిట్లో పెట్టుకొని సెంటర్లలో డ్యూటీ చేయవలసి వస్తోంది'.

"ప్రెస్ వాళ్ళని డబ్బుతో లొంగదీసుకుని పేపర్లు ముందుగా పొంది, తమ విద్యార్థులచేత చదివించడం ఏం న్యాయం? పేపర్ బండిల్స్ వస్తోంటే ఏక్సిడెంట్లు లేదా ఏ పేపర్ ఇచ్చినవాళ్ళో లీక్ చేయడం లేదా ఏ సెంటర్ చీఫ్ సూపర్నెంటుతోనో లాలూచీ పడి ముందుగా పేపర్ పొందడం ఇదంతా ఒక ప్రహసనంగా మారిపోయింది"

"తప్పు చేసిన వాళ్ళని ప్రభుత్వం ఏం శిక్షిస్తోంది? తల్లి దండ్రుల, విద్యార్థుల ఆవేదనని ఏం చల్లారుస్తోంది. ఉద్యోగస్తులు తప్పుకి కారకులైతే సస్పెండ్ చేస్తున్నామంటుంది. ఆ శిక్ష వాళ్ళకి చాలా? దానివలన విద్యార్థుల నష్టం పూడుతుందా?"

"విద్యామంత్రిగారు ఇలాంటివి ఎన్ని జరిగినా చలించరు. రాజీనామా చేయరు. పూర్వపు నాయకులకి, వీళ్ళకి ఎంత తేడా? ఎంత సమర్థతతో, ఛాలెంజ్‌గా వాళ్ళు పదవులు నిర్వహించేవారు? ఈనాడో! స్వార్థ రాజకీయాలు రాజ్యమేలుతున్నాయి.

ఈనాటి వ్యవస్థలో పబ్లిక్ పరీక్షలు నిర్వహించడం ఒక సవాల్‌గా పరిణమించింది. పరీక్షలు ఈనాటి స్వార్థపరుల వలన పలు పరీక్షలకి గురవుతున్నాయి"

తన ఆలోచనలలో తానుండి శ్రీనివాసుతో రవీంద్ర మనసారా మాట్లాడలేకపోయాడు. శ్రీనివాసు మాత్రం ఏం జవాబు చెప్పగలడు? విద్యంటే ఆసక్తి కలవారిని ఈ విషయాలన్నీ ఎంతో కలవరపరుస్తాయి.

ఎలా ఈ చీడపట్టిన విద్యావ్యవస్థ మారుతుంది? ఏ బెత్తం చూపించి దండిస్తే ఈ స్వార్థపరులు మారతారు? విద్యార్థులకి రోజురోజుకి ఈ వ్యవస్థమీద నమ్మకం పోతోందే? ఎలా వారి బంగారు భవిష్యత్తులకి రాజబాట వేయాలి.

బ్రిటిషువారిని దేశంనుండి తరిమి కొట్టడానికి, స్వాతంత్ర్యం సంపాదించుకోవడానికి ఎన్నో ఉద్యమాలు చేపట్టాం. ఈనాడు కలుషిత వాతావరణాన్ని తరిమి కొట్టడానికి స్వార్థపరుల చేతులలో చిరుదీపాలు ఆరకుండా వెలగడానికి ఏం చేయగలం? "మార్పు" అన్నది అనివార్యం. అయితే ఆ "మార్పు" అన్నది విద్యావ్యవస్థలో ఎప్పుడవస్తుంది?

"శిరీ! తల చాలా నొప్పిగా ఉంది. అమృతాంజనం తెచ్చిపెడతావా? " భార్యని పిలిచి అడిగాడు.

"అంతగా ఆలోచించి తలనొప్పి తెచ్చుకోవడం ఎందుకు? మనం సామాన్యులం. మనం ఏం చేయగలం? " శ్రీనివాసు నిర్లిప్తతతో అన్నాడు. "విశ్రాంతి తీసుకో" అంటూ వెళ్ళిపోయాడు.

ఏదో ఒకటి చేయకపోతే రవీంద్రకి ఊపిరాడటంలేదు. "వాణికి శిరోవేదనం ఈనాటి విద్యావ్యవస్థ" అంటూ ఒక వ్యాసం వ్రాసి ప్రముఖ దినపత్రికకి పంపాడు.

వ్రాసి పడేశాక అతడికి కొంత తృప్తి కలిగింది. తిరిగి తన మామూలు దినచర్యలో పడిపోయాడు. ఆ వ్యాసం ప్రచురింపబడింది. శిరీష తెచ్చి చూపిస్తే అతడు నమ్మలేకపోయాడు. పోనీలే, నా బాధ కొంతమందితోనైనా పంచుకోగలిగానని అనుకున్నాడు.

శిరీషకి ఆ వ్యాసం ఎంతో నచ్చింది. తన నమ్మకం వమ్ముకాలేదు. రవీంద్ర ఒక నివురు గప్పిన నిప్పు. ఆ వ్యాసం ప్రచురించిన కొద్ది రోజుల్లోనే పత్రికవాళ్ళు కొంత డబ్బు పంపారు. అతడు ఆ డబ్బును భార్యకిచ్చాడు.

"రవీ! నీలో మంచి రచయిత ఉన్నాడు. నువ్వే ఈనాటి వరకూ అతడిని బయటపడనీయలేదు" శ్రీనివాస్ అభినందనలు కురిపించాడు.

కొందరు అతడు వ్రాసిన విషయం సత్యమన్నారు. ఈ వ్యవస్థవలన ఎదురవుతున్న సాధక బాధకాలను చక్కగా వివరించాడన్నారు. కొందరు మాత్రం భయపడ్డారు "ఇదేం వ్యాసమయ్యా బాబూ కొరివితో తల గోక్కున్నట్లు. మన అధికారులు చదివారా మన పని సరి" అంటూ తేల్చేశారు. కొద్ది మంది మాత్రం ఆలోచనలో పడ్డారు.

అశోక్ అన్నగారి వ్యాసం చూసి ఆశ్చర్యపోయాడు. "ఏమిటే లావణ్యా! బుద్ధుడులాంటి అన్నయ్య ఇలాగ మారిపోతున్నాడు. ఇదేమి సిత్రం బాబోయ్. రెండు కళ్ళుచూడబోతే చాలవాయే!" అంటూ పాడేశాడు.

"ఎలాఉందిరా నీ చదువు? " సావిత్రమ్మ కొడుకుని అడిగింది.

"ఈ దేశానికి ఏదో ముప్పు వచ్చేలాగ ఉంది" పైకే అనేశాడు అశోక్.

"అదేమిటమ్మా! నువ్వుకూడా ఇలాగ మారిపోతున్నావు? " ఆశ్చర్యంగా కళ్ళింతలు చేసుకొని అడిగాడు.





"నాయనా! కాస్త ఓవర్ యాక్షన్ తగ్గించరా! చిత్తూరు నాగయ్యగారిని మించిపోయావు" లావణ్య అన్నగారిని వెక్కిరించింది.

"అవునయ్యా! అమ్మగారు చదువుగురించి అడగడం తప్పా? " శిరీష నవ్వాపుకొంటూ అడిగింది.

సాధారణంగా "నేను ఇచ్చినవన్నీ సరిగ్గా తిన్నావురా? వాళ్ళకీ, వీళ్ళకీ పెట్టి రెండురోజుల్లో ఖాళీ చేయలేదుకదా? అక్కడ వేసవి ఎండలు ప్రారంభమయ్యాయా? " లాంటి యోగక్షేమాలతో నన్ను ప్రశ్నమీద ప్రశ్న వేసి బాదేసే అమ్మ ఇంతలాగ మారిపోయి చదువు గురించి అడగడమా? " ముక్కుమీద వేలేసుకొని మరింత ఆశ్చర్యపోయాడు అశోక్.

"ఏడిశావులే వెధవా! మాటలు బాగా నేర్చావు" తల్లి కోప్పడింది.

"బాబయ్యా! నువ్వు లేనప్పుడు ఏం జరిగిందో తెలుసా? కిరణ్‌వాళ్ళ జట్టుతో క్రికెట్ మేచ్ పెట్టి మమ్మల్ని పిలిచాడు. ఎంపైర్ వాళ్ళ మావయ్య. మోసంతో మమ్మల్ని గెలిచేశారు" శశాంక అశోక్ వీపు మీద వాలి చెప్పసాగాడు.

"ఆ కిరణ్‌కి ఎంత ధైర్యం? నేను వచ్చేశాను కదా వాడి పప్పులేం ఉడకవు. వెళ్లి రేపు మేచ్ వేస్తామని వాడిని పిలు. బాదేసి ఓడిద్దాం" అశోక్ మాటలతో వాడికి ఏనుగు ఎక్కినంత సంతోషం కలిగింది.

"బాబయ్యా! నువ్వు చెప్పినట్లు నేను లెక్కలుచేస్తే మా టీచర్ కొట్టేసి, ఫస్ట్ మార్కు మా ఫ్రెండుకిచ్చేశారు" శ్వేత తనవంతు కంప్లైంట్ ఇచ్చేసింది.

"ఔరా! ఎంత సాహసం? లెక్కను సరిగా అర్థంచేసికొనక, మాచే చెప్పిన రెండవ పద్ధతినంగీకరించక, మా చిన్నారినే శిక్షించడమా? మార్కులు సరిగా వేయకపోవడమా? ఎటువంటి పిదపకాలం? "

అశోక్ అభినయానికి అందరూ నవ్వేశారు. మర్నాడు శ్వేతతో స్కూలుకి తను వస్తానని ఒప్పందం పడ్డాడు.

"అవునురా చిన్నా! అటువైపు ఏవన్నా సంబంధాలు ఉన్నాయిటరా? కుండమార్పిడి సంబంధం అయినా పర్వాలేదు. నీకూ, దానికి అలాగ కుండ మార్పిడివి కుదిరితే చేసేస్తాను. నాలుగక్షింతలు మీకు వేసేస్తే కానీ నాకు నిద్రపట్టదు" సావిత్రమ్మ ఆరాగా అడిగింది.

"నాలుగక్షింతలు వేయడానికి మాకు పెళ్ళిళ్ళు కుదరనక్కరలేదమ్మా! నువ్వు ప్రతీ రోజూ మాకు బోలెడు అక్షింతలు వేస్తూనే వున్నావు"

అతడు అన్న మాటలకి శిరీష నవ్వింది.

అశోక్ ఉంటే ఆ ఇంట్లో నవ్వులు విరుస్తూనే ఉంటాయి. పిల్లల్లో పిల్లవాడుగా, పెద్దలలో పెద్దవాడుగా ప్రవర్తించే అతడంటే అపరిమితమైన అభిమానం శిరీషకి. మా మరిది, ఆడపడుచు ఇద్దరూ ముత్యాలే అంటూ గొప్పగా అందరితో చెపుతుందామె.

ఎప్పుడైనా రవీంద్ర స్వతంత్రించి వివాహం చేసుకొన్నాడని సావిత్రమ్మ గొణిగితే అతడు ఊరుకోడు.

తన అన్నయ్య నోట్లో వేలు పెడితే కొరకలేనివాడని అతడి వాదన. ఉత్త అమాయక చక్రవర్తి. పూర్వకాలం పద్ధతి వాడు. వాడినా తప్పుపట్టడం అంటాడు.

"వాడి పెళ్ళి విషయంలోనే కదేపాపం వాడు నోరు విప్పి తన కోరిక చెప్పింది. హారతికర్పూరంలాగ మన ఇంటికి అంకితమై పోయాడు కదే అమ్మా! అసలు నువ్వు మాతృమూర్తివేనా? " అశోక్ సందేహంగా తల్లివైపు పరీక్షగా చూసేవాడు.

"ఒరేయ్! నా వంటింట్లో కూర్చుని పిచ్చి కూతలు కూశావంటే నేను ఒప్పుకోను ఫో

అవతలికి. నా కన్నబిడ్డ పెళ్లి విషయం నాకు కాదా? " ఆవిడ కోపంగా అడిగింది.

"పెళ్ళి అన్నది వాడి వ్యక్తిగత విషయం అమ్మా! వాడి కోరికను తల్లిగా నువ్వు తెలుసుకొని తీర్చాలి. ఖర్మ. తల్లి పిల్లలకి బుద్ధులు చెప్పడం పోయింది పిల్లలే చెప్పవలసి వస్తోంది" అతడి మాటలకి ఆవిడ నాలుగు తిట్టి వెళ్లిపోయేది.

"ఎందుకురా! అమ్మతో నీకు గొడవ? " అని లావణ్య అంటే అతడు నవ్వేశాడు.

"బావుందే! నీతో దెబ్బలాడకూడదాయే! ఏమన్నా అంటే లేకలేక కలిగిన ఆడపిల్ల. దాని జోలికి ఎందుకురా అంటారు. అన్నయ్యవైపు వెళితేపాపం తండ్రి తరువాత తండ్రేకదా! ఇంకెవరున్నారు అమ్మ తప్ప! అయినా తందాన తాన అని ప్రతీదానికీ ఊ కొట్టడం నావల్లకాదు" అతడు నిర్మోహమాటంగా చెప్పేస్తాడు.

ఆదినారాయణగారు, భరద్వాజగారు వచ్చారని రవీంద్ర వచ్చి చెపితే శిరీష బయటికి వచ్చింది. వాళ్ళిద్దరూ కూడా టీచర్లే. వాళ్ళని పలకరించి, కాఫీ, టిఫిన్ తెచ్చి ఇచ్చింది.

"మీరు ఇన్విజిలేషన్‌కి వెళ్ళినచోట చాలా గొడవలయ్యాయిట" రవీంద్ర అడిగాడు.

"ఏం చెపుతాం రవీంద్ర! నీతి, నిజాయితీ స్వతహాగా ప్రతీ వ్యక్తికీ ఉండాలి. మన మాష్టర్లలోనే కొందరు కాపీలందించడానికి అగ్గగ్గలాడిపోతారు. ప్రభుత్వం మనకి ఎందుకు టిఎలు, డిఎలు ఇస్తోంది చెప్పు. ఏమన్నా అన్నామా మనమీద ధ్వజమెత్తుతారు ఎప్పుడూ అరువులే కదా అని" ఆదినారాయణగారు ఊపిరి తీసుకోవడానికన్నట్లు ఆగారు.

ఈ డబ్బులకన్నా విద్యార్థుల తల్లిదండ్రులతో బేరాలు పెట్టుకొంటే లాభంకదా! మాష్టర్లు నిజాయితీగా విధి నిర్వహణ చేసేవారైతే ఈ అడ్డమార్గాలని ఎందుకు ప్రోత్సహించడం? కోర్సులు నిజాయితీగా పూర్తి చేసేవాళ్లు ఎందరు? వృత్తిపట్ల ఆరాధన, బాధ్యత కలవారెందరు? ఇలాంటివాళ్ళు అరుదు" భరద్వాజ మాటలలో ఎంతో నిజముందనిపించింది.

భరద్వాజ ధైర్యానికి పెట్టింది పేరు. ఒకసారి డి.ఇ.ఓ. స్కూలుకి వచ్చి టెన్త్ ఫలితాలు ఎందుకు తగ్గిపోయాయని అడిగారుట హెడ్‌మాష్టరుగారిని.

వెంటనే ఈయన అందుకొన్నారు. జీపు అయిదు నిమిషాలు ఆపి ఫలితాలు ఎందుకు తగ్గాయని అడిగితే ఏం చెపుతామని నిలదీశారుట. ఒక గంట కూర్చుంటే వాటికి కారణాలు విశదీకరించవచ్చునని చెప్పారుట.

"పదవ తరగతి పరీక్షలు స్ట్రిక్టుగా నడవాలి. ఏడవ తరగతి వదిలెయ్యాలి. ఇదెక్కడి బాధ?

"ఏడవ తరగతి పరీక్షలలో వాళ్ళ స్కూల్లో ఎందరు పాసవుతున్నారో, పదవ తరగతిలోనూ అందరే పాసవుతున్నారు. 15 మార్కులకి, 20 మార్కులకి విద్యార్థులకి సమాధానాలు, బిట్స్ అందించేపని వాళ్ళ స్కూల్లో లేదు. వూరిలో వారితో తగాదాలు వచ్చినా స్కూల్లోని అందరు టీచర్లు ఒకేమాటమీద నిలబడిపోయారు. వూరి తరఫున వచ్చిన నాయకులకి వివరించి చెప్పారు. చేసేదిలేక వాళ్ళు ఊరుకొన్నారు.

"పోయినసారి ఏడవ తరగతి పిల్లలకి మళ్ళీ స్కూలు తెరిచాక పరీక్షలు పెట్టడం, ఇంతా స్కూల్లో స్ట్రిక్టుగా పరీక్షలు నడిపి, వూరిలోని వారితో విరోధంపడితే ఆ పరీక్షలలో వాళ్ళని వదిలేయడం. పోయిన వారందరూ బయట సెంటరులో వ్రాసి పాసై చక్కగా మళ్ళీ వాళ్ళ పీకమీదికి ఎనిమిదవ తరగతికి వస్తున్నారు. వాళ్ళని





చేర్చుకొంటామా, మానేస్తామా?

"వాళ్ళకి బయట పరీక్షలు నిర్వహించడం మానేస్తే ఈ గొడవ ఉండదుకదా! ఒకవేళ నిర్వహించదలచుకొంటే అధికారులు పకడ్బందీగా నిర్వహించవచ్చునుకదా!

"పైగా ఎందుకు పదవతరగతి ఫలితాలు తగ్గాయని నిలదీయడం, మెమోలు పంపడం. ఎందుకు తగ్గుతాయో వాళ్ళకి తెలియదా? చెప్పేవాడు అడిగేవాడికి లోకువ అంతే"

భరద్వాజ మాస్టారు తన కంచుకంఠంతో ఇవన్నీ కడిగేస్తోంటే డి.ఇ.ఓ. ఏం మాట్లాడగలరు? నవ్వేసి వెళ్ళిపోయారుట. ఇదివరకటిరోజుల్లో అయితే పరీక్ష పోతే పిల్లలు పశ్చాత్తాపపడి, మళ్ళీ ఏడాది చచ్చినట్లు చదువుకొనేవారు. ఇప్పటిరోజుల్లో పోవడమూలేదు. శ్రద్ధగా చదవడమూ లేదు.

ఇనస్పెక్షనుకి వచ్చి ఎనిమిదవ తరగతి పిల్లలకి ఎందుకు చదవడం రాదు? వ్రాయడం రాదు? అంటూ టీచర్లని నిలదీస్తారు. కిందనుండే ఏర్పడుతున్న పరిణామాలకి ఎవరు బాధ్యులు?

చివరికి ఎలిమెంటరీ స్కూల్లో చెప్పడం లేదని హైస్కూలు వాళ్ళు, హైస్కూలులో చెప్పడంలేదని కాలేజీల వాళ్ళూ ఇలాగా తప్పు ఒకరిపై ఒకరు తోసుకొంటూ బతికెయ్యడమే.

విద్యావ్యవస్థని బాగుచేయాలని ఈ దేశంలో ఎందరికి ఉంది? ఉత్తమమైన విద్యను ప్రజలకందించాలని ఎందరు నాయకులకు ఉంది? దిగజారిపోతున్న విద్యా ప్రమాణాలకి ఎవరు బాధ్యత వహిస్తారు? తల్లిదండ్రులా, ఉపాధ్యాయులా? అధికారులా? మాట్లాడితే కూలిపోయే ప్రభుత్వ నేతలా? ఎటు నడుస్తున్నాం? దేశం ఏమైపోతుంది? ఇటువంటి పరిస్థితులలో భరద్వాజవంటివారే మార్గదర్శకులు. ఆయన స్కూలుకి వెళ్లే టైముని బట్టి వాచీ దిద్దుకోవచ్చునంటారు ప్రజలు.

ఇవన్నీ రవీంద్ర దంపతులకి తెలుసును. ఆయన ఉద్యోగ అనుభవాలు యువకులు కథలుగా చెప్పుకొంటారు. వాటివలన ఉత్తేజం పొందుతారు.

వాళ్ళిద్దరూ తాము వచ్చినపని చెప్పారు. రవీంద్ర ఉపాధ్యాయ సంఘానికి సభ్యత్వం కడతాడు తప్ప మిగిలిన విషయాల జోలికి పోడు. అతడిని కార్యవర్గ నాయకుని చేయాలని వారి ఉద్దేశం.

రవీంద్ర చేతులెత్తి దణ్ణం పెట్టేశాడు. తనకి ఏ పదవులూ వద్దు. తన వృత్తిని తాను సక్రమంగా నిర్వహిస్తే చాలునన్నాడు. వాళ్ళు చేసేది లేక మళ్ళీ వస్తామని, మరొకసారి ఆలోచించమని చెప్పి, వెళ్ళిపోవడానికి లేచారు.

"ఇంతకీ ఇన్విజిలేషన్ దగ్గర గొడవ ఏమిటి?" శిరీష అడిగింది.

"ఏముంది? యం.పి.గారి ఊరు కనుక ప్రజలు చెలరేగి లూజుగా వదలమని గొడవ. సెంటర్ చీఫ్ కూడా అటువైపే. పైగా స్లిప్పులు అందించకపోతే కొడతామన్నారు. కొట్టమన్నాం. ఒకరోజు గొడవ అవడంతో అధికారులు, పోలీసులు రంగప్రవేశం చేయడంతో అంతా సర్దుమణిగింది" ఆదినారాయణగారు క్లుప్తంగా ముగించారు.

"జంబ్లింగ్ సిస్టంవలన సజావుగా పరీక్షలు జరుగుతాయనుకొన్నారు"

రవీంద్ర మాటలకి ఆయన నవ్వారు.

"ఎట్టకేలకు ఇదొక పద్ధతి కనిపెట్టారు. సరే. విద్యార్థులు కొత్త స్కూలు, తోటివిద్యార్థులు కొత్తవారు కనుక కొంత భయపడవచ్చును. కానీ తల్లిదండ్రుల ప్రయత్నాలను, ఇన్విజిలేటర్ల అవినీతిని ఎవరు కట్టుదిట్టం చేయగలరు? బద్ధకం పడకుండా అధికా

రులు మారుమూల ఏరియాలకి కూడా వెళ్ళాలికదా! అందరిలో మార్పు రావాలి. లేకపోతే ఏ పద్ధతీ సత్ఫలితాన్నివ్వదు"

భరద్వాజగారి మాటలలో, ఆయన అనుభవసారం వ్యక్తమవుతోంది.



లావణ్యకి సంబంధాలు చూడమని తల్లి గొడవ చేసేస్తోంది. ఈ ఏడాదితో ఫైనల్ ఇయర్ అయిపోతుందికదా. రవి పెళ్ళి సంబంధాల వేటలో పడ్డాడు.

ఎటువైపు వెళదామన్నా కట్నం బాధ ఎక్కువగానే కనబడుతోంది. బ్యాంక్ సంబంధాలు చూద్దామంటే లక్షకి తక్కువగా లేరు. L.I.C. అసిస్టెంట్లూ తక్కువ తిన లేదు. వాళ్ళకన్నా ఎక్కువ అడుగుతున్నారు.

లక్ష కట్నం ఇస్తే మరొక లక్ష పెళ్ళిఖర్చు కాక తప్పదు. ఏం చెయ్యడమా అని ఆలోచనలో పడ్డాడు.

లావణ్య పేర వేస్తున్న డబ్బు ఒక ఏభై వేల వరకూ ఉంటుంది. అంతకుమించి దాచింది లేదు. అందులో తమ్ముడి చదువు కోసమని లోను పెట్టాడు. అది తీర్చాలి. ఎటు చూసినా ఇల్లు తప్ప ఏదీ కనబడటం లేదు.

శిరీష వాదన వేరు. ముందు సంబంధం చూడండి. అప్పు దొరకదా ఏమన్నానా? నెమ్మదిగా తీర్చుకొందాం అంటుంది. తమ్ముడి చదువు అప్పు బయట కొంత ఉంది.

మధ్యతరగతి కుటుంబంలో పుట్టడమంత దరిద్రం మరొకటి లేదనుకొన్నాడు రవి. సరే. సంబంధం కుదిరాక ఇవన్నీ చూసుకో వచ్చునని, బంధువులకి చెప్పేశాడు.

రవి మావయ్య ఒక మెడికల్ రిప్రెజెంటేటివ్ సంబంధం తెచ్చాడు. రవికి అదిష్టం లేదు. మరొక పదిరోజులు తిరగకుండానే ఆయన ఒక రైల్వే సంబంధం ఒక బేంక్ సంబంధం తెచ్చారు.

ఈలోపు ఒక సంఘటన జరిగింది. పక్కనున్న ఇంటావిడ సావిత్రమ్మ చెవిలో ఒక విషయం ఊదింది. "పిల్లకి ఇప్పుడు ఏమంత వయసు వచ్చిందని చక్కగా ఎమ్. ఎస్సి. చదివించండి. పైచదువు చదివితే పెద్ద ఉద్యోగమున్న భర్త వస్తాడు. అదీగాక ఈ రోజులలో డాక్టర్లని డాక్టర్లు, టీచర్లని టీచర్లు, ఇంజనీర్లని ఇంజనీర్లు పెళ్ళిళ్లు చేసేసుకొంటున్నారు. ఏ గుమాస్తాకో, ఏ సెకండరీ టీచర్‌కో ఇచ్చే ఖర్మ మీకేమిటి వదిన గారూ! చక్కగా పై చదువులు చదివితే పెద్ద సంబంధం వస్తుంది"

సావిత్రమ్మకి ఈ మాటలు బాగా నచ్చాయి. కొడుకుని సంబంధాలు చూడమని గొడవ పెట్టింది తను. ఇప్పుడు అతడు ఆ ప్రయత్నంలో ఉన్నాడు. తను ఏవిధంగా దాన్ని ఆపగలదు? ఆవిడ ఆలోచనలో పడింది.

రవీంద్రతో వచ్చిన చిక్కే అది. తల్లి ఏపని గట్టిగా చేయమంటే ఆపని చేస్తాడు. చెల్లి విషయంలో, తమ్ముడి విషయంలో ఆవిడ అసంతృప్తి పడకూడదని అతడి ఉద్దేశం. తలకి మించిన బరువైనా తమ్ము





డిని కంప్యూటర్ కోర్సు చదివిస్తున్నది అందుకే.

మామూలుగా అయితే తమ్ముడు డిగ్రీ పూర్తి చేయగానే బేంక్ టెస్టులు వ్రాయమన్నాడు. బి.ఇ.డి.లో సీటు వచ్చింది. అయితే అశోక్‌కి మాష్టరి ఉద్యోగం ఇష్టం లేదు.

పిల్లలంటే ఇష్టమే. కానీ ఉదయంనుండి సాయంత్రంవరకూ కాకిలాగ వాళ్ళతో అరవాలి. ఎదుగూ బొదుగూ ఉండని జీవితం. అతడికి జీవితంలో థ్రిల్ కావాలి.

కంప్యూటర్ కోర్సు చదవాలని ఉంది. అందుకే ఎం.సి.ఎ. ఎంట్రన్సు టెస్టు వ్రాశాడు. రాంక్ మంచిది రావడంవలన దగ్గరలోనే సీటు వచ్చింది. అంత డబ్బు పెట్టమని అన్నగారిని అడగలేడు. ఇష్టంలేని చదువు చదవలేడు.

ఈ ఆలోచనలతోనే అతడు సతమతమవసాగాడు. చివరికి రవీంద్ర అతడిని గమనించాడు. హుషారు లేకుండా, గడ్డం పెంచి ఎలాగో కనబడుతున్న తమ్ముడిని పిలిచి విషయం అడిగాడు.

శిరీష పెద్దమ్మ గారింటికి వెళ్ళింది. అన్నగారు పిలిచి విషయమడిగితే చెప్పకుండా వదినని చూడాలని ఉంది. తీసికొని వస్తానని ఊరు బయలుదేరాడు.

శిరీషకి పెద్ద తల్లి అంటే చిన్నప్పటినుండీ ఎంతో ఇష్టం. ఆమెకీ ఆడపిల్లలు లేక. శిరీషను ఎక్కువ మాలిమి చేసుకొంది. ఆవిడకి ఇద్దరూ మగపిల్లలే. భర్త ఆఫీసరు. చీకూ చింతాలేని జీవితం ఆవిడది. శిరీషని రమ్మనమని ఆవిడే వ్రాస్తుంది. వెళితే పదిరోజులుంచుకొనిగానీ పంపదు. వచ్చేటప్పుడు ఆమెకి మంచి చీర, పిల్లలకి బట్టలు, రవీంద్రకి బట్టలు ఇచ్చి పంపిస్తుంది.

కాలింగ్‌బెల్ మోత విని, వచ్చి తలుపు తీసిన శిరీష మరిదిని చూసి ఆశ్చర్యపోయింది. తరువాత ఎవరికి ఏం జరిగిందా అని భయపడింది. ఎప్పుడూ నవ్వుతూ, నవ్విస్తూ ఉండే మరిది అలాగ కన్పించేసరికి ఆమెకి కాళ్లూ, చేతులూ ఆడలేదు.

"ఇంటిదగ్గర అందరూ బావున్నారా?" గాబరాగా అడిగింది. అశోక్ పేలవంగా నవ్వుతూ "అందరూ బావున్నారు. మరేం గాబరాపడక్కరలేదు" అన్నాడు.

"మరి నువ్వెందుకిలా ఉన్నావు? ఏదో జరిగింది. చెప్పవయ్యా బాబూ! నా ప్రాణం ఆత్రుతతో పోయేలాగుంది" అని నిలదీసింది.

అప్పటికే ఆడుకొంటున్న పిల్లలిద్దరూ అతడిని చూసి పరుగెత్తుకొని వచ్చారు. "బాబాయ్ అలా ఉన్నావేం?" శ్వేత వెంటనే అడిగేసింది.

"అబ్బ... అందరూ బాగున్నారని చెపుతున్నానా? నాకే ఏమీ బావుండలేదు" అతడు విసుగ్గా అన్నాడు.

శిరీష దాంతో మరింత కంగారుపడింది. అతడికి బావుండలేదా? ఏం మనిషి? ఒంట్లో బావుండనివాడు అన్నగారిని పంపక తను వచ్చెయ్యాలా? ఆమె అతడిని ఆరోగ్యం గురించి ప్రశ్నలు అడగసాగింది.

అశోక్‌కి నిజంగానే నీరసం వచ్చేసింది. చిరాకుగా అన్నాడు. "పెద్ద డాక్టరులాగ వంద ప్రశ్నలు వేయకుండా మన ఊరు బయలుదేరండి. అర్జెంటుగా వెళ్ళాలి. ఏదో బంధువుల ఇంటికని వచ్చినవాళ్ళు నాలుగు రోజులుండి వచ్చెయ్యవచ్చుకదా! రోజులు రోజులు తిష్టవేసి ఉండిపోతే ఎవరూ బెంగపడరా?" అన్నాడు.

శిరీషకి అప్పటికి పరిస్థితి అర్థమైంది. మరిది ఏదో సమస్యవలన ఇక్కడికి వచ్చాడు. తనని ఇంటికి రమ్మంటున్నాడు. వెంటనే అతడిని పలకరించడానికి వచ్చిన

పెద్దతల్లితో తాను ఆ పూట అత్తవారింటికి వెళ్ళిపోతున్నానని చెప్పేసింది.

ఆవిడ ఉన్నపిల్ల ఉన్నట్లుగా వెళ్ళిపోతా నంటే కంగారుపడింది. కూతురిపై అప్పుడు ఆవిడ ప్రశ్నలమీద ప్రశ్నలు గుప్పించసాగింది.

చివరికి ఎలాగో ఆవిడ సమాధానపడి సాయంత్రం వెళ్ళమంది. కాస్త చలిమిడి, రెండు స్వీట్లు అయినా ఇవ్వకుండా పిల్లని ఎలాగ పంపడం?

అశోక్ అక్కరలేదన్నా ఆవిడ ఒప్పుకోలేదు. ఆ రాత్రి రైలు ఎక్కాక అప్పుడు తన మనసులోని బాధ వదినతో చెప్పాడు.

శిరీషకి అతడిని చూస్తే జాలీ కలిగింది. కోపం వచ్చింది. ఉత్తప్పుడు పెద్ద కబుర్లు ఆడతాడు. తనకి కావలసినవి అడగడానికి మళ్ళీ ధైర్యం లేదు.

ఆ క్షణంలో భర్త మీద కూడా కోపం వచ్చింది. తమ్ముడి మనసులో ఏం ఉందో తెలుసుకోవద్దా?

భార్య వెంటనే వచ్చెయ్యడం రవికి సంతోషంగా అన్పించింది. పోనీలే. నీ మరిది ధర్మమా అని త్వరగా వచ్చావు అంటూ వేళాకోళం చేశాడు. పిల్లలు తండ్రిని చుట్టుకొనిపోయారు.

సావిత్రమ్మ అశోక్‌ను దెబ్బలాడింది. వదినని చూసి వచ్చెయ్యవలసింది. పాపం అది వెళ్ళక వెళ్ళక వెళితే వెంటనే తీసుకొని వస్తావా అని.

మధ్యాహ్నం భోజనాల దగ్గర శిరీష భర్తతో విషయం చెప్పేసింది. "తను తెలివైనవాడు. యం.సి.ఏ. చదవాలనుకొంటున్నాడు. కుటుంబంలో ఒకరైనా బాగా చదువుకొంటే మంచిదేకదా!"

రవీంద్ర భార్య మాటలకి ఆశ్చర్యంగా తమ్ముడి మొహంలోకి చూశాడు. "అతడికి బి.యి.డి చదవడం ఇష్టంలేదు. అయినా సీటు వచ్చినప్పుడు అతడు ఇష్టపడేదే చదివిద్దాం. ఏమంటారు? " మళ్ళీ భర్తని అడిగింది.

అశోక్ అన్నంలో గీతలు గీయసాగాడు. పెద్దకొడుకు పడుతున్న తర్జన భర్జనలు తల్లి గమనించింది.

"లావణ్యా! అదేం చదువు? గొప్ప చదువా? " కూతురిని అడిగిందావిడ.

లావణ్యకి కోపం ముంచుకొని వస్తోంది. తామేమిటో, తమస్థితి ఏమిటో తెలుసుకోకుండా ఈ గొంతెమ్మ కోరికలు ఏమిటి? పెద్దన్నయ్య భరించవద్దూ?

"ఈ రోజుల్లో అందరూ కంప్యూటర్ కోర్సు చదవాలని ఉబలాటపడుతున్నారమ్మా! వీడికీ అది చదవాలని ఉందిట. డొనేషన్ కట్టాలి ప్రతి ఏడాది. మూడేళ్లు డొనేషన్ కట్టడం ప్రతీనెలా డబ్బు పంపాలి చదువుకోవడానికి. ఒకలక్ష నీ కొడుకు చదువుకి అవుతుంది. అర్థమైందా? " కోపంగా తల్లినడిగింది.

శిరీష లావణ్యను వారింపుగా చూసింది. "మంచి ర్యాంకు రావడమే కష్టం. సీటు వచ్చినప్పుడు చదవాలని కోరిక ఉండటం తప్పా? చిన్న పిల్లవాడు. ఎవరిని అడగగలడు? " శిరీష వాదనకి లావణ్య అప్రతిభురాలయింది.

"బావుంది. భార్యగా భర్త సాధక బాధకాలు చూడవలసినదానివి. అన్నయ్య స్థితిగతులు చూడవలసిన అవసరం లేదా? మీకు ఇద్దరు బిడ్డలున్నారు. వాళ్ళని పెంచవద్దా? " అంది.

వయసుకిమించి ఎదిగిన చెల్లెలిని రవీంద్ర అపురూపంగా, ఆశ్చర్యంగా చూశాడు. అశోక్ చెల్లెలి మాటలతో మరింత నిరుత్సాహపడ్డాడు.





శిరీష నిరుత్సాహపడుతున్న మరిదిని పరీక్షగా చూసింది. ఈ వయసులో తమకి కావలసింది దెబ్బలాడి సాధించుకొంటారు. అలాంటిది విద్య విషయంలో, న్యాయమైన దాని విషయంలో తమ అభిప్రాయానికి, ఇష్టానికి విలువనివ్వడానికి ఇతడు సిద్ధపడుతున్నాడు.

"లావణ్యా! అశోక్ మీరిద్దరూ వినండి. ఈ ఇంటికి వచ్చిననాడే మీరిద్దరూ నా బిడ్డలనుకొన్నాను. మీ తర్వాతే నా బిడ్డలు, అశోక్ ఏం తప్పు చేయడం లేదుకదా! ఇంట్లో అందరం మాష్టర్లమే అవ్వాలా? " శిరీష మృదువైన స్వరంతో అంది. "అశోక్ మంచి పిల్లాడు. బాగా చదివి రాణిస్తాడు. నాకా నమ్మకం ఉంది. అతడు రేపు మంచి ఉద్యోగం పొంది, విదేశాలు వెళితే ఆ ఆనందం మనది కాదా? అతడికి ఎక్కువ జీతం వచ్చి మంచి జీవితం ఏర్పడితే ఆ ఆనందం మన కుటుంబానిది కాదా? నా పిల్లల చదువులు రేపు అతనే చూసుకొంటాడు" అంది. రవీంద్ర భార్యవైపు చెమ్మగిల్లిన కళ్ళతో చూశాడు.

మరిదివైపు ఆప్యాయంగా చూస్తూ, "ఇంకనైనా ఈ దేవదాసు అవతారం వదిలెయ్యి. అన్నయ్యతో కలిసి కాలేజీకి వెళ్ళు. కావలసిన బట్టలు కొనుక్కో" అంది.

అశోక్ కళ్ళు ధారాపాతంగా వర్షించసాగాయి. ఎంత నిస్వార్థపరురాలు? తన వదిన ఎంత ప్రేమమయి. తనపై ఎంత భరోసా? వదిన కాళ్ళపైపడి నమస్కారం చేశాడు. అతడికి ఏ మాటలు చెప్పడానికీ నోరు పెగలలేదు.

"పిచ్చీ, నువ్వు ఉత్త సెంటిమెంట్ పిల్లాడివి. తమ్ముడికి చేయడం మీ అన్నయ్య బాధ్యత కాదా? " అంటూ సున్నితంగా అతడిని లేవదీసింది.

సావిత్రమ్మ గొంతుక్కి కూడా ఏదో అడ్డుపడ్డట్టే అయింది. అటు పెద్దకొడుకు, అతడి బాధ్యతలు అన్నీ తెలిసి చెప్పలేదు. ఇటు తండ్రిలేని వెధవ. చదువుకోసం ఆరాటపడుతున్నాడు. అంత పెద్ద చదువు చదివించమని ఎలా అనగలదు? ట్రైనింగ్ పూర్తిచేసుకొని అన్నగారికి సాయంగా ఉద్యోగం చేసికొంటే లావణ్య బాధ్యత తీర్చవచ్చును. అందుకే ఏమీ మాట్లాడలేకపోయింది.

కోడలి దగ్గరకి వచ్చి "చిన్నదానివైనా పెద్ద మనసున్నదానివి. వాళ్ళ బాధ్యత అంతా నీదే. ముసలిదాన్ని. ఏం చేయగలను? నిన్ను భగవంతుడు చల్లగా చూస్తాడు" అని తల నిమిరింది.

పెళ్లైన ఇన్నాళ్లకి అత్తగారు అంత సన్నిహితంగా ప్రవర్తించడం శిరీషకి ఆనందాన్నిచ్చింది.

లావణ్యకి ఇప్పుడు ఏం చేయడమో తెలియడంలేదు. ఈవైపు చూస్తే అన్నగారు రెండు సంబంధాలున్నాయని, ఒకరిని పెళ్లి చూపులకి రమ్మంటానని అంటున్నాడు.

ఆవైపు చూస్తే తన చదువు అవలేదు. "పరీక్షలు అవగానే ఏర్పాటు చేస్తాను పెళ్లిచూపులు" అని అన్నగారు తల్లితో అన్నాడు.

చివరికి తన మనసు ఏమిటో ఆయనకి చెప్పాలని నిర్ణయించుకొంది. తన కోరిక మన్నిస్తాడా? వీల్లేదు పొమ్మంటాడా? ఆడపిల్లగా ఆ కోరికను తను కలిగి ఉండటం తప్పా.

లావణ్య ఆలోచనలో పడింది. ఎన్ని విధాలుగా ఆలోచించినా తన కోరిక సమంజసమేనన్పించింది.

ఆ సాయంత్రం రవీంద్ర పడక కుర్చీ వేసుకొని మొక్కల దగ్గర వరండాలో కూర్చున్నాడు.

శిరీష అప్పుడే మొక్కలన్నింటికీ నీళ్లు పోసినట్లుంది. మొదళ్లు నీళ్లతో నిండివున్నాయి. శిరీషకి మొక్కలంటే తగని ఇష్టం.

ఆమె వాటికి ఎంతో సంరక్షణ చేస్తుంది. ఎప్పటికప్పుడు ఎరువు తెప్పించివేస్తుంది. ఆవిడ నీళ్లుపోసే విధమే వేరుగా ఉంటుంది. మొక్కని సొంతం నీళ్లతో తడుపుతుంది. వాటితో మనుష్యులతో మాట్లాడినట్లు మాట్లాడుతుంది.

ఏ మొక్క చిన్నమొగ్గ తొడిగినా ఆమెకి చెప్పలేని ఆనందం. ఏ కూరగాయలమొక్క పిందె తొడిగినా ఆమెకి పండుగే. ఇంట్లో అందరికీ పేరుపేరుగా చెపుతుంది.

మొక్కలమీద నుండి వచ్చే చల్లటిగాలి ఎంతో బాగుంది. ఈ గాలి భోంచేసి బతకవచ్చుననుకొన్నాడు అతడు. పరిసరాలను అందంగా ఉంచుకోవడంవలన మనిషికి ఆనందం దొరుకుతుందని భార్య అనేమాట అతడికి గుర్తువచ్చింది.

"అన్నయ్యా నీకు ఒక విషయం చెప్పాలి."

ఎదురుగా లావణ్య ఎప్పుడు వచ్చిందో, అతడు తన లోకంలోవుండి గమనించనే లేదు.

స్టూలు దగ్గరగా జరిపి "కూర్చోమ్మా" అని "ఏమ్మా ఏమిటి విషయం? " అని ఆప్యాయంగా అడిగాడు.

లావణ్యకి తను అనుకొన్న విషయం చెప్పడం అంత సులభంగా అన్పించలేదు. తలొంచుకుని చేతిగోళ్ళకి మట్టి లేకపోయినా తీసుకోవడం ప్రారంభించింది.

రవి పరీక్షగా చెల్లెలివైపు చూశాడు. తెల్లటి తెలుపు, పొట్టి, పొడుగూకాని ఎత్తు. నుదిటిపై పడుతున్న ఉంగరాల జుట్టు. లావణ్య జుట్టు చూడగానే అతడికి తమ్ముడు గుర్తు వచ్చాడు. లావణ్య జడ పొట్టిగా, లావుగా ఉంటుంది. తమ్ముడు "గొరక చీపురు" అని పేరు పెట్టి ఏడిపిస్తాడు. అది గుర్తుకి రాగానే అతడి పెదవులపై నవ్వు వెలిసింది.

లావణ్యకి అది చూశాక ధైర్యం వచ్చింది. ఈలోపు అతడే అన్నాడు, "ఏమ్మా! డబ్బు ఏమన్నా కావాలా? "

వద్దంటూ తల ఊపింది.

"మామయ్యగారి ఊరుగాని, స్నేహితుల ఊరుగాని వెళతావా? " మళ్లీ అతడే ఆలోచనగా అడిగాడు.

లావణ్య కాదంది. నిజమే. చెల్లి ఏనాడూ ఒక్కర్తీ ఏ ఊరూ వెళతానని అనేలేదు. అందరూ పిక్నిక్కులకంటూ వెళ్ళేవాటికి కూడా తను దూరంగా ఉంటుంది.

అతడికి తనమీద తనకే కోపం వచ్చింది. శిరీష అన్నట్లు త్వరగా ఏ ఆలోచనలూ తనకి రావుకదా!

అంతలోనే అతడి మెదడులో ఫ్లాష్‌లాగా తటిల్లుమని ఒక ఆలోచన వచ్చింది. కొంపదీసి తన చెల్లెలు ఎవరినో ప్రేమించలేదు కదా! ఆ విషయమే ఇలాగ చెపుదామని వచ్చి చెప్పలేకపోతోందా?

తమకి శ్రమ ఇవ్వకుండానే తన వరుడిని తాను చూసుకొందా? బ్రాహ్మణుడు అయితే బాగుండును. లేకపోతే ఎలా? ఈ బంగారు చెల్లి ఏం చెప్పబోతోంది.

అతడు భయంగా ఆ విషయమే ప్రస్తావించబోయేంతలో లావణ్య తనే నోరు విప్పింది.

"అన్నయ్యా! నువ్వు పెళ్లి సంబంధాలు చూస్తున్నావని నాకు తెలుసును. నా మనసు నీకు తెలియచేయాలని వచ్చాను"

రవికి భయం వేసింది. అదిగో తను అనుకొన్నట్లే చెల్లెలు సంభాషణ మొదలుపెట్టింది. ఏం దారిరా భగవంతుడా అనుకొన్నాడు. చెల్లెలి వ్యక్తిత్వంపై అతడికి ఎంతో నమ్మకం. కానీ ఈ కాలం పిల్లల ప్రేమకథలు వింటూనే ఉన్నాడు.

"నాకు ఇప్పట్లో పెళ్ళి చేయవద్దు అన్నయ్యా" లావణ్య స్పష్టంగా చెప్పింది.





"ఎందుకమ్మా! పెళ్లిచూపులు జరగకుం డానే పెళ్లి వద్దంటే ఎలా?" అతడు తడారిన గొంతుకతో అడిగాడు.

"లావణ్యా! నువ్వు ఎవరినైనా..." అతడికి వాక్యం పూర్తి చేయడానికి ధైర్యం చాలలేదు.

లావణ్యకి తననితాను చెప్పు పట్టుకొని కొట్టుకోవాలన్పించింది. పాపం అన్నయ్య అందుకే అలాగ అయిపోయాడు. తను చెప్పదలచుకొన్నది సూటిగా చెప్పకపోవడం తనదే పొరపాటు.

"ఛ... ఛ... అది కాదన్నయ్యా! నా కసలు పెళ్ళి గురించి ఇంకా ఆలోచనే లేదు. ఈ రోజుల్లో ఆడవారికి తగినంత చదువు అవసరంకదన్నయ్యా! తన కాళ్ళమీద తాను నిలబడగలిగే స్థితి సంపాదించుకోవాలి"

"నిన్ను డిగ్రీ చదివించానుకదమ్మా" అతడు మాటలు మరొకవైపు నడవడంతో ఊపిరి హాయిగా తీసుకొంటూ అన్నాడు.

"డిగ్రీ, టైపూ అయినంత మాత్రాన ఉద్యోగం దొరుకుతుందా? బి.యి.డి ట్రెయి నింగ్ అయితే టీచర్‌ని అవవచ్చును. ఈ ఏడాది ఎంట్రన్సు వ్రాస్తానన్నయ్యా! బి.యి.డి చెప్పించవూ! అదయ్యాకే పెళ్లి. అప్పుడు వీలయితే ఉద్యోగం చేయవచ్చును"

అన్నయ్య ఆలోచనలో పడటం చూసి అడిగింది లావణ్య "ఏం అన్నయ్యా! నేను ట్రైనింగ్ అవడం నీకు ఇష్టమేకదా"

అతడు వెంటనే తన ఆలోచనలలోనుండి బయటికి వచ్చాడు. నవ్వుతూ వెంటనే "ఇష్ట మేనమ్మా" అన్నాడు.

"మరి మరి..." అంటున్న చెల్లెలిని అర్థం చేసుకొంటూ "డబ్బు గురించి నీకు ఎందు కమ్మా ఆలోచన. వాడికి కావలసిన చదువు చెప్పించడం లేదా? నీకూ అలాగే" అన్నాడు.

"అన్నయ్యా! అమ్మతో ఈ విషయం నువ్వే చెప్పాలి"

అతడు నవ్వుతూ తల ఊపాడు.

పెద్దకొడుకు చెప్పిన మాటలు విని ఆవిడ ఒకవిధంగా సంతోషించింది. అయితే పైచ దువు చదవమని కూతురికి చెప్పింది. పెద్ద చదువులు చదవకపోతే పెద్ద సంబంధాలు కుదరవంది.

తల్లి మాటలకి లావణ్య నవ్వుకొంది. "పైచదువు చదవడం, అన్నయ్యకి ఇంకా భారం అవడం నాకు ఇష్టం లేదమ్మా! నేను ట్రైనింగ్ అయి, ఉద్యోగం సంపాదించుకొం టాను. నా కాళ్ళమీద నేను నిలబడతాను" అంటూ ఖచ్చితంగా చెప్పింది. అశోక్ మాత్రం "ఇంకా ఏడాది ఎందుకే! మాకు తిండి దండుగ. పెళ్లి చేసుకొని వెళితే తిండి ఖర్చు, చీరల ఖర్చు మిగులుతుందికదే" అంటూ ఆట పట్టించాడు.

"ఎందుకు వదినా? ఆడపిల్లబరువు ఎంత త్వరగా దింపుకొంటే అంత మంచిది. పెద్ద వాడిని చెపుతున్నాను వినండి" అశోక్ మాటలకి లావణ్య గయ్యిమని లేచింది.

"నా బరువు నువ్వేం మోస్తున్నావురా? పైసా పెట్టకుండానే ఇన్ని మాటలు అంటు న్నావు. రేపు నిజంగా సంపాదించినా కానీరాల్చవు. పెద్దన్నయ్య నిజంగా దేవుడు"

లావణ్య మాటలకి అతడు నవ్వాడు. "చూశావా! నా వలన కానీ పెద్దన్నయ్య గుర్తించబడటంలేదు. అయినా వాడేమిటి? నేనేమిటి? ఇద్దరం ఒకటే. వాడు రేపు అప్పులలో కూరుకొని పోతే బయటపడ వేయవలసినవాడిని నేనే కదా! పిచ్చికుంక. వయసు వేడిలో ఏదో జోరుగా వెళుతు న్నాడు. నా మాటవిని ఒక ఇంటిదానివై మా భారం దింపు తల్లీ!" రెండు చేతులూ ఎత్తి నమస్కారం చేస్తున్న అతడు వెనక నున్న అన్నగారిని చూడలేదు.



"చూడు అన్నయ్యా! వాడి గొడవ." లావణ్య ఫిర్యాదుతో అతడు వెనక్కి చూశాడు.

"నాకు బోలెడు వర్కు ఉంది. చేసుకోవాలి" అంటూ జారుకొన్నాడు.

'అలా దారికిరా నాయనా!' అనుకుంది లావణ్య.

రవి స్నేహితుడితో చెల్లెలు చెప్పిన విషయం చెప్పాడు. "దానికోరిక సమంజసమే కానీ చిన్న పిల్లమాట పట్టుకొని సంబంధాలు చూడటం ఆపడం మంచిదా అన్పిస్తోంది. పెళ్లయితే ట్రైనింగ్ అవడం కష్టమే. ఏంచేయడమో" అన్నాడు.

శ్రీనివాసు కాసేపు ఊరుకొన్నాడు. "చదువుకొంటానన్నందుకు సంతోషించాలి. ఉద్యోగం వస్తే ఆ అమ్మాయి కోరికకూడా తీరుతుంది కదా!" అన్నాడు.

"ఏం తీరుతుందో! ఉద్యోగం చేస్తున్నవాళ్ళకి కూడా తల్లి దండ్రులు ఎంతెంతకట్నాలు ఇస్తున్నారో మనకి తెలియదా!" అతడు నిరుత్సాహంగా అన్నాడు.

శ్రీనివాసు నవ్వాడు. "సర్లే అప్పటి విషయం ఇప్పుడు ఎందుకు? ప్రస్తుతం నా దగ్గర ఎంట్రన్స్ గైడ్ ఉంది. మా ఇంటికి రా! తనకి ఇస్తే పరీక్షలకి చదువుకొంటుంది"

ఇద్దరూ శ్రీనివాసు ఇంటివైపు నడిచారు. శ్రీనివాసు పెద్దచెల్లి రెండవసారి పురిటికి వచ్చింది. రవి నవ్వుతూ పలకరించాడు. స్నేహితుడి కుటుంబ ఖర్చులకి అతడి మనసు జాలిపడింది.

తండ్రి తాగుడుమూలంగా రెండవ చెల్లెలికి కుదరవలసిన సంబంధం తప్పిపోయింది. మేనరికం ఇద్దామంటే తండ్రి ఒప్పుకోడు. ఈయనకేదో ఉందన్నట్లు వాళ్ళు లేనివాళ్ళంటారు. శ్రీనివాసు నవ్వుతూ ఇవన్నీ చెప్పి ఆఖరున అందుకే అంటారు, "పీత బాధలు పీతవని" అన్నాడు.

"మే నెలాఖరున మేమందరం కలిసి తిరపతి, కంచి, కాళహస్తి వెళదామనుకుంటున్నాం. నువ్వు కూడా రావచ్చుకదా" అని రవి స్నేహితుడిని అడిగాడు.

"మొక్కు ఏదైనా ఉందా?"

"అబ్బేలేదు. సరదాగా పిల్లల్ని తీసుకుని వెళదామని. అంతే. వాళ్ళు పుట్టాక తిరుపతి చూడలేదు"

శ్రీనివాసు నవ్వి ఊరుకున్నాడు. మరికాసేపు ఇద్దరూ మిగిలిన విషయాలు మాట్లాడుకున్నారు. రవి అన్నది నిజమే. పిల్లల్ని ఎక్కడికీ తీసికెళ్లడం అవడంలేదు. తమ్ముడు రాననడంతో చెల్లిని, పిల్లల్ని తీసుకొని వెళ్లాలని అతడి ఆలోచన.

బదిలీల విషయంలో జాగ్రత్త పడమని స్నేహితుడిని శ్రీనివాసు హెచ్చరించాడు. స్కూళ్ళు తెరవడానికి వారం ముందే వచ్చేస్తామనుకున్నారు.

తీరా బయలుదేరే వేళకి అశోక్‌కి గెస్టు లెక్చర్లు క్లాసులు పడ్డాయి. తల్లిని ఒంటరిగా వదలడం అతడికి ఇష్టంలేదు. రవికి ఏం చేయాలో తెలియలేదు. ముందునుండే ప్రయాణం అనుకోవడం వలన పిల్లలు ఒకటే సరదా పడసాగారు.

చివరికి స్నేహితుడు వచ్చి, రాత్రిళ్ళు సాయం ఉంటానని చెప్పి, బలవంతంగా రవిని, కుటుంబాన్ని పంపించాడు. సావిత్రమ్మ కూడా అనుకున్న ప్రయాణం మానేస్తే మంచిదికాదని భయపడింది.

లావణ్య, పిల్లలు ఆటలతో, కబుర్లతో ప్రయాణం ఎంజాయ్ చేయసాగారు. కిటికీ దగ్గర కూర్చుని కదులుతున్న ప్రకృతిని చూస్తున్న శిరీషను తదేకంగా చూశాడు రవి.

ఏనాడూ ఇది కావాలని అడగదు. ఈ





కుటుంబ బాధ్యతలు ఎప్పటికి తీరతాయని విసుక్కోదు. ఈ బతుకులో సరదా, సంతోషం వద్దా అని నిలదీయదు.

రవికి భార్యపై అనురాగంతో హృదయం ఉప్పొంగింది. తనని, తన బాధ్యతలనీ అర్థం చేసుకుని మౌన స్రవంతిలాగా తన జీవితంలో కలిసిపోయింది.

భార్యవైపు కొద్దిగా వాలి, భుజంపై అభిమానంగా చేయి వేశాడు. శిరీష ఉలిక్కిపడి, ఇటువైపు తిరిగింది. రవి మందహాసంతో అన్నాడు, "ఈ ప్రయాణం నాకేం బావుండ లేదు"

శిరీష తెల్లబోయింది. అతడేగా అన్ని ఏర్పాట్లూ చేసింది. ఒకవేళ తల్లి తమతో రాలేదని బాధపడుతున్నారేమో?

"నిజమే. అత్తయ్యగారు కూడా వస్తే బావుండేది"

భార్య మాటలకి అతడు నవ్వుతూ తలపై చిన్నగా మొట్టికాయ వేశాడు. "ప్రయాణం బావుండలేదన్నది అమ్మ రాలేదని కాదు"

అతడి మాటలు ఆమెకి నిజంగానే అర్థం కాలేదు.

అతడివైపు కొద్దిగా తలెత్తి చూస్తూ అడిగింది. "మరి ఇంకెందుకు బావుండలేదు? "

అతడు మధురమైన స్వరంతో అన్నాడు "ఈ ప్రయాణం ఇద్దరు వయసులో ఉన్న భార్యాభర్తలు చేస్తున్నట్లు లేదు. షష్ఠిపూర్తి అయ్యాక ముక్తికోసం తీర్థయాత్రలు చేస్తున్న ముసలి దంపతులు చేస్తున్నట్టుంది"

శిరీష గబుక్కున తలెత్తి చూసింది. అతడి కళ్ళు అల్లరిగా నవ్వుతున్నాయి. పెదవులు కొంటెగా నవ్వుతున్నాయి. శిరీష గుండెలు చిత్రంగా కొట్టుకున్నాయి.

అతడు నెమ్మదిగా ఆమె చేతిని తన చేతిలోకి తీసుకొన్నాడు. ఆ చేతివేళ్ళు పొడవుగా, సున్నితంగా ఉన్నాయి. ఆ చేతి సౌకుమార్యాన్ని అతడు అనుభవిస్తున్నాడు.

ఆమె భుజానికి దగ్గరగా వాలి అన్నాడు. "శిరీ! నాకు ఏమనిపిస్తోందో తెలుసా? "

ఆమె చెప్పమన్నట్లు చూసింది.

"నా వయసు పదేళ్ళు తగ్గిపోయినట్లు అన్పిస్తోంది. మనిద్దరి పరిచయం కొత్తగా జరుగుతున్నట్లుంది"

అతడి కంఠస్వరం మందంగా, మధురంగా పలకసాగింది. "అప్పుడప్పుడు ఇలాంటి ప్రయాణాలు పెట్టుకోవాలి. లేకపోతే ఈ అనుభూతులు లభించవు. నాకు కొత్త వయసు, మనసు వచ్చినట్లుంది"

శిరీష మౌనంగా అతడి భుజంపై వాలిపోయింది.

ఆ ఇద్దరూ అలా మౌనంగా ఎంత సేపున్నారో?

"అమ్మా! ఆకలేస్తోంది. టిఫిన్ ఇచ్చెయ్యి" అంటున్న శశాంక పిలుపుతో ఈలోకంలోకి వచ్చారు.

"వదినా! టిఫిన్లు పెట్టేద్దామా? " అన్న లావణ్య పిలుపుతో, పాప మాటలతో ఈ లోకంలోకి నిజంగానే వచ్చిపడ్డారు.

సావిత్రమ్మ ట్రైనులోకి బోలెడు చేసింది. పూరీ, కూర, పెరుగన్నం, జంతికలు, మైసూరుపాకం, లడ్డూలు, పిల్లలికి ఇష్టమని వేరుసెనగ ఉండలు అన్నీ ఓపికగా సర్ది ఇచ్చింది.

పిల్లలకి, లావణ్యకి మొదట పెట్టేశారు. వాళ్ళు అయ్యాక ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ తిన్నారు.

పిల్లలు, పెద్దలు కలిసి కాసేపు "అంత్యాక్షరి" ఆడుకున్నారు. వీళ్ళసరదా, హుషారూ చూసి చుట్టుపక్కల వాళ్లు కూడా చేరారు. చివరికి శ్వేత గెలిచింది ఆ పోటీలో.

పిల్లలు ఆటలతో, కబుర్లతో ఇట్టే అలిసిపో

యారు. నిద్ర వస్తోందంటూ బెర్తుపై చేరి పోయారు. లావణ్య కూడా వాళ్ళతోపాటు పాటలతో, అల్లరితో గడపడంతో త్వరగా నిద్రపోయింది. రవి, శిరీషలకి మాత్రం నిద్ర రావడంలేదు.

ఆ కూపేలో వాళ్ళిద్దరే మెలకువగా ఉన్నారు. అతడు వెన్నెల్లో అందంగా మెరిసిపోతున్న ప్రకృతిని చూస్తున్నాడు. చల్లటి గాలి, పుచ్చపువ్వులాగ చల్లని వెన్నెల, పున్నమిరాత్రులవడం వలన నిండు చందమామతో వాతావరణం ఎంతో ఆహ్లాదంగా వుంది.

కదులుతున్న చెట్లు, ఊయలలా ఊపుతున్న రైలు అతడిని ఈ అనుభవాన్ని భద్రంగా దాచుకోమని హెచ్చరిస్తున్నాయి.

తెల్లని లుంగీ, తెల్లటి గ్లాస్కోలాల్చీలో భర్త శిరీషకి ఎంతో అందంగా కన్పించాడు. అతడి ఒళ్ళో ఆప్యాయంగా వాలిపోయి పడుకుంది.

అతడు భార్యవైపు చూశాడు. ఆమెకి అనుకూలంగా సర్దుకొని కూర్చున్నాడు. గాలికెగురుతున్న ముంగురులు, కాంతితో మెరుస్తున్న విశాల నయనాలు, చిన్నగా విచ్చుకొన్న గులాబీ మొగ్గవంటి పెదవులు. అతడిచేతివేళ్ళు ఆమె పెదవులపై సున్నితంగా రాశాయి.

గోల్డు రంగుపై నలుపు పువ్వులున్న రబ్బరు పోలిష్టర్ చీర, గోల్డురంగు జాకట్టులలో ఆమె మెరిసిపోతోంది. ఆమె చామనఛాయ ఒంటికి ఆ రంగు ఎంతో నప్పింది.

తలలోని మల్లెలమాల భుజంమీదుగా ముందుకు వాలింది. పొడవైన నల్లటి జడ బెర్తు భాగాన్ని ఆక్రమించుకుంది. అతడు ఆమె ముంగురులు సవరించాడు.

"ఏవన్నా కబుర్లు చెప్పండి" శిరీష నెమ్మదిగా అంది.

"కొన్ని సందర్భాల్లో మాటలు అనవసరమనుకొంటాను"

"ఎవరో ఆ చెప్పింది" ఆమె కొంటెగా అన్నది.

రవి నవ్వుతూ, "ఎవరైతేనేం? జీవిత సత్యాన్ని చెప్పారు" అంటూంటే శిరీష అతడి తలను ముందుకు వంచింది. బుగ్గపై చిన్నగా ముద్దుపెట్టింది.

అతడు కొంటెగా నవ్వుతూ అన్నాడు "ముద్దు స్థానభ్రంశమైంది"

ఆమె సిగ్గుతో అతడిని కళ్ళెత్తి చూడలేకపోయింది.

"అక్కడకాదు ఇక్కడ పెట్టాలి" అంటూ భార్య పెదవులపై గట్టిగా ముద్దుపెట్టాడు.

తర్వాత ఎన్ని కబుర్లు చెప్పుకున్నారో లెక్కేలేదు. జన్మజన్మలనుండి దాచుకున్న కబుర్లన్నీ కరువుతీరా చెప్పుకున్నారు. ఎప్పుడు నిద్రలోకి జారుకున్నారో ఇద్దరికీ తెలియదు.

ముందుగా తిరుపతిలో కాటేజ్ బుక్ చేసుకోవడం వలన, శ్రమపడకుండా సరాసరి కాటేజ్ కి వెళ్ళిపోయారు. పిల్లలకి స్నానం చేయించి, తాము స్నానం చేసి దర్శనానికి బయలుదేరారు.

భగవంతుడికి తలనీలాలు సమర్పిస్తున్న వాళ్లనుచూసి శశాంక, "నాన్నా! నేనూ జుట్టు ఇచ్చేదా? " అని అడిగాడు.

"నా జుట్టు పోయిందోయ్, నాకీ గుండు బాగుండలేదు అని తర్వాత ఏడవకూడదు" రవి నవ్వుతూ హెచ్చరించాడు.

మధ్యలో ఆగి, కొడుకు జుట్టు ఇచ్చేశాక, స్నానం పూర్తిచేసి అప్పుడు దైవదర్శనానికి వెళ్లారు. తృప్తిగా భగవంతుడి దర్శనం చేసుకొని కాటేజ్ చేరారు.

రవి కొండమీద పిల్లలతో రెండురోజులున్నాడు. ఆ ప్రశాంత వాతావరణం అతడికి ఎంతో నచ్చింది. పిల్లలతోపాటు కబుర్లు





చెపుతూ, పరుగులు పెడుతూ సరదాగా ఉన్న అన్నయ్యను చూస్తే లావణ్యకి ఎంతో ఆనందం కలిగింది.

లావణ్యకి, శిరీషకి చీరలు కొనిపెట్టాడు. తల్లికి కాశీచెంబు, దైవవిగ్రహాలు కొన్నాడు. "బాబయ్యకి ఏం కొందాం? " పిల్లలను అడిగాడు. వాళ్ళిద్దరూ పావుగంట ఆలోచనలోపడ్డారు.

బాబయ్యకి ఏంకొనాలి? ఏది కొంటే బావుంటుంది? ఇద్దరూ తర్జన భర్జనలు చేశారు.

శశాంక అన్నాడు. "అసలు బాబయ్య కూడా వస్తే ఎంతో బావుండేది. చక్కగా తనకి కావలసింది కొనుక్కునేవాడు"

"ఆ... బాబయ్యకి వాక్‌మన్‌కొందాం. చక్కగా ఇష్టమైన సినిమాల పాటలు వింటాడు"

శ్వేత ఒప్పుకుంది. తన ప్రపోజల్‌కూడా చెప్పింది. బాబయ్యకి బేగ్ కొందాం నాన్నా! చక్కగా కాలేజ్ బేగ్ కొంటే బుక్స్ అందులో పెట్టుకుని తగిలించుకుని వెళతాడు.

లావణ్య నవ్వుతూ, "మా అన్నయ్య ఒకటి చెప్పమంటే మీరు రెండు చెపుతున్నారా? " అని అడిగింది.

"మరి బాబయ్యకి నేను నావంతు ఒకటి కొంటాను" అని శశిగాడు, "నావంతు కొనకపోతే బాబయ్య నా జట్టు ఉండనంటాడు" అని పాప, తండ్రిని రెండూ కొనమని పోరసాగారు.

రవి నవ్వుతూ ఇద్దరికీ రెండూ కొని ఇచ్చాడు. ఈ ప్రయాణంలో అతడు డబ్బు గురించి ఆలోచించలేదు. టిఫిన్లు, భోజనాలు, టాక్సీలు బోలెడు ఖర్చవుతూంటే శిరీష దెబ్బలాడింది.

పువ్వుల దగ్గరనుంచీ వాళ్ళు అడగకుండా అన్నీ కొని ఇచ్చేవాడు. "మేకప్ బాక్సు వద్దామ్మా? " అంటూ చెల్లికి కొని ఇచ్చాడు.

శిరీష గొడవ మొదలుపెట్టింది ఇంక ఇంటికి వెళ్లిపోదామంటూ. అతడు చేస్తున్న ఖర్చు చూస్తుంటే ఆమెకి భయంగా ఉంది.

ఆ రాత్రి ఆమెను దగ్గరకి తీసుకొని అన్నాడు, "నేను సంపాదించడం మొదలుపెట్టాక ఇదే మొదటిసారి నా ఆనందంకోసం నేను డబ్బు ఖర్చుపెట్టుకోవడం. నాకంటూ కొన్ని మధురానుభూతులని దాచుకోనీ శిరీ! ఈ ప్రయాణాన్ని మరిచిపోలేను. శ్రీనివాసు బలవంతంచేయకపోతే ఈ ఆనందాన్ని మిస్సయ్యేవాడిని కదా!"

వస్తోంటే ట్రెయిన్‌లో చెప్పాడు "మనకి ప్రభుత్వం ఎల్టీసీ ఇస్తోంది కదా! బిల్లు పెట్టుకుంటే కొంత డబ్బు ఛార్జీలకి వచ్చేస్తుంది. మిగిలిన సగమే కదా మనం పెట్టుకొనేది."

అతడు ఎల్టీసీ పెట్టి పర్మిషన్ తీసుకొన్నాడని తెలిసి శిరీష ఆశ్చర్యపోయింది.

"అమ్మ దొంగా! నాతో చెప్పలేదేం? ఎప్పుడు పెట్టారు? "

అతడు ఆమెను ఉడికిస్తూ అన్నాడు కాలర్ ఎగరేసి, "మగవాళ్ళమన్నాక కొన్ని పనులు హఠాత్తుగా చేసి, భార్యలకి థ్రిల్ ఇవ్వవద్దా? "

శిరీష అందంగా మూతి తిప్పింది. లావణ్య వదినగారిని ఎగతాళి చేయడం మొదలుపెట్టింది.

వాళ్ళు ఇల్లు చేరేసరికి క్లాసులు పూర్తి చేసుకొని అశోక్ వచ్చేశాడు. పిల్లలు తాము తెచ్చినవి గొప్పగా చూపించారు. అతడు వాటిని చూసి ఆనందపడ్డాడు.

"ఎంతయినా వాళ్ళు నా పార్టీ. గురువుగారిని ఎలా ప్రసన్నం చేసుకోవాలో వాళ్ళకి బాగా తెలుసు" అని వాళ్ళని అభినందించాడు.

లావణ్యను కోపంగా చూస్తూ అన్నాడు, "నువ్వు చెల్లివని చెప్పుకొందుకు చాలా సిగ్గుగా ఉందే! అన్నగారు, ఇంటిపట్టున ఉండిపోయాడు. వాడికి ఏదన్నా కొనిపట్టు కెళదామన్న ఆలోచన కించిత్తు అయినా ఉందా? "

"చెల్లిని ఊరు వెళుతున్నానని ఓ వంద రూపాయలైనా యింవో చేశావురా? మేనర్స్ తెలియనివాడివి. నిన్ను అన్నగా చెప్పుకుందుకు సిగ్గుగా ఉంది" ఎదురు దెబ్బకొట్టింది లావణ్య.

"అమ్మా! ఇలాంటి అనాగరికురాలిని ఎందుకు కన్నావమ్మా!" అశోక్ తల పట్టుకుని విచారం నటిస్తూ అడిగాడు.

లావణ్య కూడా అతడికేం తీసిపోలేదు. "ఇలాంటి అడివి వెధవని ఎందుకు కన్నావమ్మా? " అంది.

"అవునురా! నీకసలు బుద్ధి ఉందా? చెల్లికి డబ్బు ఇవ్వవలసిన వాడివి, పైగా అది తేలేదని యాగీ చేస్తున్నావా? " సావిత్రమ్మ కూతురిని వెనకేసుకొచ్చి దెబ్బలాడింది.

అశోక్ అయిదు నిముషాలు మాట్లాడలేదు.

ఉన్నట్టుండి "అమ్మా!" అని అరిచాడు.

సావిత్రమ్మ హడలిపోయింది. వెంటనే అడిగింది "ఏంరా? ఏమైంది? "

"నేను అసలు నీకన్న కొడుకునేనా? "

ఆవిడ అతడివైపు వాడికేమన్నా పిచ్చిపట్టిందా అన్నట్లు చూసింది.

"ఇప్పుడు ఆ డౌటు ఎందుకు వచ్చిందిరా? "

అశోక్ ఫిర్యాదు చేస్తున్నట్లు వదినతో అన్నాడు. "రాదా మరి. ఎక్కడో దొరికిన వాడినేమో ననుకొంటాను. లేకపోతే మా అమ్మ అయితే ఎంతసేపూ దాన్నే సపోర్టు చేస్తుందెందుకని? ఎప్పుడైనా నన్ను సపోర్టు చేసిందా? "

శిరీష నవ్వాపుకుంటూ లేదన్నట్లు తల ఊపింది. "అందుకే రేపు అమ్మకి పురుడు పోసిన మంత్రసానిని కలవాలనుకుంటున్నాను"

అతడు సీరియస్‌గా అంటూంటే సావిత్రమ్మ నెత్తిమీద ఒక మొట్టికాయ వేసింది "పిదపకాలం వెధవ. పిదపకాలం బుద్ధులు" అంది.

మర్నాడు ప్రయాణపు బడలిక వలన శిరీష పెందరాళే లేవలేకపోయింది. ఎనిమిది గంటలవరకూ ఏనాడూ పడుకుని ఎరగదు.

బాగా పొద్దెక్కిపోయిందని సిగ్గుపడిపోయింది. తనని లేపనందుకు భర్తమీద కూడా కోపం వచ్చింది. పెరట్లోకి వచ్చేటప్పటికి లావణ్య పళ్ళు తోముకుంటూ కన్పించింది.

అత్తగారివైపు అపరాధ భావంతో చూస్తూ, "మీరు ఒక్కరూ పనంతా చేసుకున్నారు. నన్ను లేపకపోయారా అత్తయ్యా? " అంది.

సావిత్రమ్మ కూతురికి, కోడలికి కాఫీ గ్లాసులందించింది. "అయినా ఏమంత పనుందని. ప్రయాణంతో అలసిపోయి వచ్చావని లేపలేదు. అబ్బాయి స్నానంచేసి నిన్ను రెడీగా ఉండమన్నాడు"

అత్తగారు తేలికగా అనేసినా శిరీషకి సిగ్గుగానే ఉంది. ఆమె స్నానానికి వెళుతూంటే మరిది నాలుగురోజుల క్రితం వదినగారి స్టూడెంట్సు వచ్చారని చెప్పాడు.

"టెన్త్ రిజల్ట్సు వచ్చాయికదూ! పిల్లలు పాసై ఉంటారు. వాళ్ళ పేర్లు చెప్పారా? " ఆత్రంగా అడిగింది.




అశోక్ ఫిర్యాదుగా అన్నాడు, "పేర్లు చెప్పడమా? వాళ్ళు తెచ్చిన స్వీట్లు అయినా ఇవ్వలేదు. పైగా మేడమ్‌గారు వచ్చాక వస్తాం అన్నారు" వాళ్ళననుకరిస్తూ అన్నాడు.

స్నానం చేస్తోందన్న మాటేకానీ శిరీష మనసు మనసులో లేదు. ఎందరు పాస య్యారో? స్కూలుకి ఏంతశాతం రిజల్టు వచ్చిందో? ఆలోచనలతోనే స్నానం అయిందనిపించింది.

ఆమె బొట్టు పెట్టుకొంటూండగా స్టూడెంట్సు వచ్చారు. పువ్వులు, పళ్ళు, స్వీట్సు వరుసగా ఆమెకిచ్చి నమస్కారం పెట్టేస్తున్నారు.

"రత్నం! మన స్కూలుకి ఎంత రిజల్టు వచ్చింది? ఎందరికి ఫస్టు క్లాసులు వచ్చాయి? " వరుసగా ఆత్రంగా ప్రశ్నలే గుప్పించింది.

మన స్కూలుకి 70% రిజల్టు వచ్చింది. ఫస్టుక్లాసులు ఇరవై వచ్చాయి. అంటూ వివరాలు చెప్పడం మొదలెట్టింది రత్నం.

భర్త సబ్జక్టులో, తన సబ్జక్టులో అందరూ పాసవడం ఆమెకి ఎంతో ఆనందాన్నిచ్చింది. "స్కూలు ఫస్టు ఎవరికి వచ్చింది? " మళ్ళీ ఆత్రంగా అడిగింది.

వాళ్ళందరి సంతోషం చూస్తుంటే ఆమెకి ఏనుగు ఎక్కినంత ఆనందంగాఉంది. అమ్మాయిలు, అబ్బాయిలు కలిసి ఆమెకి ఒకటే కబుర్లు చెపుతున్నారు.

రత్నం కవ్వింపుగా నవ్వుతూ అంది, "స్కూలు ఫస్టు ఎవరికి వచ్చిందో చెప్పుకోండి మేడమ్"

శిరీష నాగరాజువైపు రత్నంవైపు పరీక్షగా మార్చిమార్చి చూసింది. నాగరాజు నవ్వుతూ చూశాడు. ఇద్దరూ పట్టుబడనట్లు చూస్తున్నారు.

శిరీష నవ్వుతూ "ఊ... నాకే పరీక్షలు పెడుతున్నారా? " అంది. పిల్లలు నవ్వుతూ అవునన్నట్లు తల ఊపారు.

"సర్లెండి. రత్నం స్కూలు ఫస్టు నీకే వచ్చిందికదూ! కంగ్రాచ్యులేషన్స్" అంటూ ఆ పిల్లని దగ్గరికి తీసుకొని అభినందించింది.

రత్నం, నాగరాజు ఆశ్చర్యపోయారు. ఆ పిల్ల అడగనే అడిగేసింది ఎలా కనుక్కొన్నారు మేడమ్ అంటూ. అంతలోనే తెలిసిపోయిందన్నట్లు సార్ చెప్పేశారా? అంటూ తేల్చేసింది.

శిరీష చూపుడువేలు ఆ అమ్మాయివేపు పెట్టి అంది. "నీకళ్ళల్లో ఎంత లేదన్నా విజయం తాలూకు సంతోషం కన్పిస్తోంది. నా కల నిజం చేశావన్నమాట"

రత్నం కళ్ళు చెమ్మగిల్లాయి. వంగి శిరీష కాళ్ళకి నమస్కారం చేస్తూ అంది.

"మేడమ్, మీరు పెట్టిన భిక్ష ఇది. మీరు ఇచ్చిన ప్రోత్సాహమిది. మీరే వెన్ను తట్టి ధైర్యం చెప్పకపోతే ఎలా ఉండేదాన్నో? ఈ నా విజయం మీది. మీరు చెప్పినట్లే పెద్ద చదువులు చదువుతాను" ఆపై ఆ పిల్లకి నోటివెంట మాటలు రాలేదు. శిరీషకీ మాటలు కరువయ్యాయి.

ఏదో చెప్పలేని భావోద్వేగంతో ఆ అమ్మాయిని దగ్గరికి తీసుకొంది.

లావణ్య డ్రింక్ గ్లాసులు పట్టుకొని వచ్చి అందరికీ ఇచ్చింది. ఈలోపు రవీంద్ర వచ్చాడు. అతడు అప్పుడే సైన్సు మాస్టారి ఇంటికెళ్ళి రిజల్ట్సు కనుక్కొని వచ్చాడు.

పిల్లల్ని సంతోషంగా అభినందించాడు. శిరీష తన గదిలోకి వెళ్ళి వెండి సరస్వతీ దేవి విగ్రహం తెచ్చి ఇచ్చింది. డగ్గుత్తికతో రత్నంతో అంది "సరస్వతీ కరుణాకటాక్షం నీకుసదా కలగాలి. ఎన్నో ఇలాంటి విజ







యాలు నువ్వు అలవోకగా పొందాలి"

రత్నం ఏమీ మాట్లాడలేకపోయింది. 'మాటలతో కాదు జవాబు చెప్పవలసింది. మేడమ్‌గారు చెప్పినట్లు అన్నీ సాధించి ఆనాడు రావాలి. భగవాన్! నన్ను దీవించు' అనుకుంది.

పిల్లలు వెళ్ళాక శ్యామల వచ్చింది. ముగ్గురూ కాసేపు స్కూలు విషయాలు మాట్లాడుకున్నారు. విద్యార్థులు ఎక్కువగా పాసవడం, చుట్టుపక్కల స్కూళ్ళకన్నా ఎక్కువ ఉత్తీర్ణతాశాతం సాధించటం వాళ్ళకి చాలా ఆనందాన్ని కలిగించాయి.

సావిత్రమ్మ శ్యామలని కూడా భోజనానికి ఉండమంది. అందరూ సరదాగా నవ్వుకుంటూ, కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు పూర్తిచేశారు.

వాళ్ళిద్దరూ కబుర్లు చెప్పుకుంటారని- రవి వసారాలో పడుకున్నాడు.

శ్యామలా, శిరీషా ఇద్దరూ ఒకరిపక్కన ఒకరు పడుకుని ఎన్నో నెలల తరువాత కలిసినట్లు కరువుతీరా కబుర్లు చెప్పుకున్నారు.

సాయంత్రం బజ్జీలు తిని, టీ తాగి శ్యామల వెళ్ళింది. రవి, శిరీషలు స్కూలు విషయాలు మాట్లాడుకొంటూంటే లావణ్య అక్కడికి వచ్చింది.

"వదినా! ఇందాక అడిగితే రత్నం కథ తర్వాత చెపుతానన్నావు. ఇప్పుడు చెప్పు" అంది.

లావణ్య మనసులో ఏదన్నా సందేహం కలిగిందా మరి వదలదు. శిరీషకి కూడా గతం గుర్తుకు రాసాగింది. రత్నం గురించి చెప్పడం మొదలెట్టింది.

శిరీష ఎనిమిదవ తరగతికి సోషల్ చెప్తుంది. రత్నం ఆ క్లాసులో చాలా అల్లరి చేసేది. స్కూలుకి రెండురోజులు వస్తే రెండురోజులు మానేసేది.

ప్రతి క్లాసులో కొందరు ప్రాబ్లమాటిక్ స్టూడెంట్సుంటారు. అది మామూలే. కానీ ఈ అమ్మాయికి భయంలేదు. భక్తిలేదు. వరుసగా మానేస్తోంటే ఒకసారి దెబ్బలాడింది. కారణాలు చెప్పమని నిలదీసింది.

రత్నంకి ఒళ్లుమండింది. "మా ఇష్టం, సవాలక్ష కారణాలుంటాయి. అన్నీ మీకు చెప్పాలా? " తీక్షణంగా అంటున్న ఆ అమ్మాయిని శిరీష తేరిపార చూసింది.

తెల్లటి శరీరఛాయ, చిన్నవైనా తీక్షణంగా చూసే కళ్లు, తీరైన కనుముక్కుతీరు, పొడగరి. అయితే బట్టలు ధరించడంలో, తల దువ్వుకోవడంలో బయటపడే నిర్లక్ష్యం.

శిరీషకి ఆ అమ్మాయి ఒక పజిల్ అయింది. మాటలో, అలంకరణలో అంతా నిర్లక్ష్యమే. అది నిర్లక్ష్యమా? లేక అహంకారమా? లేక కుటుంబ పరిస్థితుల వలన కలిగిన అనాసక్తతా?

ఇవన్నీ తెలియాలంటే ఆ పిల్ల మనసుకి దగ్గరగా అవ్వాలి. ఆ విషయంలో తనతో సహకరిస్తుందా?

మరునాడు మళ్లీ అడిగింది, "నువ్వు ఇచ్చిన వర్క్ చేయకుండా వస్తే ఎలాగ? ఇది లాస్టు వార్నింగ్. ఇలా అయితే ఊరుకోను"

"వీలయితే చేస్తాను. వీలవనప్పుడు ఎవరు మాత్రం ఏం చేస్తారు? " మహా పెడసరంగా జవాబు చెప్పింది.

"వీలవడం అవకపోవడం ఏమిటి? నాకు ఇంట్లో పనులు లేవా? నేను ఎలా వస్తున్నాను? "

"మేడమ్! మీరు చెప్పిన వర్క్ నేను చేయలేదు. మీ ఇష్టం వచ్చిన శిక్ష వేయవచ్చుకదా!"

ఆ అమ్మాయికి ఎంత తొందరగా సంభాషణ తెంచుదామా అన్నట్లుంది. అలాంటి వాళ్లతో ఎలా ముందుకు వెళ్లగలం?

రత్నం గురించి ప్రత్యేక శ్రద్ధ తీసుకోసాగింది. ఆ పిల్ల ఎవరితోనూ కలవదు. ఎప్పుడూ ఏదో ఆలోచనలో ఉంటుంది.

జానకమ్మ మేడమ్‌గారిని రత్నం గురించి అడిగితే ఆవిడ విస్తుపోయి చూశారు.

"ఆ పిల్లగోల మీకు ఎందుకండీ! మన క్లాసు మనం చెప్పుకొని పోయేదానికి వాళ్ల గోల ఎందుకు? "

ఆవిడ మాటలకి శిరీష ఏం జవాబు చెప్పగలదు? సైకాలజీ ఏమంటోంది? విద్యార్థులు విద్యయందు ఆసక్తి ప్రదర్శించకపోవడానికి అనేక కారణాలుంటాయంటోంది. వాళ్ల గురించి తెలియకపోతే టీచర్ వాళ్లకి ఎలా న్యాయం చేస్తుంది?

ఆ మేడమ్‌గారి ముందు ఇవే ప్రశ్నలుంచితే ఒక వెర్రిదాన్ని చూసినట్లు చూసింది. "ఆ అమ్మాయి నన్ను బాగా ఆకర్షించిందని అడిగాను. ఆ అమ్మాయి వల్లనో, లేక చుట్టుపక్కల వారి వల్లనో వివరాలు సేకరించాలి




కదా!"

"ఓహో! మీరు పెద్ద టీచర్లు కదా! కేసు స్టడీ అన్నమాట"

ఆవిడ వెటకారానికి శిరీషకి ఒళ్లుమండిపోయింది.

'ఏం లోకం? ఒక టీచరు ప్రయత్నాన్ని మరొక టీచరే అర్థం చేసికోదు. సహకరించదు? ఏం సమాజం ఇది? శిరీష చిరాకుగా అనుకొంది.

క్రాఫ్ట్ మాష్టారు అన్నారు, "ఏం ఉందండీ! వాళ్ల నాన్న తాగుబోతు. ఇష్టం అయితే డబ్బు ఇంటికిస్తాడు. లేకపోతే లేదు"

అప్పుడు జానకమ్మ మేడమ్ గొంతు విప్పింది. "వాళ్లనాన్న ప్లాస్టిక్ సామానులు, సిల్వర్ సామాన్లు అలాంటివి బండిమీద పెట్టి అమ్ముకొనే వ్యాపారి. రెండేళ్ల క్రితం సామాన్లు అమ్మడానికి వెళ్లి ఒక రజకులమ్మాయిని తెచ్చాడు. దాన్ని భర్త వదిలేశాడు. అది వాడికంటికి రంభలాగ కన్పించింది. అదీ విషయం"

నా మనసు రత్నం పట్ల జాలితో నిండిపోయింది. దానితో ఉంటే వాళ్ల అమ్మ అతడిని ఇంటికి రావద్దంటుందిట. నన్ను రావద్దనడానికి నువ్వు ఎవరని తంతాడుట.

మర్నాడు డ్రిల్ పిరియడ్లో రత్నం ఒక్కర్తీ వరండా మెట్లమీద కూర్చుని కన్పించింది.

"పిల్లలందరూ డ్రిల్ చేస్తోంటే నువ్వు వెళ్లలేదే? " అనడిగాను.

"మీకు నేనెందుకు సమాధానం చెప్పాలి? "

రత్నంనుండి ప్రశ్న బుల్లెట్‌లాగ తగిలింది. ఔను డ్రిల్లు క్లాసుకి వెళ్లకపోతే డ్రిల్లు మాష్టారుకి చెప్పాలి. నాకెందుకు కారణం చెప్పాలి? నిజమే. కానీ రత్నంకి ఏమైందో అని నాకు ఆత్రుత.

నేను మెట్లు దిగుతూ, "అమ్మో" అని కూలబడిపోయాను. లేవలేని దానిలాగ కాలు పట్టుకొని మూల్గసాగాను.

రత్నం వెంటనే కుంటుకుంటూ నడుచుకొని వచ్చింది. "ఏమైంది మేడమ్" నా కాలువైపు చూస్తూ అడిగింది.

శిరీష మాట్లాడలేనట్లు రెండు నిమిషాలూరుకొంది. రత్నం ఆత్రుత నాపుకోలేక "కాలు చూడనీయండి మేడమ్!" అంటూ ముందుకి వంగింది.

"చూడు! నా కాలుకి ఏమైనా అయితే నీకేం? నా బాధ నాదిగదా!" అంది శిరీష.

రత్నం చివ్వున తలెత్తి చూసింది. తర్వాత శిరీష లేచి నిలబడుతూ అంది, "ఇప్పటికైనా తెలిసిందా. మనిషి సంఘజీవి. బంగారు పళ్లెం అయినా గోడ ఆధారం ఉండాలి. నలుగురితో కలిసి మెలిసి బతకాలి. చీమలు, తేనెటీగలు, పశువులు సైతం సంఘజీవితాన్ని కోరుకొంటున్నాయి. మనిషికి అది అవసరమని నీకు ఎలా చెప్పను? "

రత్నం కళ్లల్లో తిరుగుతున్న నీటిని బలవంతంగా ఆపుకొంది. "ప్రతీవాళ్లకీ బాగా బతకాలనే ఉంటుంది. కానీ ఇది ఉండాలి" అంటూ నుదిటి రాత చూపించి పాదం నొప్పిని సైతం లెక్కచేయకుండా వెళ్లిపోయింది.

ఇది జరిగిన మూడవ నాడు ప్రేయర్ క్లాసు నుండి వస్తోంటే నిజంగానే శిరీష పాదం తొట్రుపడి పడిపోయింది. టీచర్లందరూ మూగారు. కాలు బెణకడంవలన కొద్దిసేపటికి కాని లేవలేకపోయింది.

శిరీషను విశ్రాంతి తీసుకోమని రవీంద్ర ఫస్టు పీరియడ్ ఆమె క్లాసుకి వెళ్లిపోయాడు. వద్దన్నా అతడు వినలేదు. బరువంతా కాలు మీద మోపడం వలన అది మెలి తిరిగి కాలునొప్పి ఎక్కువగానే అన్పించింది.

"చూశారా! మేడమ్! మీరు మొన్న పరిహా

సానికి అంటే ఈ రోజు అది నిజమై కూర్చుంది" ఎప్పుడు ఇంటికి వెళ్లిందో ఎప్పుడు జెండూబామ్ పట్టుకొచ్చిందోగానీ కింద కూర్చుని కాలు చేతిలోనికి తీసికొని రాయసాగింది రత్నం.

ఎదురు చూడని సన్నిహితత్వం, సున్నిత మైన ప్రవర్తన రత్నాన్ని శిరీషకి మరింత దగ్గర చేశాయి. ఎలాగైనా ఆ పిల్లను మామూలు స్టూడెంటు స్థితికి తేవాలని శిరీష నిర్ణయించుకొంది.

డ్రాయింగ్ మాష్టారు ఏదో ఆ పిల్ల ఇంటి విషయాలు ఎత్తి హేళన చేయబోయాడుట. వెంటనే ఆయన ఇంటి విషయం ఎత్తి నోరు మూయించిందిట.

డ్రాయింగ్ మాష్టారు వరండా చివర నిల బడి తన ఇంట్లో జరిగే విషయాలు, చివరికి భార్యతోపడే గొడవల దగ్గరనుండీ అన్నీ క్లర్కుతోను, క్రాఫ్ట్ టీచరుతోను చెపుతాడు. చురుకైన రత్నం గ్రహించకుండా ఉంటుందా?

ప్రతీ రోజూ మూడు ప్రశ్నలిచ్చి సమాధా నాలు రాసి పట్టుకొని రమ్మంటుంది శిరీష. వర్క్‌బుక్ ఏ విద్యార్థులు రాయకపోయినా ఊరుకోదు.

పిల్లలచేత ఇలాగ వర్క్‌బుక్‌లో రాయిం చడం వలన వాళ్లకి సబ్జక్టు వస్తుంది. ఇంటి దగ్గర చదవడం రాయడం అలవాటవు తుంది. ఆ ప్రశ్నలు తిరిగి అప్పజెప్పించు కొంటుంది. ఒకసారి రాయడంవలన పది సార్లు చదివినట్లవుతుందికదా!

తనే క్లాసులోని అందరి పుస్తకాలూ చూడటం అవదు కనుక లీడర్లని తెలివైన వాళ్లని పెట్టింది. ఆ లీడర్ల తాలూకు పుస్త కాలు తను, గ్రూప్‌లోని పుస్తకాలు లీడర్లు చూస్తారు. వారానికి రెండు గ్రూపులచొ ప్పున అందరివీ చెక్‌చేస్తుంది.

రత్నం ఎప్పుడూ వర్క్‌బుక్ రాయదని లీడర్ ఫిర్యాదు. శిరీషకి చిరాకువేసింది. ఎంతకని ఓర్పు వహిస్తుంది.

చిరాకుగా ఆ పిల్లని చూస్తూ "ఎద్దులాగు న్నావు. హోమ్‌వర్క్ ఎందుకు చేయవు? స్కూలైనా మానవు. సరిగ్గా చదవవు. ఇలాంటి మొద్దులని తల్లిదండ్రులు స్కూలుకి పంపి మా ప్రాణం తీస్తున్నారు" అంది.

శిరీషకి తెలుసు తను ఆ పిల్ల మనసు గాయపరుస్తున్నానని. కాని ఇనుము వంగా లంటే సమ్మెట దెబ్బలు తప్పదు.

"మీ అమ్మగారిని నేను రమ్మన్నానని చెప్పు. నీలాంటి పిల్లని ఎందుకు స్కూలుకి పంపిస్తోందో నాలుగు దులుపుతాను"

శిరీష మాటలు రత్నాన్ని చాలా బాధ పెట్టాయని తెలుస్తూనే ఉంది.

"నేను హోమ్‌వర్క్ చేయకపోతే నన్న నండి. మా అమ్మ ఎందుకు? మా నాన్న హింసించగా మిగిలిన ప్రాణం మీరు తీస్తారా? చదవాలనీ, అందరిమెప్పూ పొందాలనీ అందరికీ ఉంటుంది. కడుపుకి పట్టెడు అన్నం అయినా లేనప్పుడు చదువు ఎలా అవుతుంది? ఎదుటి మనిషి చిత్ర హింస పడుతోంటే దేనిమీదికి దృష్టిమళ్లు తుంది? " రత్నం ఏడుస్తూ కూలబడిపో యింది. అగ్ని పర్వతం పగిలింది. శిరీష అచేతనురాలైంది. వెర్రిదానిలాగ క్లాసు బయ టికి వచ్చేసింది.

ఇంటికి వచ్చినా శిరీషకి మనసు మన సులో లేదు. రత్నం మాటలే మాటిమాటికీ గుర్తువస్తున్నాయి. 'పట్టెడన్నం అయినా తినకపోతే చదువుపై దృష్టి వెళుతుందా? మీ వర్క్ చేయనందుకు నన్ను తిట్టండి కొట్టండి. మా అమ్మ స్కూలుకి ఎందుకు? '

ఆ మాటలే శిరీషని తరుముతున్నాయి. 'మా నాన్న హింసించగా మిగిలిన ప్రాణం మీరు తీస్తారా? '





ఇంకా ఎదురుగా నిలబడి ఎరుపెక్కిన కళ్లతో రత్నం నిలదీస్తున్నట్లే అన్పిస్తోంది. చాలా సేపు ఆలోచించాక శిరీషకి ఒక మార్గం తోచింది.

మర్నాడు మధ్యాహ్నం ఫస్టు పీరియడ్ పర్మిషన్ పెట్టింది. తనకి పనుందని భర్తతో ముందే చెప్పింది. రత్నం స్కూలుకి బయలుదేరి వస్తుండటం చూశాక ఆరవ తరగతి విద్యార్థిని ఒకర్ని పిలిచి రత్నం ఇంటికి తీసికెళ్లమంది.

అది పెద్ద ఊరవడంవలన మగవాళ్లు రావిచెట్టుకింద, టీకొట్టులోను కూర్చుని ఆ వేళప్పుడు కబుర్లాడుకొంటారు. వారి కబుర్లలో చోటుచేసుకోని విషయాలుండవు. ఊళ్లోని చిన్న విషయాల దగ్గరనుండి దేశ రాజకీయాల వరకూ అక్కడే వేడివేడిగా చర్చింపబడతాయని తోటి టీచర్లు అనుకొంటూంటే శిరీష చాలాసార్లు విన్నది.

అందుకే తల వంచుకొని గబగబా ఆ అబ్బాయి వెంట బయలుదేరింది. ఇల్లు చూపించాక వాడిని స్కూలుకి పొమ్మంది.

ఆ ఇల్లు ఎంతో అందంగా ఉంది.

పూరిల్లే అయినా చుట్టూ అలికి, ముగ్గులు పెట్టి ఉంది. ఇంటి ముందు పూలమొక్కలు పువ్వులతో నిండుగా ఉన్నాయి. అయినా రత్నం ఏనాడూ పూలు పెట్టుకొని రావడం శిరీష చూడలేదు.

దగ్గరగా కొన్ని కూరగాయల మొక్కలు, కొన్ని పాదులు ఇల్లుపైకి ఎక్కించి ఉన్నాయి. శిరీష నిశితంగా అన్నీ గమనిస్తూ నెమ్మదిగా తలుపు తోసి లోపలి గుమ్మంలోకి నడిచింది.

తెల్లగా పొడవుగా ఉన్న ఒక స్త్రీ గబుక్కున లేచి నిలబడింది. కుట్టుకుంటున్న చీరతో సహా అలాగే నిలబడింది. శిరీష నవ్వుతూ "లోపలికి రావచ్చునా? " అని అడిగింది.

ఆవిడ అప్పటికి తెప్పరిల్లి "అయ్యో! అదేం ప్రశ్న? లోపలికిరండి" అంటూ కుర్చీ తెచ్చి వేయబోయింది. వద్దంటూ, చనువుగా ఆమెకి దగ్గరలో కూర్చునే సమయంలోపే చాప తెచ్చివేసింది.

ఆవిడని చూస్తుంటే రత్నంని దగ్గరగా చూస్తున్నట్లుంది. శిరీష తననితాను పరిచయం చేసుకొంది. ఆవిడ శిరీషని అపనమ్మకంగా చూసింది. ఒక టీచర్ తన స్టూడెంటుకోసం ఇల్లు వెతుక్కొంటూ రావడం? తన నుండి ఏం కోరుతోంది?

శిరీష ఆవిడకి రత్నం విషయం చెప్పింది. "పిల్ల చాలా చురుకైంది. తెలివైనది. అయినా చదువు నిర్లక్ష్యం చేసుకొంటోంది. బతకాలనే ఆసక్తిని ప్రదర్శించడంలేదు. ఇలాగే ఉంటే రత్నం జీవితం ఏమవుతుంది? "

తన మనసులోని విషయాలన్నీ శిరీష బయటపెట్టింది. "నేను మీకు ఆత్మీయురాల్ని. మీ సమస్య ఏమిటో చెప్పండి. మీరు రత్నాన్ని ఎందుకు పట్టించుకోవడంలేదు? ఒక స్టూడెంట్ బాధ పడుతోందంటే, చదువుకి దూరం అవుతోంటే క్లాసు టీచరుగా నాకు తెలిసుకొనే బాధ్యత ఉందనుకొంటున్నాను"

శిరీష గంభీరంగా అన్న మాటలు ఆవిడ సున్నిత హృదయాన్ని తాకాయి. ఆవిడ దోసిట్లో మొహం దాచుకొని ఏడుస్తూ అంది, "రత్నం తల్లినైన నాకే జీవితాశ నశించింది. ఇంక నా బిడ్డకి ఎందుకుంటుంది? "

శిరీష కొద్దిసేపు మౌనం వహించింది. తను తొందరపడటం మంచిదికాదని ఆమెకి తెలుసు.

"నా విద్యార్థిని సమస్య మీతో ముడిపడి ఉంది. ప్రతీ సమస్యకి ఒక పరిష్కారం ఉంటుంది. మీకు అభ్యంతరం లేకపోతే మీ

సమస్య చెప్పండి"

శిరీష ఎన్నో విధాలుగా నచ్చ చెప్పాక అప్పుడు రత్నం తల్లి నోరువిప్పింది. చిన్నప్పుడే తల్లిపోవడం, సవతితల్లి పోరుతో తండ్రి ఏడవ తరగతి చదువుతున్న పిల్ల చదువు ఆపేయటం,చురుకుగా చదువుతున్న తనని చదువు మానిపించడంతో ఆ పిల్ల హతాశురాలైంది.

సవతి తల్లి బిడ్డలను సాకడం, ఇంటిపని చూడటంతోనే కాలం గడిచిపోయింది. పదహారేళ్లు నిండకుండానే పెద్ద పిల్ల బరువు దింపుకోవాలనుకొని సిల్వర్ సామాన్లు అమ్ముకొనే వాడికిచ్చి పెళ్లిచేసి చేతులు దులుపుకొన్నారు.

ఒక పూరి గుడిసె, సైకిలు, కొద్దిసామాన్లు, ముసలి తల్లి ఇవీ అతడి ఆస్తి. సైకిలుపై పెద్ద బుట్ట వెనక్కి తాళ్లతోకట్టి ఊరూరు తిరుగుతాడు. ప్లాస్టిక్ సామాన్లు, సిల్వర్ సామాన్లు, చిన్నచిన్న స్టీలువీ అన్నీ అందులో ఉంటాయి. ఉదయం చద్దన్నం తిని వెళితే సాయంత్రానికి ఇల్లు చేరేవాడు.

పదో, ఇరవయ్యో ఎంత సంపాదించితే అంత తెచ్చి తల్లి చేతిలో పోసేవాడు. ఆ ముసలిదాని పెత్తనంతో ఇల్లు నడిచేది.

ఇంటెడు చాకిరీ చేసినా ముసలిదానికి తృప్తిలేదు. రత్నం తండ్రికి మాత్రం భార్య అందమైందని ప్రేమ. భార్య మోజులో కొడుకు పెత్తనం ఎక్కడ ఆమెకే అప్పచెప్తాడో అని ముసలిదాని భయం. కోడలి మోచేతి నీళ్లు తాగడం ఇష్టంలేదు.

కొడుకు ఇల్లు చేరేటప్పటికి ఏదో ఒక నేరం చెప్పేది. ఒక్కొక్కసారి మౌనం వహించేవాడు. ఒక్కొక్కసారి దెబ్బలాడేవాడు. అయితే తిండికి, బట్టకి లోటు రాకుండా చూసేవాడు.

రత్నం పుట్టాక కూతురిని ఎంతో అపురూపంగా చూసేవాడు. ఇంకా ఎలాగైనా సంపాదించాలని తపన పట్టుకొంది. ఆ సమయంలోనే పేకాటకి అలవాటుపడ్డాడు.

మొదటిసారి గెలవడంతో డబ్బు మీద ఆశ, ఆట మీద ఆసక్తి ఏర్పడ్డాయి. ఒకరోజు పనికి వెళితే ఇంట్లో సగం ఇచ్చి సగం ఆటకి పెట్టేవాడు. అప్పట్లో ఎక్కువసార్లు గెలుస్తూనే ఉండేవాడు.

ముసలిది కూతురిని, భార్యను బాగా చూడటం సహించలేక ఏవేవో నూరిపోసేది. ఆవిడ పోయినా ఆమె చెప్పిన మాటలు మరిచిపోలేదు.

ఏదన్నా బుద్ధి చెప్పబోతే అందగత్తెనని నీకు గర్వం, నాకు చెప్పేదానివా అని దెబ్బలాడేవాడు. గొడవ పడటం ఏనాడూ అలవాటులేని ఆమె భర్త ఏంచేసినా ఊరుకొనేది.

రత్నం అయిదో తరగతి చదువుతుండగా ఆ సంఘటన జరిగింది. రత్నం వెనక ఇద్దరు మగ బిడ్డలు పుట్టినా బతకలేదు. పసికందులుగానే చనిపోయారు. అదొక అసంతృప్తి. దానికి ఆమె మాత్రం ఏం చేయగలదు?

ఒకసారి సామాన్లు అమ్మడానికి వెళ్లి రెండు రోజులు రాలేదు. మూడవనాడు భర్త వదిలేసిన ఒకామెని తీసుకొనివచ్చాడు.

ఆమెను ఏం చూసి లేవదీసుకొచ్చాడో తెలియదు. మొరటు మనిషి. రూపం చూస్తే నల్లటి నలుపు. అయితే షోకు మాత్రం ఎక్కువే. మగవాళ్లకి రెచ్చగొట్టే అలంకారంలో స్పెషలిస్టు.

ఎంతో నెమ్మదిగా ఉండే రత్నం తల్లి ఈ పనిని మాత్రం సహించలేకపోయింది ఆమెని ఇంట్లోకి రానీయలేదు. కొట్టాడు. తిట్టాడు. ఏంచేసినా ఆమె పట్టువదలలేదు. ఇరుగూ పొరుగూ ఘూగారు.

కొందరు 'ఇద్దరినీ పోషించేవాడు వాడేకదే!




దాన్ని తీసికొచ్చాక అదెక్కడికి పోతుంది. ఏదో సర్దుకోండి' అని అన్నారు. ఎక్కువ మంది మాత్రం 'ఏనాడూ ఎదిరించని, గట్టిగా మాట్లాడని నీ భార్య ఇలా అంటోం దంటే దాని మనసెంత కష్టపెట్టావో. వెళ్లి వేరే ఏదో దారి చూడు' అని చెప్పారు.

వచ్చిన దానికి నామీద, నా బిడ్డమీద కోపం. మేం ఎలాగో ఉంటే దానికి బావుం డేది. మేం అందంగా, శుభ్రంగా ఉండటం నచ్చలేదు. పైగా ఊళ్లోవాళ్లు ఏం చూసి దాన్ని తెచ్చాడురా. వట్టి మగరాయుడిలాగ ఉంది అనేవాళ్లు. ముసలివాళ్లు కొందరు 'ఆ... అందుకే అన్నారు తాను మునిగింది గంగ, తాను వలచింది రంభ అని' పెదవి విరిచారు.

"ఆయన ఆవిడని ఇక్కడే అదే ఈ ఊళ్లోనే..." శిరీష తన మాటలు పూర్తి చేయలేకపోయింది.

ఆవిడ పేలవంగా నవ్వింది. "ఆ... ఈ ఊళ్లోనే ఒక పెంకుటింట్లో ఉంచాడు. ఇదిగో ఈ రాజభవనం నాకు తలదాచుకో డానికైనా మిగిల్చాడు. ఈ ఇల్లు, ఆ బిడ్డ నా బతుక్కితోడు"

శిరీష అడగలేక అడగలేక అడిగింది. "మరి ఎలాగో ఆయన మాట చెల్లించుకు న్నారుకదా! ఇంకా ఎందుకు దెబ్బలాటలు? "

ఆవిడ రెండు నిముషాలు శూన్యంలోకి చూస్తూ కూర్చుంది. తర్వాత నిర్లిప్తంగా అంది, "మగవాడుకదా! తన మాట చెల్లలే దని కోపం. నా అందంమీద అనుమానం. తనుచేసిన తప్పు పెడుతున్న చిరాకు. అన్నీ కలిసి నాపై తీర్చుకొంటాడు.

"నాకు బాధలు అనుభవించడం అల వాటు అయిపోయింది. బిడ్డ గురించే ఆలో చిస్తున్నాను. మా మధ్య అది నలిగిపో తోంది"

నిజమే. ఆవిడ అన్నట్లు దాన్ని రానిస్తే రత్నం, వాళ్ల అమ్మ ఆవిడకి దాస్యం చేయవ లసి వచ్చేది.

"ఆయన ఇక్కడికి వస్తారా? "

"ఎందుకు రారు? నన్ను కొట్టడానికైనా వస్తారు. నేను ఆయనని చేరదీయలేదని కోపం. నాకు అసహ్యం వేసింది. ఒక మగ వాడికి ఒక ఆడది. ఇది నాకు తెలిసిన ధర్మం. ఆయనని నేను దగ్గరకి రానీయడం లేదని కోపం. అందుకే కొడతారు"

"మరి మీ జీవనం? " శిరీష గొంతు నీర సంగా ధ్వనించింది.

"ఆయనకిష్టమైతే, గుర్తువస్తే ఏ నాలుగు రోజులకో వచ్చి తోచిన డబ్బు పడేసి, నాలు గుతన్ని వెళ్లిపోతారు"

శిరీషకి ఆ రాత్రి నిద్రపట్టలేదు. ఎంత హృదయవిదారక గాధ? ఎవరు ఆ బాధని చల్లార్చగలరు? ఆ పిల్ల లేత జీవితాన్ని ఎవరు నిలబెట్టగలరు?

ఏడుస్తున్న భార్యని రవి ఓదార్చాడు. భార్య సుకుమారమైన మనసు తెలుసు. ఈ లోకంలో ఇలాంటి కన్నీళ్ల గాథలు ఎన్నో? ఎన్ని బాధా పరితప్త హృదయాలు దారిలేక ఈ లోకంలో పరితపిస్తున్నాయో?

రవి బరువుగా నిట్టూర్చాడు. భార్యకి విద్యార్థులంటే ఎంత ప్రేమో అతడికి తెలుసు. విద్యార్థులకి సన్నిహితంగా వెళ్లక పోతే టీచర్ వృత్తికి న్యాయం చేయలేడు. పిల్లల్ని అంత అభిమానించే వాళ్లే ఈ పవి త్రవృత్తిలో రాణిస్తారు.

"మనం రత్నంకి సహాయం చేయ లేమా? " భార్య ప్రశ్నకి అతడు వెంటనే జవాబు ఇచ్చాడు "ఎందుకు చేయలేం? ముందు ఈ ఏడుపు మాని, ఆ విషయం ఆలోచించు"

శిరీష వెంటనే చిన్నపిల్లలా "మీరే

చెప్పండి ఏం చేస్తే బావుంటుందో? "అంది.

అతడు కొద్దిసేపు మౌనం వహించాడు. రత్నంకన్నా ముందు ఆ పిల్ల తల్లి ఆ అయోమయ స్థితినుండి బయటపడాలి. తన కాళ్లమీద తాను నిలబడే ధైర్యం తాము ఇవ్వాలి. అదే అతడికి తోచింది. అదే చెప్పాడు.

శిరీష భర్తను ఆర్తిగా అల్లుకొనిపోయింది.

నెమ్మదిగానైనా స్పష్టంగా అంది, "తమ బిడ్డలకోసమైనా తల్లిదండ్రులు సక్రమంగా ఎందుకు బతకరు? పక్షులు, పశువులు తమ బిడ్డలను ఎంత ప్రేమగా సాకుతున్నాయి? "

రవి ఏం చెపుతాడు. ఆవేశం మనిషిని ఆలోచింపనీయదని చెపుతాడా? ఆలోచన లేని మనిషే తప్పుదారిలో వెళతాడు. తను చేసే పని తాలూకు ప్రభావం కుటుంబం మీద ఎలా ఉంటుందో ముందుగానే ఆలోచించగలిగితే ఇన్ని హృదయ విదారక కథలు మనం వినం. చూడం.

మర్నాడు శిరీష కావాలనే రత్నం ఇంటికి వెళ్లలేదు. తన బిడ్డ బతుకు ఎలా ఉందో రేపు ఎలా మారబోతోందో తను ఆమెకి తెలియజేసిందిగదా!

అటునుండి స్పందన రావాలి. ఆనాడే ఏదన్నా ఆవిడ చేయగలుగుతుంది.

మూడవనాడు రత్నం శిరీష క్లాసునుండి వెళ్లిపోబోతుండగా దగ్గరికి వచ్చి చెప్పింది.

"మేడమ్! మా అమ్మగారు ఒకసారి మిమ్మల్ని తీసికొని రమ్మన్నారు"

శిరీష ఒంటిగంట సమయంలో రత్నంతో కలిసి వాళ్ల ఇంటికి వెళ్లింది.

ఆవిడ మొహం నీరసంగా ఉన్నా తేటగా ఉంది. శిరీషకోసం పకోడీలు చేసి సేమ్యా పాయసం కాచింది. శిరీష మొహమాటపడిపోయింది.

ఆమె నెమ్మదైన స్వరంతో అంది "మొన్న మీరు వచ్చినపుడు కనీస మర్యాద కూడా చేయలేదు. నన్ను క్షమించండి. దయచేసి తీసికొండి. మేష్టారికి మా రత్నం పట్టుకెళుతుంది"

శిరీష ఖచ్చితంగా చెప్పేసింది. "నేను మీనుండి ఆశించేది ఇదికాదు. మీ కాళ్లమీద నిలబడి మీరు బతికి, మీ బిడ్డను బతికించుకోవడం. అది చేసిననాడు నాకు నిజంగా విందుభోజనం మీరు పెట్టినట్లే"

కొంచెంసేపు గడిచాక ఆమె తనకి ఆడవాళ్ల బట్టలు కుట్టడం మాత్రమే వచ్చునని చెప్పింది.

శిరీష తన ఆలోచనని చెప్పింది.

మొదట తన వలన ఆ పనులు అవుతాయః అని రత్నం తల్లి ఆలోచించింది. కూతురు, శిరీష ధైర్యం చెప్పాక అంగీకరించింది.

మొదట శిరీష హామీ ఉండి ఆవిడకి లోను ఇప్పించింది. దానితో కుట్టుమిషన్ కొన్నారు. కొంత డబ్బుపెట్టి చిన్నచిన్న జాడీలు, ప్లాస్టిక్ డబ్బాలు కొన్నారు.

ఒక పక్క బట్టలు ఊళ్లోవాళ్లవి అడిగి కుట్టడం ప్రారంభమైంది. ఆడ కూతురు బతకడానికి తన కాళ్లమీద నిలబడటానికి ప్రయత్నిస్తోందని ఊరివాళ్లు బట్టలివ్వడం మొదలుపెట్టారు.

ఊళ్లో ఉన్న టైలర్లకన్నా ఒక రూపాయి తక్కువ తీసికోమని శిరీష చెప్పింది. ఇది కాక అసలైన వ్యాపారం ఒకటి ప్రారంభించింది. 'రత్నా పచ్చళ్లు' అని బోర్డు రాయించింది. 'ఇచ్చట అన్ని రకముల పచ్చళ్లు అమ్మబడును' గోడమీద పెయింట్‌తో రాయించింది.

గోంగూర, చింతకాయ, కొరివికారం, తీపి, కారం ఆవకాయలు, తొక్కుడు పచ్చడి, మాగాయ మొ॥ అన్నీ చేయించి పెట్టిం




చింది.

ఒకనెల అయ్యేసరికి ఆ ఊరిలోనున్న పని వాళ్ళు మొదలు పెద్దవారు వరకు పచ్చళ్ళు కొనడం మొదలుపెట్టారు.

కూలిపనికి వెళ్ళే ఆడవాళ్ళు మొదట సాయంత్రం వేళలో, ఉదయం చల్లంగులకి పచ్చడి రూపాయిది, రెండు రూపాయిలదీ కొన్నారు. మంచి రుచిగా, చక్కగా పచ్చళ్ళు చేయడంతో త్వరలోనే ఒకరికొకరు ఈ విషయం చెప్పుకున్నారు.

అలాగ వ్యాపారం నిలబడింది. రత్నం తండ్రి వచ్చి వ్యాపారం చేయడానికి వీలు లేదని రంకెలు వేశాడు. భార్యను కొట్టబో యాడు.

రత్నం ఒప్పుకోలేదుట. కిరసనాయిలు డబ్బా తెచ్చి, కిరసనాయిలు మీద పోసుకుని చస్తానని బెదిరించిందిట. "తప్పు చేసింది నువ్వు. అమ్మ ఉండగా నువ్వు ఆ మనిషిని ఎలా తెచ్చావు? పైగా నన్ను అక్కడికి రాలే దని, ఆవిడను వరుసతో పిలవలేదని దెబ్బ లాడావు. ఇది న్యాయమా? అమ్మ నీ విష యంలో చాలా ఓర్పు వహించింది. అమ్మ వంటిమీద దెబ్బ పడినా, మా బతుకు తెరు వుకి అడ్డం వచ్చినా నేను ఇది పోసుకుని అంటించుకొని చస్తాను. నీవే దీనికి కారణం అని పోలీసులకు ఉత్తరం వ్రాసి చస్తా" నందిట.

రత్నం తండ్రికి కూతురంటే ఇష్టమే. కూతురు తను ఇన్ని పనులు చేసినా నోరు మెదపలేదు. ఈసారి తను అన్నంతపనీ చేస్తుందేమోనన్న భయం పట్టుకొందిట. అతడు గొణుక్కుంటూ వెళ్ళిపోయాడుట.

ఆనాటినుండి రత్నం శిరీషని ఒక దేవ తని చూసినట్లు చూసేది. బాగా చదువుకో వడం మొదలుపెట్టింది. ఆ పిల్లలో చురుకు తనం, ఉత్సాహం వచ్చాయి. రవి రత్నం విషయం ఎప్పుడైనా వాళ్ళమధ్య వస్తే "నీదత్త పుత్రిక" అనేవాడు.

అలాంటి రత్నం మగపిల్లలను అధిగ మించి పబ్లిక్‌లో స్కూలు ఫస్ట్ వచ్చింది.

శిరీషకి ఇలాంటి పిల్లలంటేనే శ్రద్ధ. పిల్లల్ని తనకు అనుకూలంగా మలచుకో వడం కోసం ఎంతో శ్రమ పడుతుంది.

శ్యామల కూడా ఆమె ఓర్పుకి ఆశ్చర్యపో తుంది. ఒకసారి ఒక పదవ తరగతి అబ్బాయి ఆ క్లాసు అమ్మాయికి ప్రేమలేఖ వ్రాశాడు. హెడ్ మాష్టారు శిరీషని పిలిచి విషయం చెప్పారు.

ఆ అబ్బాయిని తోటవైపు తీసుకెళ్ళి బుజ్జ గించి, అతడు చేసిన పని ఎటువంటిదో తెలియచెప్పింది. అదే మరొక టీచరైతే ఆ అబ్బాయిని చావగొట్టి వదిలేవారు.

ప్రతీరోజూ అతడు చేస్తున్న ప్రతిజ్ఞను గుర్తు చేసింది. భారతీయులందరూ నా సహోదరులంటే అర్థం ఏమిటి? మా మీద నమ్మకంతో మీరంతా చదువుకొందుకు వస్తు న్నారు. ఇలాంటివి చూస్తే మీ తల్లిదండ్రు లూరుకుంటారా? మీ చదువులు మధ్యలో ఆపరా? అది మీకు మంచిదా? అని ప్రశ్నించింది.

వాళ్లముందు ఎంతో జీవితం ఉందనీ, వాళ్ళు తప్పుదారిన వెళితే వాళ్ళకే కాక వాళ్ళ తల్లిదండ్రులకీ నష్టమేనంది. అతడి ముందున్న బంగారు భవిష్యత్తుని తెలియచె ప్పింది.

శిరీష అలా అతడిని, అతడి మనసుని కుదిపి వదిలేసింది. కాసేపయ్యేటప్పటికి తాను తప్పు చేశానని ఆ అబ్బాయి ఒప్పుకు న్నాడు.

అప్పటినుంచి అతడు మారిపోయాడు. స్కూలుకి సంబంధించిన కార్యక్రమాల్లో ఎంతో ఓర్పుగా పనిచేసేవాడు. రవి మారిన శిష్యుడిని మనసారా అభినందించాడు.



చుట్టుపక్కల స్కూళ్ళలో అతి పెద్ద స్కూలవడం వలన పిల్లలు ఎక్కువ. వాళ్ళ వలన వచ్చే సమస్యలు కూడా ఎక్కువే.

పల్లెటూర్లవడం వలన తల్లిదండ్రులు వ్యవసాయ పనులమీదే ఆధారపడతారు. సాయంత్రం కష్టపడి వచ్చేవాళ్ళు పిల్లల చదువు సంధ్యలు ఏం చూడగలరు? తాము చదువుకోలేదనే ఆత్మన్యూనతా భావం కొందరికి. పిల్లలని చదవమని దండించలేరు.

తెలిసీ తెలియని ఆ వయసులో విద్య ఎంత అవసరమో వాళ్ళకి తెలియదు. కష్ట పడటానికి వాళ్ళు ఇష్టపడరు. ఇలాంటి పిల్ల లున్న తల్లిదండ్రులకి టీచర్లే ఆధారం.

పల్లెటూర్లలో బాగా చదువు చెప్పే టీచ ర్లకి బ్రహ్మరథం పడతారు. వాళ్ళకి కూరలు, పళ్ళు ఇవ్వాలని తహతహ లాడతారు. ఇలాంటివి తీసుకోవడానికి ఇష్టపడని టీచర్స్ ఉంటారు. రవి, శిరీష వంటి వారికి వచ్చే జీతమే ఎంతో ఎక్కువగా అన్పిస్తుంది.

సింహాచలం అని ఒకబ్బాయి దూరంలో నున్న గ్రామంనుండి ఈ హైస్కూలుకి వచ్చే వాడు. వాడు ఇర్రెగ్యులర్ స్టూడెంటు. ఒక్కొక్కసారి వారంరోజులు స్కూలు మొహమే చూసేవాడు కాదు.

శిరీష క్లాసు టీచరవడం వలన వాడిని ఎన్నిసార్లో హెచ్చరించింది. దొరబాబులాగా పిల్లాడు మాత్రం మంచి బట్టలు, చెప్పులు వేసుకొని, బ్రహ్మాండంగా ముస్తాబయ్యే వాడు.

పోను పోను వాడు బడి ఎగ్గొట్టే రోజులే ఎక్కువ అవసాగాయి. తన్నినా, తిట్టినా ప్రయోజనం లేదు. చివరికి శిరీష ప్రాణం విసిగి తండ్రిని రమ్మని కబురు పెట్టింది.

వాడినే తండ్రిని తీసుకొని రమ్మంటే తీసు కొని రాడని ఆ ఊరికి దగ్గరలో ఉన్న మరొక ఊరి పిల్లాడికి పురమాయించింది.

టీచర్ రమ్మన్నారంటే తండ్రి అగ్గగ్గ లాడుతూ వచ్చాడు. శిరీష ఆయన కొడుకు నిర్వాకం చెప్పింది. పిల్లలు స్కూలుకి వస్తే విన్న నాలుగు ముక్కల్లో రెండయినా వస్తాయి. స్కూలుకే రానివాళ్ళని ఏం చేయ గలరు?

తన కొడుకు స్కూలుకి రావడంలేదంటే ఆయన తెల్లబోయాడు. ఆయనికి ఇద్దరు కొడుకులుట. పెద్దవాడు చదువు మానేసి వ్యవసాయం చేస్తున్నాడుట. "వాడికి ఎంత సెప్పినా ఇనలేదమ్మా! ఈడయినా సదువు తాడని, పెద్దగా బతుకుతాడని ఆశ పడు తున్నాం" అని చెప్పుకొచ్చాడు.

ప్రతీరోజూ కొడుకు స్కూలుకి వస్తున్నా డని ఆయన, అసలు రావడమే లేదని శిరీష, అటెండన్స్ రిజిష్టర్ చూపించింది. క్లాసు లోని పిల్లలుకూడా రావడం లేదని చెప్పారు.

దాంతో ఆయనికి కళ్ళనీళ్ల పర్యంత మైంది. "ఈడు సదువుకొంటున్నాడని ఆళ్ళ మ్మకి, నాకు ఎంతో సంబరమమ్మా! బట్ట లని, పుస్తకాలని ఏదడిగితే అది కొంటన్నాం. ఏం కొనమన్నా ఏదో బాదపడి కొని ఇత్తన్నాం" అని ఆయన చెప్పసాగాడు.

టీచర్లందరికీ విషయం తెలిసిపోయింది. ఇంతకీవాడు ఆరోజుకూడా స్కూలుకి రాలేదు. మిగిలిన పిల్లలు ఆసక్తిగా గమని స్తున్నారు. శిరీష మర్నాడు కొడుకుని తీసు కొని ఆయనని రమ్మంది. ఆ ఊరి కాలువ దగ్గరకానీ, తోటల దగ్గరకానీ వాడు లేడని పిల్లలు వెళ్లి వెతికి వచ్చి చెప్పారు.

ఆయన సాయంత్రం ఆరుగంటలకి ఇంటికి వచ్చిన కొడుకుని గమనించసా గాడు. తల్లి ఏంరా! ఇంత లేటయిందేం అని అడిగితే బళ్ళో లెక్కల మాష్టారు లెక్కలు చెప్పారు. అందుకే ఉండవలసివచ్చింద





న్నాడు.

ఆకలి వేస్తోందని, తల్లిని అన్నం పెట్ట మని గొడవ. ఆవిడ వాడికి వేడినీళ్ళు తొలిపి ఇచ్చింది. వేడివేడిగా అన్నం, కూర వేసి పెట్టింది. కోడికూర, గారెలు చేస్తానని ఎందుకు చెయ్యలేదని వాడు పేచీ. ఎలాగో కొడుకుని బతిమాలి, మర్నాడు చేస్తానని మాట ఇచ్చి, ఆ రోజుకి కొసరి కొసరి తినిపిం చింది తల్లి.

ఇదంతా చూస్తుంటే వాడి తండ్రికి ఒళ్ళు మండిపోసాగింది. కానీ శిరీష తొందరపడ వద్దంది కదా!

మర్నాడు కొడుకు వెనకనే అతడూ బయ ల్దేరాడు. నువ్వెక్కడికి నాన్నా? అంటే ఆ ఊరిలోని కేశవులు తమకి డబ్బు ఇవ్వాలని, అది తీసుకొని పట్నం వెళ్ళి ఎరువులు తేవా లని చెప్పాడు.

సింహాచలం తప్పనిసరిగా స్కూలుకి బయలుదేరాడు. అయినా మధ్య మధ్యలో తోటి పిల్లలని చూడాలని, తాను కొత్తగా కొనుక్కున్న బట్టలు, పెన్ను చూపించాలని వాడి సరదా! ఏదో ఒక పేచీ ఇంట్లో పెట్టి ఎప్పటికప్పుడు ఏవో ఒకటి కొనిపిస్తూనే ఉంటాడు.

తాను నాలుగు రోజులక్రితం కొనుక్కున్న బ్యాగ్ పిల్లలికి చూపించడం అవలేదు. అదీ గాక తండ్రి ఈ ఊరికే బయలుదేరాడు. చేసేది లేక బడికి బయలుదేరాడు.

ఇన్ని రోజులు మానేసినందుకు శిరీష వాడిని క్లాసుబయట నిలబెట్టింది. అరగంట గడిచాక వాడి తండ్రి వచ్చాడు.

సింహాచలం స్కూలుకి ఎందుకు సరిగ్గా రావడంలేదని టీచర్, రోజూ వాడిని పంపి స్తున్నానని, కేరేజీ తీసుకునే వస్తున్నాడని, సాయంత్రమే వాడు ఇంటికి వస్తున్నాడని తండ్రి ఇద్దరి మధ్యా వాదోపవాదాల య్యాయి.

తండ్రి సింహాచలాన్ని స్కూలుకి రాకుండా ఏం చేస్తున్నావని నిలదీశాడు. వాడు మౌనవ్రతం పట్టినవాడిలాగా కూర్చు న్నాడు. అడిగి అడిగి తండ్రికి ప్రాణం విసి గింది.

స్కూలుకి బయల్దేరుతున్నాడు. కానీ రావ డంలేదు.

ఎక్కడ ఉంటున్నాడో, మిగిలిన టైములో ఏం చేస్తున్నాడో అతడికి చచ్చినా చెప్పలేదు. నోరు విప్పితే ఏ విషయం అయినా తెలు స్తుంది. వాడు విప్పడం లేదు.

చివరికి ఆయనకి విసుగు, విరక్తి వచ్చే సింది. "టీచరమ్మగారూ! ఈడిని మీ చేతుల్లో పెడుతున్నా! ఏం చేసినా ఎందుకు సేసారని అడగను. ఎంత తన్నినా పరవా లేదు. కాస్తపాణం ఉంచండి. అదీ వాడి కోసమా? కాదు. ఈడి తల్లి కోసం. బిడ్డ ఏదో సదివేత్తున్నాడని గారాబం చేసి, నన్ను కూడా కాదని ఆడికి ముద్దు జరుపుతుందే దానికోసం" అంత పెద్దవాడు అలాగ కళ్ళ నీళ్ళు పెట్టుకుంటూంటే శిరీషకి ఒళ్ళు తెలి యని కోపం వచ్చింది.

వాడిని చితక్కొట్టి వదిలేసింది. చివరికి ఏడుస్తూ అన్ని విషయాలూ చెప్పాడు. వాడు చేసే నిర్వాకం బడి ఎగ్గొట్టి రోజూ పట్నం పోవడం. పట్నానికి ముందున్న ఊరి తోటదగ్గర కేరేజీ విప్పుకొని అన్నం తింటాడుట. అక్కడ గేదెలు కాచుకునే కుర్రాళ్ళతో కలిసి గోళీలాట, పేకాట ఆడ తాడు.

ఇష్టం లేనప్పుడు వెళ్ళి సినిమాలు చూస్తాడు. ఉదయం ఆట చూసి వచ్చి, అన్నంతిని అక్కడ రోడ్డుపక్క పాడుపడిన ఇంటి అరుగుమీద పడుకొంటాడు. ఇదే వాడి భాగోతం. సాయంత్రం అయ్యేటప్ప టికి స్కూలునుండి వచ్చిన వాడిలాగ ఇల్లు చేరతాడు.

చెడు సావాసాలు, చెడుబుద్ధులు కొదుకుని ఎలా లొంగదీసుకొంటున్నాయో ప్రత్యక్షంగా విన్న తండ్రి నోటమాట రాక నిలబడిపోయాడు.

శిరీష వాడిని మరో నాలుగు తన్నింది. తల్లిదండ్రులని, టీచర్లని మోసం చేసి వాడు బావుకొనేదేమిటి? అక్కడికి వచ్చిన హెడ్ మాష్టారు టి.సి. ఇస్తాను, వాడిని పొమ్మన్నారు. అది సరైన పద్ధతా? అందుకే రవీంద్ర, సైన్సు టీచర్ ఆయనని ఊరుకోమని సైగ చేశారు.

వాడిని బయటికి పొమ్మని శిరీష నెట్టేసింది. వాడివలన మిగిలిన స్టూడెంట్స్ పాడవుతారంది.

ఆమె కొట్టిన దెబ్బలకి భయపడిపోయాడు వాడు.

ఎప్పుడూ అటువంటి పనులు చేయనని, స్కూలుకి తిన్నగా వస్తానని ఏడవడం మొదలుపెట్టాడు. తండ్రి నిక్కచ్చిగా చెప్పాడు. చదువుకుంటేనే తన ఇంటికి రమ్మన్నాడు. లేదా ఎక్కడికైనా పొమ్మన్నాడు.

చివరికి వాడు మరీ భయపడిపోయి శిరీష కాళ్ళు పట్టుకుని స్కూల్లో ఉండనీయమని ఏడుపు. వాడికి నాలుగు మంచి మాటలు చెప్పి, తండ్రిని వెళ్ళిపొమ్మనమంది.

ఈ ఏడాది వాడు పదవ తరగతికి వస్తాడు. ఈ సంఘటన జరిగి రెండేళ్ళయినా శిరీషకి ఇప్పుడే జరిగినట్లుంటుంది. వాడు చురుకైన వాడే. చదువులో బాగానే ముందుకు వచ్చాడు. పిల్లలు మాత్రం వాడిని "హీరో" అని పిలుస్తారు. క్రాఫ్ట్ మాష్టారు వాడిని కొత్త సినిమాలు వచ్చినప్పుడు "రేపు స్కూలుకి వస్తావురా? " అని వేళాకోళం చేస్తారు.

ఇలాగ ఎన్ని అనుభవాలో? ఇలాగ తన దారికి తెచ్చుకున్న పిల్లలంటే ఆమెకి మరీ ఇష్టం. "శ్రద్ధగా చదివేవాళ్ళకి ఎవరైనా చదువు చెపుతారు. ఇలాంటి అల్లరివాళ్ళని లొంగదీసుకుంటేనే తృప్తి" అంటుంది.

మిగిలిన టీచర్లు కూడా స్కూలంటే శ్రద్ధ చూపటం మొదలుపెట్టారు. సైన్సు మాష్టారు మాత్రం మరీ వీరశైవం. "వాళ్ళు చదువుకోకపోతే మనం చస్తామా? వాళ్ళకి ష్టమైతే చదువుతారు. లేదా పోతారు" అంటూ తేల్చేస్తాడు.

"కొత్తగా ఉద్యోగంలోకి వచ్చారు కదా, కొత్త పిచ్చివాడు పొద్దెరుగడని స్కూలు పట్టుకొని వేలాడతారు. మనవంటి వాళ్ళకవుతుందా" అంటూ ఇతర టీచర్ల దగ్గర అంటాడు.

"మనకంటూ కలపకండి. మీకున్న డబ్బు వ్యాపకాలు మాకు లేవు కదా" అంటాడు డ్రాయింగ్ మాష్టారు.

ఒకటిమాత్రం నిజం. సింహాచలం గొడవ వలన విద్యార్థులకి శిరీష అంటే ఏమిటో తెలిసింది. అంతవరకూ శిరీష అంతగా కొట్టగలదని వాళ్ళు అనుకోలేదు.

ఆమె కళ్ళు ఎర్రచేస్తేనే వాళ్ళకి భయం. ఇంక ఆమెకి ఇంతకోపం తెప్పిస్తే ఏమవుతుందో ఇటు విద్యార్థులకి, అటు టీచర్లకి తెలిసింది.

శ్యామలైతే "అబ్బ! ఆ రోజు మిమ్మల్ని చూస్తే ఆదిశక్తిలాగా అన్పించారు. నాకెంత భయం వేసిందో? " అంది.

క్రాఫ్ట్ మాష్టారు "అంతకోపం తెచ్చుకుంటే ఏ బి.పి.యో వస్తుంది. మీకెందుకంత బాధ" అని దెబ్బలాడాడు. ఆమె ఎవరికీ ఏ జవాబూ చెప్పలేదు.

ఆమె ఆలోచనలు వేరే ఉంటాయి. ఇది తన వృత్తి. పెదవి విప్పి వాటిని ఆమె





ఏనాడూ వాళ్ళకి చెప్పలేదు. ఈ వృత్తివలన తాను గౌరవంగా బతుకుతోంది. తన బిడ్డలు పైకి రావాలంటే ఈ విద్యార్థుల మంచిచెడ్డలు చూడాలి. తీసుకుంటున్న జీతానికి న్యాయం చెయ్యాలి.

శిరీష పిల్లలిద్దరూ ముత్యాలే. వాళ్ళ చదువు విషయం ఎక్కువగా రవే చూస్తాడు. వాళ్ళంటే అందరికీ అపురూపం. లావణ్య దగ్గర కూర్చోపెట్టుకుని హోంవర్క్ చేయిస్తుంది. తెలియని పాఠాలు రవి చెపుతాడు.

మొదట్లో శిరీషకిది వింతగా అన్పించేది. ఒకరి వెనుకగా ఒకరు అన్నాచెల్లెళ్ళు పిల్లలని వదలరు. వాళ్ళను గట్టిగా ఎలా కాదనగలదు?

తన బిడ్డల ముద్దుముచ్చట్లు తాను చూచుకోవాలనుకునేది. లావణ్య దృష్టిలో వదినగారు బయట అలిసిపోయి వస్తుంది. చిన్న పిల్లల చదువుకూడా ఎందుకు అప్పచెప్పాలి అని.

అదీకాక బయట తిరగడం ఆమెకి అలవాటు లేదు. ఇంటిదగ్గర తల్లికి వదినగారితోపాటు సాయం చేయడం, తన చదువు తాను చూసుకోవడం, పిల్లల చదువు చూడటం.

ప్రైవేటు అన్నది లేకుండా పిల్లలు ఇంట్లో చదువుకొనేవారు. పిల్లల పడక లావణ్య గదిలోనే. శిరీష స్కూల్లో ఆ విద్యార్థిని ఎలా కొట్టిందో రవీంద్ర ఇంట్లో వాళ్ళకి చెపుతూంటే శ్వేత వింది.

కళ్ళు భయంతో ఇంతింత చేసుకొని వింటున్న శ్వేతని రవీంద్ర గమనించలేదు. తన ధోరణిలో చెప్పుకుని పోయాడు.

"నాన్నా! ఆ అబ్బాయి అలాగ కొడితే చచ్చిపోలేదా? " శ్వేత ప్రశ్నతో శిరీష కూతురివైపు చూసింది.

పసిదాని కళ్ళల్లో భయం. శిరీషకి బాగానే అర్థమైంది. భర్తమీద ఆ క్షణంలో కోపం కూడా వచ్చింది. పెద్ద గొప్పగా స్కూలు విషయం ఇంటికి తెచ్చి కథలాగా చెపుతున్నాడు.

"ఆ అబ్బాయి సరిగ్గా స్కూలుకి రాకుండా తల్లిదండ్రులను మోసం చేయవచ్చునా? స్కూల్లో టీచర్‌ని మోసం చేయవచ్చా? " శిరీష నెమ్మదిగా అంది.

"ఆ అబ్బాయి ఏడవలేదా? " మళ్ళీ శ్వేత అడిగింది.

లావణ్య ఆ పిల్లని ఒడిలోకి లాక్కుని "అమ్మ ఆ అబ్బాయిని కావాలని కొట్టలేదమ్మా! స్కూలు మానేసి వెధవ పనులు చేశాడని కొట్టింది. మరి మీ అమ్మ ఎప్పుడూ నన్ను, బాబయ్యని ఒక్క దెబ్బకూడా కొట్టలేదు. పైగా మేం బాగా చదువుతున్నామని ఎన్నో వస్తువులు కొనిపెట్టింది" అని చెప్పడంతో అది శాంతించింది. శిరీష లావణ్య వైపు కృతజ్ఞతగా చూసింది. ఆ తర్వాత శ్వేత తమ్ముడిని అభిమానంగా చూస్తూ భుజంమీద చెయ్యివేసి "తమ్ముా! మనం బాగా చదవాలిరా! ఎప్పుడూ అబద్ధం చెప్పి, అల్లరి చేయకూడదు. అమ్మకి కోపం తెప్పించకూడదు. తెలిసిందా? " అంటూ ఆరిందాలాగా అంటూంటే ఇంట్లోవాళ్ళు విస్తుపోయారు.

ఇలాగే మరొక సంఘటన వాళ్ళకి తల్లి అంటే ఏమిటో తెలియచెప్పేది జరిగింది.

పనిమనిషి పనికి వచ్చేటప్పుడు కొడుకుని అప్పుడప్పుడు తీసుకొని వచ్చేది. బాత్ రూంలో సగం రుద్దుకొన్న సబ్బులు మాయమయ్యేవి. చిన్నచిన్న గిన్నెలు, చెంచాలు ఒక్కొక్కటీ కనబడటం మానేశాయి.

ఇంట్లోవాళ్ళకి ఏం అర్థమయ్యేది కాదు. పనిమనిషి మంచిదే. అయినా చూడకుండా ఏమనగలరు? అంటే ఈ రోజుల్లో ఊరు

కుంటారా?

వంటిల్లు తప్ప ఇల్లంతా అది తుడిచేది, కడిగేది. దేవుడిని వంటింట్లో ఒక మూలగా పెట్టడం వలన ఆగదిలోకి సావిత్రమ్మ రాని చ్చేది కాదు.

ఉండుండి రవి జేబులో డబ్బులు మాయ మవడంతో అందరికీ అనుమానం పట్టు కుంది.

నా జేబులో రెండు కనబడలేదు, అయిదు కనబడలేదు అంటూ అతడు ఇంట్లోవాళ్లని అనడం, వాళ్ళు తాము తీయ లేదనడం జరిగేది.

అసలు అడగకుండా ఆ ఇంట్లో ఎవరూ ఏదీ తీయరు. లావణ్య దగ్గరనుండి అన్నగా రినో, వదిననో అడుగుతారు.

పనిమనిషి తన బిడ్డకి నాలుగు ముక్కలు చదువు చెప్పమని శిరీషని బ్రతి మాలేది. దాని దృష్టిలో ఉద్యోగం లేదు కనుక లావణ్య చదువు లెక్కలోకి రాదు. శిరీషే తన బిడ్డకి చదువు చెప్పాలి. శిరీష వాడిని పలకా, పుస్తకం పట్టుకుని రమ్మని చెప్పడం మొదలుపెట్టింది. అవడానికి ఆ వెధవ నాలుగవ తరగతి. అయితే వ్రాయడం రాదు. చదవడం రాదు. అది స్కూలుకి వెళ్ళి పై క్లాసుకి తన కొడుకుని పంపవద్దంటే వాళ్ళు వినరు.

అన్నం పెడుతున్నారు కదా అని వీడు స్కూలు మానడు. గాడిదలా ఉండి చదువు కోకపోతే ఎలాగని పని మనిషి బాధ.

"అమ్మా మీరన్నా సెప్పండి. మేం వద్దంటే పై తరగతిలో ఏల పేరెయ్యాల! మాటిన రేటి? మీరోసారి ఆడికి రండమ్మా! బాబు గారినయినా పంపండమ్మా!" అని అది గోల.

ఈ రోజుల్లో అటెండన్సు ఉంటే చాలు. పై తరగతిలోకి పిల్లలు వెళ్ళిపోవడమే. ఇది వరకటి రోజుల్లోలాకాదు. పరీక్షలు, పాసు, నామమాత్రమే. పాసైనా, పాసవకపోయినా పై తరగతిలోకి వెళ్ళిపోవడమే.

పల్లెటూళ్ళల్లో ఎన్ని ప్రైమరీ స్కూళ్ళు ఉన్నా కాన్వెంటులున్నా చదువు ఒకలాగే ఉంది. లెక్కకి మించిన పిల్లలు, సరిగ్గా చదువు ప్రాముఖ్యత తెలియని తల్లిదం డ్రులు, ఎలిమెంటరీ స్కూలు టీచర్లు నిర్వ హించే ప్రభుత్వ బాధ్యతలు ఇలాగ ఎన్నెన్నో కారణాలు.

పనిమనిషి కొడుకు రవి జేబులో నుండి డబ్బు తీస్తుండగా శిరీష చూసింది. వాడికి ఎక్కాలు వేయమని చెప్పి, అత్తగారు పిలు స్తూండటంతో లోపలికి వెళ్ళింది. వాడు ఇదే అదనని చెప్పి గదిలోకి నడిచి, రవి చొక్కా అందుకుని డబ్బు తీయబోయాడు.

లోపలినుండి శిరీష అంత త్వరగా వస్తుం దని వాడు ఊహించి ఉండకపోవడం వలన బిక్కచచ్చిపోయాడు. ఆమెకి చాలాకోపం వచ్చింది. ఇంటిదొంగను ఈశ్వరుడైనా పట్ట లేడన్నట్టు ఇన్నాళ్లనుండి మాయమైన వస్తు వులు గుర్తుకు వచ్చాయి.

వాడిని ఈడ్చుకుని వచ్చి నాలుగు తన్నడం మొదలుపెట్టింది. ఆ గొడవకి తోటపని చేస్తున్న లావణ్య, పిల్లలు, వంటింట్లో నుండి అత్తగారు, పెరట్లోనుండి పనిమనిషి వచ్చారు.

విషయం తెలిసిన పనిమనిషి మరేం మాట్లాడలేదు. వెధవని, రెండు తన్నం డమ్మా అని వెళ్ళిపోయింది. ఆ గొడవ చూసిన తర్వాత తల్లంటే ఎంత ఖచ్చితమై నదో, తప్పుచేస్తే ఎలా శిక్షిస్తుందో పిల్లలకి బాగా తెలిసింది.

శిరీష తన పిల్లల్ని ఖాళీగా ఉండనీయదు. పాప శ్వేత స్వరం బాగుంటుందని, ఊళ్ళో నున్న మాష్టారి దగ్గర గాత్రం నేర్పిస్తోంది. రెండు రోజులకి ఒకసారి ఆ క్లాసుకి శ్వేత





వెళుతుంది. బాబుకి ఇంటికి వచ్చే ఒకావిడ వయొలిన్ నేర్పిస్తోంది.

కళలవలన మానసిక వికాసం కలుగుతుందని ఆ భార్యాభర్తల అభిప్రాయం. క్షణం పిల్లల్ని ఖాళీగా ఉండనీయరని తల్లి గొణిగినా రవి పట్టించుకోలేదు. అవకాశం, అభిరుచి ఉన్నప్పుడు పిల్లలు చిన్నప్పుడే అన్నీ నేర్చుకుంటే బావుంటుంది.

ఎవరు ఏమన్నా సాయంత్రం ఒక అర గంట మాత్రం సావిత్రమ్మ పిల్లలను ఒళ్ళో కూర్చోపెట్టుకుని ముద్దులాడుతుంది.

తన కొడుకుల, కూతురి చిన్ననాటి కబుర్లు కథలు కథలుగా చెపుతుంది. పిల్లల స్కూలు విషయాలు ఓపికగా వింటుంది.

లావణ్య వచ్చి వాళ్లని చదువుకుందుకు పిలిస్తే ఆవిడ కసురుతుంది. పిల్లల్ని కాసేపయినా బాల్యం అనుభవించనీయడం లేదని, వాళ్ళకి ముద్దూ మురిపం జరగడం లేదని వాపోతుంది. ఇదంతా చూస్తున్న శిరీష బయటికి వస్తుంది. దాంతో పిల్లలు "మామ్మా! మేం వర్క్ చేసుకుని వస్తాం" అంటూ అత్త దగ్గరికి పారిపోతారు. ఆవిడ బుగ్గలు నొక్కుకుంటుంది.

సావిత్రమ్మ కోడలిని నువ్వసలు తల్లి వేనా? బిడ్డలను కాస్తయినా ఊపిరి పీల్చుకోనివ్వవా? అని దెబ్బలాడుతుంది. నా బిడ్డలు ఎలా పెరిగారు? వాళ్ళని ఏనాడూ నేను చదువుకోమని తిట్టలేదంటుంది.

శిరీష అన్నీ నవ్వుతూ వింటుంది. "అత్తయ్యగారూ! మీ రోజులు వేరు. ఈ రోజుల్లో పోటీ ఎక్కువైపోయింది. పిల్లలు బాగా చదవకపోతే వెనకబడతారు" అంటూ నచ్చచెప్పినా, ఆవిడ కొట్టిపారేస్తుంది. పైగా ఆవిడ ఆ రోజులైనా ఈ రోజులైనా పిల్లలు పిల్లలే అంటుంది.

హెడ్ మాష్టారింటికి భార్యాభర్తలిద్దరూ వెళ్తే ఆయన రిజల్ట్సు పెరిగినందుకు వాళ్ళకి కృతజ్ఞతలు చెప్పాడు. కాసేపు అందరూ స్కూలు కబుర్లు చెప్పుకున్నారు. వారం రోజుల్లో ఎలాగూ స్కూలు తెరుస్తున్నారు కదా అని, ఆ ఏడాది చేయబోయే కొత్త మార్పులగురించి ఉత్సాహంగా మాట్లాడుకున్నారు.

మాటలలో ఆయన చెప్పారు రెండురోజుల క్రితం పేపర్లో మ్యూచువల్స్ కావాలని పెట్టుకొనేవాళ్ళు, రిక్వెష్టుగా మరొక ఊరి స్కూలు కావాలని పెట్టుకునే వాళ్లకి మాత్రం ట్రాన్స్ఫర్లు ఉంటాయని, అలాంటి వాళ్ళు ప్రయత్నాలు చేసుకోవచ్చునని పేపర్లో వచ్చిందని తెలియచేశారు.

"నామాట మన్నించి మీరు ఈ ఏడాది ఉండండి మాష్టారూ! జనరల్ ట్రాన్స్ఫర్స్ ఉండవంటున్నారు కదా!" అని మరొకసారి చెప్పారు.

"ఏమోనండీ! మాకా స్కూలు వదిలి మా అంతట మేం వెళ్లడం అలవాటులేదు. ఇక్కడికి వచ్చి పదేళ్ళు అవుతోంది. మళ్ళీ ఏదైనా లాంగ్ స్టాండింగని కదిలిస్తే చికాకవుతుంది' ' రవీంద్ర సందేహంగా అన్నాడు.

హెడ్ మాష్టారు అతడి మాటలు కొట్టిపారేశారు. "అలాంటివి ఏవన్నా ఉంటే గోల బయలుదేరదా? మన ఎమ్మెల్యే, యం.పి గారు చెప్పరా? " అన్నారు.

"నాకు పెద్దగా ఎవరితో పరిచయాలు లేవండీ! ఎవరి వెనుకా తిరగడం అలవాటు లేదు. ఈ ఏడాది ఇక్కడినుండి ముందుగా కదిలితేనే మంచిదేమోనన్పిస్తోంది. కిందటి ఏడాది మీ మాటమీదే గౌరవం ఉంచి ప్రయత్నాలు చేయలేదు" ఒకింత బిడియంగానే రవీంద్ర అన్నాడు.

"చూశారా! మీ అంతట మీరు మమ్మల్ని విడిచి వెళ్లాలనుకోవడం సబబా? మీరు కష్టపడి పనిచేస్తారు. ఏ స్కూలుకి వెళ్లినా

హారతులు పట్టి పిలుస్తారు. కోరి ముక్కులో వేలుపెట్టి తుమ్మించుకోవడం ఎందుకు? నా మాట విని ఈ ఏడాది ఆగండి" ఆయన భరోసాగా అన్నారు.

ఇతర టీచర్లు కొందరు రావడంతో కబుర్లు ట్రాన్స్ఫర్ల మీదికి మళ్లాయి. క్రాఫ్ట్ మాష్టారు అన్నారు "వెళ్లాలనుకొంటే ఈ ఏడాది వేరే స్కూలు వాళ్లని మ్యూచువల్ అడగండి. లేదా భార్యాభర్తల జివో ఉందిగ నుక నిశ్చింతగా ఉండిపోండి"

అప్పటికి శిరీష నోరువిప్పింది, "చూడండీ! మాష్టారు అంతగా చెపుతోంటే ఇప్పుడు మనంతట మనం ప్రయత్నం చేసి వెళ్లిపో వడం ఎందుకు?

"ఈ ఏడాది తొమ్మిదినుండి పదోక్లాసు లోకి వచ్చేవాళ్లు చాలా చురుకైనవాళ్లు. అర వైమంది ఉన్నారు. చక్కగా మనం మంచి రిజల్ట్సు సాధించవచ్చు మనం కావాలని అప్లికేషన్స్ పెడితే వాళ్లు బాధపడతారు" అంది.

చివరికి అందరూ ఈ ఏడాది మేం ఉండ మంటే ఉండమని బయలుదేరిపోయారు. హెడ్మాష్టారు నిశ్చింతగా ఊపిరి పీల్చుకొ న్నాడు.

ఏవైనా వార్తలుంటే చుట్టుపక్కల హెడ్ మాష్టర్లు ఆయన చెవిన వేయకమానరు. వాళ్లిద్దరూ స్కూలు అంటే శ్రద్ధపడతారు. రెండు సబ్జక్టులకి బెంగ ఉండదు. తనా ఇంగ్లీషు చెప్పుకొంటారు. సమర్థులని, మంచివాళ్లని ఎందుకు వదులుకోవాలి? అంతగా ట్రాన్ఫర్ల గొడవవస్తే అప్పుడే చూసుకోవచ్చుననుకొన్నారు ఆయన.

మర్నాడు ఉదయమే పెద్దమ్మగారి ఊరు నుండి ఫోను రావడంతో భర్త పక్క ఇంటికి వెళ్లడం శిరీషకి అనుమానంగా ఉంది. సెల వులలో రాలేదని ఫోను చేయించ ఉంటుంది. తామందరూ తిరుపతి వెళుతు న్నామని అక్కడికీ ఉత్తరం రాసింది.

చూడాలని ఉండి రమ్మని చెప్పమందేమో అనుకొంటూ త్వరత్వరగా బట్టలు కట్టుకోసా గింది.

ఇంటికివచ్చిన రవికి భయంగాఉంది. ఎలా? శిరీషకి ఈ వార్తను చెప్పడం ఎలా? అతడు ఆలోచనలో లోపలికి వచ్చాడో లేదో శిరీష ముందు వసారాలోకి వచ్చేసింది.

"అదేమిటి? అలా ఉన్నారేమిటి? అందరూ బాగున్నారా? " అని కంగారుగా అడిగింది.

భర్త మొహంలో కంగారుని చూసి ఆమె భయపడింది. అతడు నెమ్మదిగా గొంతు పెగల్చుకొని "అదికాదు శిరీ..." అంటూ చెప్పబోయేంతలోపే "మనం రాలేదని దొడ్డమ్మ దెబ్బలాడిందా? పాపం. దానికి మాత్రం ఎవరున్నారు? సెలవులలో వెళ్లలే దని ఫోనుచేసి ఉంటుంది. ఈమధ్య మన పనులు తీరక నేనూ వెళ్లలేదు. దొడ్డమ్మకి బాగా కోపం వచ్చి ఉంటుంది" తనే అనే సింది.

సావిత్రమ్మ వచ్చింది "ఎవర్రా అబ్బాయి ఫోను చేసింది" అంటూ లావణ్య వచ్చి అన్నగారిని చూసింది. ఏదో చెప్పాలనుకొని చెప్పలేక పోతున్నాడని గ్రహించింది.

"శిరీష వాళ్ల చిన్నన్న చేశాడమ్మా! తనని చూడాలని ఉందిట ఒకసారి తీసుకొని రమ్మన్నారు"

"శిరీ! లావణ్యా, నువ్వు వెళ్లి బట్టలు సర్దు కోండి. వెళ్లి నాలుగు రోజులుండి వద్దాం" అన్నాడు.

శిరీషకి భర్త వెంటనే ప్రయాణం అవమ న్నందుకు చాలా ఆనందంగా అన్పించింది. అందుకే వెంటనే అంది "లావణ్యని మనం తీసుకెళితే అత్తయ్యగారు ఒక్కరూ ఉండ లేరు. అశోక్ సంగతి మీకు తెలుసుకదా! ఎప్పుడు కాలేజీ వాళ్లు కబురు పెడితే





అప్పుడు పారిపోతాడు" అంది.

పిల్లల బట్టలు ఉతికినవి ఏం ఉన్నాయో, ఇస్త్రీకి ఏం ఉన్నాయో చూడాలి అంటూలోపలికి నడిచింది.

"పిల్లలు మనతో వద్దు. లావణ్యని రానీ" రవి స్థిరంగా అన్నాడు. శిరీష వెనక్కి చివ్వున తిరిగింది.

"ఏమిటీ.. పిల్లలు వద్దా? మీరేనా ఈ మాటన్నది. వాళ్లని వదిలి ఎలా వెళతావని నన్ను కేకలేసి నాతో పంపిస్తారు కదా! ఏమైంది? అసలు మీరు ఏదో దాస్తున్నారని భయంగా ఉంది" అంటూ గొడవ ప్రారంభించింది.

రవి నిస్సహాయంగా చూశాడు, "నిన్ను వెంటనే తీసుకువస్తున్నానని మీ వాళ్లకి చెప్పాను. ఇప్పుడు బస్సు వెళ్లిపోతే లేటవుతాం. మీ వాళ్లు నాతో దెబ్బలాడరా? ఏదన్నా ఉంటే. నేను చెప్పనా? నా ఊహకి అందటంలేదు" అన్నాడు.

భర్తని ఇంకా ప్రశ్నలతో బాధించడం ఎందుకని శిరీష బట్టలు త్వరగా సర్దసాగింది. రవీంద్ర, లావణ్య, సావిత్రమ్మ చిన్నగా పెరట్లో మాట్లాడుకోవడం ఆమె చెవిని పడలేదు.

"లావణ్యా!" శిరీష పిలవడంతో చెల్లిని లోపలికి వెళ్లమని అతడు సంజ్ఞ చేశాడు.

కాసేపయ్యాక సావిత్రమ్మ శిరీష దగ్గరికి వచ్చింది. "అమ్మాయ్! చూడు లావణ్యని నీతో రానియ్యి. దాని బట్టలు కూడా సర్దు. పిల్లల్ని నేను, అశోక్ చూస్తాం. వాళ్లు మొన్నే ప్రయాణం చేసివచ్చారు. అలసిపోతారు. మీరా నాలుగు రోజుల్లో రావాలి" ఆవిడ గట్టిగా చెప్పడంతో శిరీష పిల్లల్ని వదిలి బయలుదేరటానికి ఒప్పుకొంది.

అశోక్, పిల్లలు తోటలోనుండి పుస్తకాలతో సహా వచ్చారు. అన్నా, వదిన ప్రయాణం చూసి అశోక్ "మీరు మళ్లీ చెక్కేస్తున్నారా? ఏదో పెళ్లైన ఇన్నాళ్లకి వెళ్లారని మొన్న ఊరుకొన్నాను. నేను లేకుండా వెళితే ఒప్పుకోను వదినా!" అన్నాడు.

శిరీష నవ్వుతూ, "మా తమ్ముడి పెళ్లికి మనందరం వెళదాంలే అశోక్!" అంది.

"ఓహో! మళ్లీ పెద్దమ్మగారింటికి కేంపా? "

అప్పుడే స్నానం చేసి వచ్చిన రవి తమ్ముడిని పిలిచాడు.

బట్టలు సర్దాక, కోడలికి బోర్నవిటా తెచ్చింది సావిత్రమ్మ. రవి తొందర పెడుతుంటే ఇద్దరూ వెనకాల బయలుదేరారు.

శిరీష త్రోవపొడవునా లావణ్యకి తన అన్నతమ్ముల కబుర్లు చెపుతూనే ఉంది. ఈ ఏడాదితో ఇంజనీరింగ్ చదువు పూర్తవుతుంది. ఇంక ఉద్యోగం రావడం తడవు పెద్దమ్మ పెళ్లిచేసేస్తుంది. సంతోషంగా కబుర్లు చెపుతున్న వదినని లావణ్య జాలిగా చూసింది.

"మా పెద్దమ్మగారింటికి మీరు మన పెళ్లైన కొత్తలో వచ్చారు. మళ్లీ ఇదే కదూ రావడం"

భార్య మాటలకి అతడు మౌనంగా తల ఊపాడు. "మనల్ని చూసి పెద్దమ్మ, పెదనాన్న ఆనంద పడతారు. ఇంతకీ పెద్దవాడు ఉన్నాడో, వెళ్లిపోయాడో? వాడికంతా తొందరే. ఫోనులో అడగకపోయారా? " శిరీష భర్తతో మళ్లీ అంది "త్వరగా వచ్చేద్దాం. అత్తయ్యగారు ఒక్కరూ పనిచేసుకోవాలి"

రవీంద్ర అలాగే అన్నట్లు చూశాడు.

మధ్యలో కొబ్బరి బొండాలు కొట్టించి చెల్లికి, భార్యకి ఇచ్చాడు.

"ఇదిగో లావణ్యా! మీ అన్నయ్యగారు వట్టి పీచు" అని నవ్వి "మహాశయా! మీరూ



తాగండి. ఇంతలోనే డబ్బులు అయిపోవు" అంది.

శిరీష గట్టిగా పట్టుపట్టడంతో రవి తానూ తీసికొన్నాడు. శిరీష లావణ్యాతో తాము స్కూలు నుండి వచ్చేటప్పుడు కూడా రవి ఇలాగే చేస్తాడని ఫిర్యాదు చేస్తూ కబుర్లుచెపుతోంది.



ఆటో మలుపు తిరుగుతూంటే దూరంగా కనబడుతున్న పెద్ద మేడని చూస్తూ శిరీష అంది "అదే మా పెద్దమ్మగారి మేడ"

లావణ్య అన్నగారివైపు చూసింది. రవి ఇంక తప్పదన్నట్లు "శిరీ! మా నాన్నగారు మాకు ఎంత చిన్నవయసులో పోయారో నీకు తెలుసుకదూ! మా తమ్ముడైతే, మా చెల్లెలైతే మరీ చిన్నవాళ్లు. నాకు ఇంకా కొంత ఫర్వాలేదు"

భర్త ఇప్పుడు ఎందుకు ఇవన్నీ మాట్లాడుతున్నాడు? తన వాళ్ల ఇంటికి రాలేదని తను అనుకోకూడదని చెపుతున్నాడా?

"ఇప్పుడు అవన్నీ ఎందుకు? నాకు తెలియదా మీకు వీలవకే నా వెంట రావడం లేదని" అంది.





లావణ్యకి ఇంక చెప్పక తప్పలేదు. "వదినా! నువ్వు ధైర్యంగా ఉండాలి. చావు, పుట్టుకలు మనచేతిలో లేవు"

ఆ మాటలకి శిరీష గుడ్లప్పగించి చూడసాగింది. రవి ఆమె చేతిని తన చేతిలోకి తీసుకొని నెమ్మదిగా అన్నాడు "మీ రమాకాంతన్నయ్య చనిపోయాడట"

ఆటో ఇంటి ముందు ఆగింది. శిరీషలో చలనం లేదు. గుడ్లప్పగించి అలాగే చూస్తోంది.. ఆటో ఆగడంతో శిరీష చిన్నన్న శ్రీకాంత్ పరుగెత్తుకొని వచ్చాడు.

"శిరీ! చూశావా! పెద్దన్నయ్య మనల్ని వదిలి ఎలా వెళ్లిపోయాడో? అమ్మని పట్టలేకపోతున్నాం" అతడు ఏడుస్తున్నాడు.

లావణ్య వదినగారిని కుదపసాగింది. శిరీషలో చలనంలేదు. రవికి కంగారు వేసింది భార్యను చూస్తే.

"చూడు శిరీ! పాపం శ్రీకాంత్ ఎలా ఏడుస్తున్నాడో? అతడికి ఎవరున్నారు నువ్వు తప్ప"

"అమ్మగారికి షాక్ తగిలిందండీ! ముందు నెమ్మదిగా దింపండి" ఆటో అతడు సలహా ఇవ్వడంతో రవి, లావణ్యా బలవంతంగా శిరీషని దింపారు.

శ్రీకాంత్‌కి అప్పటికి విషయం అర్థమైంది. "అమ్మా! శిరిని చూడండి నాకు భయం వేస్తోంద"ంటూ అరిచాడు.

కొడుకు శవం దగ్గర కూర్చుని ఏడుస్తున్న శిరీష దొడ్డమ్మ, తల్లీ లేచి వచ్చారు. ఆవిడ ఏడుస్తూ శిరీషని అల్లుకొనిపోయింది.

"చూశావా శిరీ! నన్ను వదిలివాడు వెళ్లిపోయాడే! ఏనాడైనా నన్ను వదలడానికి ఇష్టపడ్డాడా? నేను ఏం పాపం చేశాను? భగవంతుడు నా తండ్రిని ఇంత చిన్న వయసులో తీసుకెళ్లాడు"

శిరీష అయోమయంగా ఆవిడవైపు చూడసాగింది. "ఆ అమ్మాయి ఈలోకంలో లేదు.

షాక్ తగిలి ఉంటుంది. డాక్టరుని పిలవండి' ఎవరో సలహా ఇచ్చారు.

లావణ్య గబగబా లోపలికి వెళ్లి నీళ్లు తీసుకొనివచ్చి వదినగారి మొహం మీద గట్టిగా కొట్టసాగింది. ఎక్కడో తిరుగుతున్న శిరీష ప్రాణం తిరిగి వచ్చినట్లయింది.

ఎదురుగా అన్నగారి శవం, తనని పట్టుకొని ఏడుస్తున్న పెద్దమ్మ ఆమె కళ్లకి కన్పించారు. ఆమె మెదడు చూస్తున్న దృశ్యతరంగాలని అర్థం చేసుకోసాగింది.

"స్నేహితులు బలవంతం చేస్తే షికారు వెళ్లాడే! నాలుగు రోజుల్లో వెళ్లిపోయే నా తండ్రి వాళ్లమాట కాదనలేకపోయాడు. గాలిగాలి అంటూ ఊరి చివరికి షికారు వెళ్లారుట. చీకటిపడినా పొలాల్లో ఉండిపోయారు. ఆ పాడునేల నుయ్యి నా బిడ్డ ప్రాణం తీసింది" పెద్ద మ్మ ఏడుస్తూ చెపుతున్న మాటలు ఆమె చెవినపడ్డాయి.

శిరీష నిశ్చలంగా పడుకొన్న అన్నగారిని చూసింది. "ఒరేయ్! పెద్దన్నా నేను వచ్చానురా! నాతో మాట్లాడవా? చెల్లీ, చెల్లీ అంటూ నా వెనకాల తిరిగే వాడివి కదరా! మాట్లాడరా! నువ్వు ఇలా ఉంటే నేను భరించలేనురా! లేరా!" అంటూ అతడిని పట్టుకొని ఏడవసాగింది.

"ఇంట్లో ఉన్నవాడిని ఉండనీయకుండా బయటికి పిలిచారే ఆ వెధవలు. నా బిడ్డ రానన్నాడు. వాళ్లు వినలేదు. మృత్యుదేవత అలా లాగుతూంటే ఎలా తప్పించుకొంటాడు? "

"అమ్మా! వాళ్లు బాధపడతారు. వెళ్లి ఒక గంటలో వస్తానన్నాడే! ఇదిగో ఉదయానికి ఇలా వచ్చాడు"

ఆవిడ గుండెలు బాదుకొంటూ ఏడుస్తోంది. ఎవరూ ఆవిడని ఆపలేకపోతున్నారు.

"నిన్న మధ్యాహ్నం పెట్టిన అన్నం నాచేత్తో అదే వాడికి ఆఖరి ఋణం. వాడికిష్టమని పెసరట్లు చేశాను. బిడ్డ అవి కూడా తినకుండా వాళ్లతో వెళ్లాడు"

శిరీష ఏడుస్తూ అంతా వింటోంది. పోలీసులు ఇది హత్యా, ఆత్మహత్యా అని అర్ధ రాత్రి నుండే శవాన్ని ఉంచేశారుట. బిడ్డపోయిన దుఃఖం ఒకపక్క, ఈ బాధలు మరొకపక్క.

శిరీష పెదనాన్నకున్న పలుకుబడి వలన ఉదయానికి తెమిలారుట. ఏం జరిగిందో భగవంతుడికి తెలియాలి. రమాకాంత్ స్నేహశీలి. ఎవరితో తగాదాలులేవు.

అతడి మరణంతో స్నేహితులు కుమిలికుమిలి ఏడుస్తున్నారుట. ఇదివరకు ఆ దిగుడు బావిలో పశువులు కూడా పడిపోయాయట. ఫ్రెండ్స్ అందరూ కలిసి వెళదామంటే వినకుండా అతడు ముందు బయలుదేరాడుట. అతడు ఇంక ఉండడని మిగిలిన వాళ్లలేచి నడవబోయేంతలో అతడి కేకలు, పెద్ద చప్పుడు విన్పించాయట.

వెళ్లిన త్రోవనే వచ్చేస్తే గొడవ ఉండేది కాదు. అటువైపు నుయ్యి ఉందని వాళ్లకి తెలియదు. షికారుకని దూరంగా వెళ్లడం వాళ్లకలవాటేనట.

లావణ్య, రవి ఎంత ఓదార్చినా శిరీష దుఃఖం తగ్గలేదు. ఆమెకి పెద్దమ్మ కుటుంబంతోనే చనువు ఎక్కువ. శిరీష అక్కలు ఇద్దరూ వచ్చారు.

సాయంత్రానికి శవాన్ని తీసుకొనిపోవడం జరిగింది. అప్పటికీ అశోక్ రెండుసార్లు ఫోన్ చేశాడు వదినగారు ఎలాఉన్నారని. లావణ్యని రవి అందుకే తీసుకొని వచ్చాడు.

లావణ్య రావడంవలన శిరీషేకాదు వాళ్ల పెద్దమ్మ వాళ్లూ కూడా ఓదార్చబడ్డారు. దూరం చుట్టాలు వండి, వారిస్తే, లావణ్య

అందరికీ కాఫీలు ఇవ్వడం, ఓదార్చి భోజనా లకి తీసుకొచ్చి వడ్డించడం చేసేది.

శిరీష పెద్దమ్మతో లావణ్య ఓదార్పుగా అంది "చూడండి అత్తయ్యగారూ! మా వది నకి మీరందరంటే ప్రాణం. మీరు వదిన గురించి కూడా ఆలోచిస్తారని నాకు తెలు సును. మీరు నాలుగు మెతుకులు తినందే వదినరాదు.

"అన్నం, నీళ్లు మానేస్తే మీ అబ్బాయి వస్తాడంటే అందరం మానేద్దాం. మీకు తెలి యని విషయం ఏముంది? భగవంతుడి ఆజ్ఞ లేనిదే ఏదీ జరగదు. ఆయనకి అంతే ఆయుష్షు ఇచ్చాడు ఆ దేవుడు"

ఆ భార్యాభర్తలు తమ కోసం కాకపో యినా వచ్చిన చిన్నపిల్ల మాట కాదనలేక లేచి ఎంగిలిపడ్డారు.

రవి బయట పనులన్నీ తన నెత్తిన వేసు కొన్నాడు. శ్రీకాంత్‌ని ఓదార్చి తనతో తీసు కెళ్లేవాడు. వీళ్లు వచ్చిన అయిదవ రోజున శ్రీనివాసు వచ్చాడు.

స్నేహితుడు ఒక్కసారి అలా వచ్చాడంటే ఏదో ఉందని అతడిని బయటికి తీసుకె ళ్లాడు.

"మనం వెంటనే బయలుదేరి వెళ్లాలి. లాంగ్‌స్టాండింగ్ వాళ్లకి ట్రాన్స్ఫర్స్ చేస్తున్నా రుట. పైగా మీ ప్లేసుల్లో రావాలని ఎవరో తీవ్రంగా ప్రయత్నిస్తున్నారు."

రవికి ఏమీ తోచలేదు. ఇటు భార్య చూస్తే కష్టంలో ఉంది. ఈ విషయం కూడా చెప్పి ఏం బాధపెడతాడు?

స్నేహితులిద్దరూ ఆలోచనలో పడ్డారు. ఎలాగో మూడు రోజుల్లో రీ ఓపెనింగ్ ఉంది. శిరీష రాక తప్పదు. అప్పుడే తెలు స్తుంది. అందుకే ఈ రెండు రోజులూ లావ ణ్యని సాయంగా ఉంచుదామనుకొన్నాడు.

శిరీషకి తెలియకుండా లావణ్యకి విషయం చెప్పాడు. ఆమె మాత్రం ఏం చేస్తుంది? శిరీషని పిలిచి అన్నాడు "చూడు! శ్రీనుకి ఏదో అవసరం వచ్చిందిట. నీ పాస్ బుక్‌లో డబ్బు తీస్తాను. సంతకం పెట్టిన కాగితం పట్టుకెళతాను" అంటూ భార్య చేత ఒక కాగితంమీద సంతకం పెట్టించాడు.

శిరీష భర్తను చూసి జాలిపడింది పాపం. అన్నయ్య పోయాడని తనకన్నా అతడే ఎక్కువ బాధపడుతున్నాడు. ఎలా గాబరా పడుతున్నాడో?

వెంటనే ఆమె అంది. "చూడండి... నా బీరువాలో చీరలో కొంత డబ్బుంది. అది సరిపోతుందేమో చూసుకోండి. విత్‌డ్రాల్ ఫారం లేనిదే పోష్టు ఆఫీసులో డబ్బు రావడం కష్టం"

శ్రీనివాసు అలాగే అన్నట్లు చూశాడు. రవికి తన తొందరపాటుమీద తనకే కోపం వచ్చింది.

శిరీష పెద్దమ్మ, పెదనాన్న ఇన్ని రోజు లుండి అతడు సహాయపడినందుకు కృతజ్ఞ తలు చెప్పారు.

"మీరు పెద్దవారు. మీ అబ్బాయిని మేం తేలేం. కానీ మీ అబ్బాయిగా నన్ను భావిం చుకోండి. ఎప్పుడు రమ్మన్నా వస్తాను" అంటున్న రవీంద్ర మాటలకి వాళ్లు కళ్లనీళ్లు పెట్టుకొన్నారు.

"పిల్లలు ఒక్కళ్లే ఇంటి దగ్గర ఉన్నారు. నీకోసం బెంగపడతారేమో! త్వరగా రావడా నికి ప్రయత్నించు" అన్నాడు.

శిరీష తల్లిదండ్రులు రవి స్నేహపూరిత ప్రవర్తనని, ఒకరికి ఆపదలో సహాయం చేసే గుణాన్ని ప్రత్యక్షంగా చూడగలిగారు. పెద్ద అల్లుళ్లిద్దరూ కూడా వచ్చారు. ఒక పూట ఉండి వెళ్లాడు ఒకడు. మర్నాడే భార్యతో సహా వెళ్లాడు రెండవవాడు. ఇతనో భార్యని అంటిపెట్టుకొని ఓదార్చడమే కాక భార్య స్వజనం తన వారనుకొన్నాడు.





అమ్మాయిని, అల్లుడిని గమనించడం తప్ప ఆయన రమ్మనలేక పోయాడు. రవి వెళ్లాక కూడా అందరూ అతడి మంచితనం గురించి చెప్పుకొనేవాళ్లే.

శిరీష పెద్దమ్మ అంది, "మా పెద్దవాడు ఎప్పుడూ అనేవాడు చిన్నబావగారు అందరి లాంటివారు కారని. ఇంటికి చెల్లిని చూడటానికి వెళితే ఎంత మర్యాద చేస్తారో అని గొప్పగా చెప్పేవాడు. అమ్మా! చెల్లి మంచివాడిని చేసుకొంది అంటూ ఎప్పుడూ పొగిడేవాడు" ఆవిడ కళ్లనీళ్లు ముత్యాల్లా రాలుతున్నాయి.

"చివరికి ఆ అబ్బాయిని ఇలా రప్పించుకొన్నాడు" శిరీష పెదనాన్న నిట్టూరుస్తూ అన్నాడు.

ఆయన శిరీష తండ్రితో అననే అన్నాడు "మీ ఇద్దరి అల్లుళ్ల స్థితిగతులు ఈ అబ్బాయికి లేకపోవచ్చును. కానీ మంచితనంలో ఇతడు ఎవరితో సరితూగడు"

ఆడవాళ్లు పైకే అనుకొన్నారు. "పెద్దతల్లి కష్టంలో ఉందనైనా పెద్దవాళ్లు ఇద్దరూ రెండు రోజులైనా ఉండలేదు. కార్లలో వచ్చి కార్లలో వెళ్లిపోయారు. శిరీష అలాగ చేయలేదు. ఆమె భర్త పైవాళ్ల ఇల్లయినా అనుకోకుండా ఇన్ని రోజులున్నాడు. పైగా ఆమె ఆడపడుచు ఎంతమంచి పిల్ల, ఎలా కలిసిపోయింది? "

లావణ్య మూడవనాడు వదినగారిని బయలుదేరదీయించింది. మళ్లీ వీలుచూసుకొని వచ్చి ఓదార్చి వెళ్లవచ్చుననుకొని ఇద్దరూ బయలుదేరారు. మరిది రెండు రోజులకి ఒకసారి ఫోను చేయబట్టి ఆమె పిల్లలిని విడిచి ఉండగలిగింది. లేకపోతే ఏనాడూ వాళ్లని వదలలేదు.

శిరీష అన్నగారి స్మృతులు తలచుకొంటూ బాధగా బయలుదేరింది. బస్సులో లావణ్యతో అతడి కబుర్లే చెప్పింది.

శిరీష రవిని పెళ్లి చేసుకోవడం ఆమె తల్లిదండ్రులకి ఇష్టంలేదు. తమ స్థితికి తగని సంబంధమని చిన్నచూపు. రమాకాంత్ మాత్రం శిరీషనే సమర్థించాడు.

ఈ విషయం చెప్పడానికి శిరీష పెద్దమ్మ గారింటికి వెళ్లింది. రమాకాంత్ అంతా విని వెంటనే అన్నాడు.

"చూడు తల్లీ! నేను మొదట బావగారిని చూడాలి ఓకే అనాలి. దారినపోయే ఏ గొట్టాం వాడినో చేసుకొంటానంటే నేను ఒప్పుకోను"

శిరీష బుంగమూతి పెట్టి "చూడు పెద్దమ్మా వీడికి నా గురించి తెలుసనుకొని భ్రమపడ్డాను. గొట్టాం వాళ్లని అసలు నేను ఇష్టపడతానా? "

"ఏమో తల్లీ! ఎన్ని చూడటంలేదు. వినడంలేదు. ఏదో తాను మునిగింది రంభట, తాను వలచింది గంగట. అలాగ ఏ దానయ్యనో నువ్వు తెస్తే, ఆ శాల్తీని బావగారూ అని జన్మంతా పిలవలేక నేను చావాలి"

అన్న మాటలకి శిరీష, పెద్దమ్మ నవ్వారు. "ఒరేయ్! సామెతనే తలక్రిందులు చేస్తున్నావురా! తాను వలచింది రంభ, తాను మునిగింది గంగ అనాలి"

తల్లిమాటలకి అతడు "అబ్బా.. ఏదో ఒకటిలేవే. ఎప్పుడు పొరపాటు మాట్లాడతానా అని ఎదురు చూస్తున్నట్లు ఏమిటా దిద్దుబాట్లు" అని విసుక్కొన్నాడు.

శిరీష ఊరుకోలేదు. "నాయనా! ఆ సామెత నీకు వర్తిస్తుంది. నాకుకాదు. నా సెలక్షన్ బాగుంటే ఏం ఇస్తావు!"

అతడు ఒక్క క్షణం ఊరుకొన్నాడు. "నావంతు అందమైన గాజులు చేయించి ఇస్తాలేవే" అని తన కోరికలు చెప్పసాగాడు.

అవన్నీ అతడికి రాబోయే బావగారికి ఉండవలసిన అర్హతలుట. "పేరు అందమై

నడై ఉండాలి. ఏ కుటుంబరావో, పరమేశ్వరశాస్త్రిగానో ఉండకూడదు. ఫాషన్‌పేరు కావాలి. మనిషి అందంగా ఉండాలి. క్రికెట్ వచ్చినవాడై ఉండాలి. తమతో ఆడమంటే ఆడాలి. సినిమా హీరోల్లాగ లేకపోయినా కళ్లు మూసుకొనే దుర్గతి పట్టించనివాడై ఉండాలి. తాము ఎప్పుడు తమ చెల్లిని తీసుకొని రమ్మంటే అప్పుడు నోట్లో వేలు పెట్టుకొని వెనక వచ్చేవాడై ఉండాలి. ఇంకా..."

శిరీష అతడి నోరు మూసేసింది. "ఏమిటి నాయనా! ఈ గొంతెమ్మ కోరికలు. నేను పెళ్లి చేసుకోబోయేవాడు నాకు నచ్చడం కాదుట మధ్య వీడికి నచ్చాలిట. అయ్యో! చెల్లి బావగారిని వెదకవలసిన శ్రమ తప్పించిందని ఆనందపడక రూల్సు మాట్లాడుతున్నాడు. రేపు నీ భార్యని నేను సెలక్టు చేయనా? నా రూల్సూ విను..."

శిరీష వరసగా చెప్పడం మొదలుపెట్టింది, "దారినపోయే ఏ నానమ్మనో తీసుకొని వస్తే ఊరుకోను. ఆవిడ పేరు ఖచ్చితంగా పెంటమ్మో, వెంకమ్మో అయితేనే నాకిష్టం. పెంటమ్మ వదినా, వెంకమ్మ వదినా అంటూ నోరారా పిలుచుకొంటాను. పాత చింతపండులా నల్లగా ఉన్నా ఫర్వాలేదు. మన గ్యాస్ సిలెండరులాగ పొట్టిగా లావుగా ఉన్నా ఫర్వాలేదు. ఎవరూ నీ భార్యవైపు కన్నెత్తి చూడరు. 'భార్యా రూపవతీ శత్రుః' అన్న పెద్దలమాట చద్దన్నం వంటిది. కాస్త ఎత్తుగా పళ్లున్నా నేను..."

అతడు వినలేనట్లు కళ్లు మూసుకొంటూ "బాబోయ్! ఆపవే తల్లీ! రివర్స్‌లో అలాగ బాదేస్తావా? అయ్యో! అన్నగారన్న ప్రేమైనా వద్దా! కళ్లు మూసుకొంటే కలలోకి వచ్చేస్తుందో ఏమిటో భయమేస్తోంది. లాభంలేదు. కొత్త చీరకొని దీన్ని సాగనంపవలసిందే" అంటూ ఆమెతో బావగారిని చూడటానికి బయలుదేరాడు.

తీరా శిరీష రవిని పరిచయం చేశాక పొంగిపోయాడు.

శిరీష అన్నగారన్న అన్ని మాటలూ అతడికి చెప్పింది.

రవి అతడిని నవ్వుతూ చూస్తూ "నేను మీకు నచ్చానా లేదా, నా పేరు వగైరా నచ్చాయా? టోర్నమెంట్సు ఏవైనా పెట్టి నా క్రికెట్‌ఆట నైపుణ్యం చూపించనా?" అన్నాడు.

రమాకాంత్ ఊరుకోమన్నట్లు చెల్లెలి భుజంమీద గిల్లాడు. అది చూసి నవ్వుతూ రవి "చెప్పండి! మిమ్మల్ని బావగారూ అని పిలిచే భాగ్యం నాకు ఉందా? లేదా? నిజంగా కాశీ వెళ్లిపొమ్మంటారా?" అని అడిగాడు.

"మీరు నాకు నచ్చారు. హాయిగా మా చెల్లినిచ్చి మీకు పెళ్లిచేస్తాను. ఇంక నా మానాన నన్ను వదలండి సార్!" అంటూంటే రమాకాంత్‌ని చూసి వాళ్లిద్దరూ నవ్వుకొన్నారు.

ఇలా ఎన్ని తీపి జ్ఞాపకాలు. ఎన్ని మధుర బాల్య సంఘటనలు. ఏనాడూ అన్నదమ్ములు లేరన్న లోటు తెలియనీయలేదు. స్వంత అన్నదమ్ములున్నా అలాగ చూడరేమో!

లావణ్య వదినగారిని సానుభూతిగా చూస్తూ "వదినా మీరు ఎన్ని చెప్పండి, వింటాను. దయచేసి ఇలాగ తల్లడిల్లిపోవద్దు. మీరు, అన్నయ్య బాగుంటే మాకు అంతా బాగుంటుంది. ఇలాగ మిమ్మల్ని చూడలేను" అంది.

శిరీష బాధగా కళ్ళు మూసుకొంది. తల్లి దగ్గరకంటే పెద్దమ్మ దగ్గరే చనువు ఎక్కువ. ఆవిడకి ఆడపిల్లలు లేరని తనని ఎక్కువగా ఇష్టపడేది. తల్లికూడా అక్కగారి కొరతను గమనించి ఊరుకొనేది. తనకి ఎలాగో ముగ్గురూ ఆడపిల్లలే. ఒకరిని పంపిం

చినంత మాత్రాన నష్టం ఏమిటి?

చిన్నతనంనుండి తల్లిదండ్రులమీద బెంగ లేకుండా పెద్దమ్మ ఇంటికి వెళ్ళి ఉండిపోయేది. అన్నలిద్దరికీ చిన్నప్పటినుండీ శిరి అంటే అభిమానం.

పెద్దవాళ్ళిద్దరూ ఊళ్లో ఉన్న హైస్కూల్ వరకూ చదివి స్కూలు మానేస్తే, శిరీష పెదతల్లి దగ్గరుండి కాలేజీ చదువు చదువుతానంది. అప్పుడప్పుడూ పంపడంవేరు. ఏకంగా ఉంచడం వేరు. అందుకే శిరీష తండ్రి ఇష్టపడలేదు.

అదీగాక పెద్ద పిల్లలిద్దరూ తను ఏం చెపితే అది విన్నారు. ఈ పిల్ల అలాగ కాదు. చదువంటుంది. సంగీతమంటుంది. అందుకే ఆయనకి చిరాకు.

పెద్దవాళ్ళలాగ పట్టు పరికిణీలని, నగలనీ అడగదు. వాటిమీద కోరిక ఉందో, లేదో కూడా తెలియదు. ఆయనే వాళ్ళకి కొంటున్నప్పుడు కొని తెచ్చి ఇస్తే పుచ్చుకొనేది.

చదువు విషయంలో ఆ అమ్మాయి గట్టిగా పట్టుపట్టడం, వాళ్ళ పెద్దమ్మ కూడా వచ్చి తమ ఇంట్లో చదువు పూర్తయ్యేవరకూ ఉంటుందని చెప్పడంవలన ఆయన కాదనలేకపోయాడు.

శిరీషకి అన్నయ్యలదగ్గర బాగా చనువు. స్వంత అక్కల దగ్గర కూడా ఆమెకి ఆ చనువు లేదు. పెద్దమ్మ ఇంట్లో ఉన్నా పుస్తకాలకి డబ్బు తండ్రినే అడిగేది.

ఆయన చిరాకుగా అనేవాడు. "మీ పెద్దమ్మ చదివిస్తానంది కదా! మళ్ళీ నన్ను డబ్బు అడుగుతావేం? "

శిరీష ఏం జవాబు చెప్పేదికాదు. ఆయన డబ్బు ఇచ్చేవరకూ నిలబడేది. ఆయన కొద్ది నిముషాలు చూసి ఇచ్చేసేవాడు. తల్లి మాత్రం ఊరుకోలేక "మనకి ఏం లేదా? పోదా? పిల్లకి డబ్బుఇవ్వడానికి అన్ని ప్రశ్నలు వేయాలా" అని విసుక్కొనేది.

ముగ్గురూ కలిసి చదువుకోవడం, ఆటలు, పాటలు కాలం ఎంతో సరదాగా గడిచేది. అన్నయ్య ఫ్రెండ్స్ ఎవరు వచ్చినా ఎంతో సరదాగా చెల్లిని పరిచయం చేసేవాడు.

అక్కలిద్దరికీ గొప్ప సంబంధాలే చేశారు. అక్కల పెళ్ళిళ్ళలో తాము కలిస్తే ఎంత అల్లరో? నాన్న, అమ్మ తనలోని ఆ ఉత్సాహం చూసి ఆశ్చర్యపోయేవారు. ఎంత అణచుకొందామన్నా జ్ఞాపకాల తెరలు శిరీషని చుట్టు ముడుతూనే ఉన్నాయి.



సావిత్రమ్మ కొడుకు ఈమధ్య సరదాగా ఉంటున్నాడని ఎంతో సంతోషించింది. తండ్రి పోవడం, కుటుంబ బాధ్యత పైనపడటంవలన వయసుకి మించినట్లు అయ్యాడు కానీ కొందరికి వాడి వయసు వాళ్ళకి పెళ్ళిళ్ళే అవడంలేదు.

భార్యతో చెట్టాపట్టాలేసుకొని తిరగవలసిన వయసులో ముసలివాడులాగ ఇంటికి అంకితమయ్యాడు. ఇవన్నీ ఆవిడ మనసులోని బాధలే. తిరుపతి ప్రయాణమై వెళ్ళినపుడు ఇలాగైనా ఇల్లువదిలి వెళుతున్నాడు కదా అనుకొంది.

తిరిగి వచ్చిన కొడుకు తనతో ప్రయాణం

కబుర్లు చెప్పడం, ఉదయమే లేచి ఆ మాటా ఈ మాటా చెప్పడం ఆవిడకి ఏనుగెక్కినంత సంబరాన్ని కలిగించింది.

కాస్త వాడిలో హుషారు వచ్చిందనుకొంటున్న సమయంలో ఇలాగ చావు వార్త రావడం కొంచెం కష్టంగానే ఉంది. పైగా ఇప్పుడు ఈ ట్రాన్స్ఫర్ల గోల.

బిడ్డ ఇంటిపట్టున ఉండకుండా ఒక్కలాగ తిరుగుతోంటే ఆవిడకి మనసుకి కష్టంగా ఉంది. "ఏదైనా డబ్బు పడేస్తే ఇద్దరికీ మంచి చోటు వేస్తారేమో!" అంది.

"ఎవరికని డబ్బు ఇస్తాం? మనకి అలవాటులేదు. చివరికి డబ్బూ తీసికొని, పనీ చేయకపోతే ఏం చేయగలం?" కొడుకు నిస్పృహగా అంటున్న మాటలు కూడా నిజమేనన్పించింది.

రవీంద్ర స్నేహితుడితో చెప్పాడు "నీకు తెలిసి, నమ్మకస్తులైతే డబ్బు ఇద్దాం. పని మాత్రం జరగాలి. శిరీష లేకపోతే నాకు ఎక్కడ వేసినా పర్వాలేదు. ఆమెని ఏం కష్టపెడతాను?" అన్నాడు.

ఇంటికి వచ్చిన కోడలిని చూసి ఆవిడ నిశ్చేష్టురాలైంది. శిరీష బాగా చిక్కిపోయి, అలసటగా ఉంది. ఆవిడ కోడలికి నాలుగు ఓదార్పు మాటలు చెప్పి, స్నానానికి నీళ్ళు పెట్టింది. పిల్లలు తల్లి ఏడుపు చూసి దగ్గరికి రావడానికి కూడా భయపడ్డారు. లావణ్య దగ్గరచేరి తల్లిని బితుకుబితుకుమని గమనించసాగారు.

"చూశావా! పిల్లలు ఎలా బెంగ పడుతున్నారో? లేచి స్నానం చేసిరా! నాలుగు మెతుకులు తిని పడుకుందువుగాని"

అత్తగారు బలవంతంగా, దెబ్బలాడి ఆపూట అన్నం పెట్టింది. మనిషి కాస్త తెప్పరిల్లుతుందని పడుకోమంది. శిరీష భర్తకోసం ఎదురుచూస్తోంది.

భర్త ఊరు సాధారణంగా వెళ్లడు. ఏ పనిమీద వెళ్ళారు? ఏదన్నా ట్రాన్స్ఫర్ల గురించి గొడవా? శిరీష అడిగినా అత్తగారు తనకి ఏం తెలియదంది.

ఏవో ఆలోచనలతోనే ఆమె పడుకుంది. నిద్రపట్టేయడం వలన రవి రాత్రి ఇంటికి వచ్చినా లేపలేదు. ఏడుపుతో చిన్నబోయిన భార్య మొహం, కళ్ళు చూస్తే అతడికి జాలి వేసింది.

అతడిని తల్లి నెమ్మదిగా అడిగింది. ఏం చెపుతాడు? మొదట రిక్వెష్టులు, మ్యూచువల్స్ తప్ప చెయ్యమన్నారు. ఇప్పుడు ముఖ్యమంత్రి చేయమంటున్నాడు. తప్పదంటున్నారు. భయంగా అడిగింది. "వేస్తే ఎక్కడికి వేస్తారు?"

"ఏం తెలుసమ్మా! వాళ్ళు ఎక్కడో కూర్చుని రహస్యంగా వేస్తున్నారుట"

"మరి రెండు రోజులనుండీ తిరుగుతున్నావు కదా"

"శ్రీనివాసుకి తెలిసిన యం.ఎల్.ఏగారికి చెప్పడానికి వెళ్ళాం"

ఆవిడ నిట్టూరుస్తూ అడిగింది "ఆయన ఏమన్నారు?"

"ముందుగా చెప్పవచ్చుకదా! ఛైర్మన్‌గారికి లిష్టు ఇచ్చేశానన్నారు"

కొడుకు మొహంలోని నిరాశ చూసి ఆవిడ చిన్నబోయింది. పైకి మాత్రం "పోనీలేరా! ఏ ఊరి నీళ్ళు మనకి రుణమో" అనేసింది.

రవి గిన్నెలు సర్దుకొంటున్న తల్లికి సాయంగా నిలబడ్డాడు.

"అమ్మా! ఎల్లుండినుండి స్కూళ్ళు ప్రారంభం. శిరీషకి ఈ విషయాలు చెప్పకు. మనకి అవకపోవచ్చుననే చెప్పు"

ఆవిడ తల ఊపింది. అన్ని చిరాకులూ ఒక్కసారే రావాలా?

"అమ్మా" అతడు మళ్ళీ పిలవడంతో





ఆవిడ తలెత్తి చూసింది.

"నేను, శ్రీను రేపు జిల్లాపరిషత్ భవనంకి వెళతాం. శ్రీనుకి దూరం చుట్టం ఒకతడు అక్కడ పనిచేస్తున్నాడుట. ఆయన ద్వారా విషయాలేమైనా తెలుస్తాయేమో? "

ఆవిడ పడుకొంటూ కొడుకుకి, కోడలుకి ఒకచోట వేయమని వందదేవుళ్ళకి దండం పెట్టుకొంది. ఆవిడకి కొడుకు భయం అర్థం లేనిదిలాగా అన్పించింది.

అయినా భార్యాభర్తలను, పెళ్ళికాని వాళ్ళను, వితంతువులను, వికలాంగులను ప్రత్యేకంగా చూసి ట్రాన్స్ఫర్ చేయమని ఆర్డర్లు ఉన్నాయని మాలక్ష్మమ్మ చెప్పింది కదా!

ఉదయం రవీంద్ర పెందరాళే లేచి. తెమిలి వెళ్ళిపోయాడు. భార్యని లేపి చెపుదామనుకొన్నవాడు మనస్కరించక వెళ్ళిపోయాడు.

కొడుకు వచ్చి పక్కన పడుకోవడంతో శిరీషకి మెలకువవచ్చింది. వాడిని దగ్గరికి తీసికొని ముద్దుపెట్టుకొంది.

మామూలుగా అయితే వాడు "మమ్మీ నేను పెద్దవాడినవుతున్నాను ఇంకా ఇలాగ ముద్దుపెట్టుకోవడం ఏమిటి? " అంటూ బుగ్గలు తుడుచుకొంటాడు.

"నాన్నగారు మామ్మతో కబుర్లు చెపుతున్నారా? " అనడిగింది. అప్పుడే ఆ గదిలోకి వచ్చిన శ్వేత "నాన్నగారు కేంప్ వెళ్ళారమ్మా" అంది. శిరీష నిద్రమత్తంతా వదిలిపోయింది.

భర్త రాత్రి ఇంటికి వచ్చినా తను లేవలేదు. ఎంత మొద్దు నిద్రపోయింది. పాపం. తనని లేపనేలేదు.

గబగబ బయటికి వచ్చి తల సవరించుకొంటూ "అత్తయ్యా! ఆయన ఉదయమే వెళ్ళిపోయారా? " అంది.

సావిత్రమ్మ "ఏడుగంటలకి వెళ్ళాడే అమ్మాయి. నీకు నిద్రలేదని లేపవద్దన్నాడు" తప్పంతా కొడుకుదే అన్నట్లు చెప్పింది.

కాఫీ తాగాక మరిదిని అడిగింది. "అన్నయ్య మా ట్రాన్స్ఫర్ల గురించి ఏమైనా చెప్పారా? "

అతడు వెంటనే తడుముకోకుండా "ఈ ఇంట్లో మీ కందరికీ నేనో గుంట వెధవలాగ కన్పిస్తాను. ఎవరూ ఏ విషయం చెప్పరు. ఏదన్నా అడిగితే చిన్నా! నీకెందుకురా! హాయిగా ఉండు అంటూ గుమ్మడి టైపులో లెక్చరు" అనేశాడు.

"అమ్మా! అసలు నిన్ననాలి. వాడూ నాకు చిన్నకొడుకు. మీరిద్దరూ నాకు రెండు కళ్ళు. వాడికి అడిగి తెలుసుకోవలసిన బాధ్యత లేదురా! అని దెబ్బలాడావా? గడ్డాలూ, మీసాలు నెరిసిపోయినా నేను చిన్నవాడినే. ఛీ... ఛీ... బయటివాళ్ళ దగ్గర నా పరువు పోతోంది" అన్నాడు.

లావణ్య సూట్ కేసులోనుండి మాసిన బట్టలు తీస్తోంది.

"ఒరేయ్ అసలు నీకు ఏదో పరువంటూ ఉన్నట్లు ఈ గోల ఏమిటి" అంది.

అశోక్ లావణ్యవైపు చూస్తూ అన్నాడు "తల్లీ! నీకు అన్నీ వినబడతాయి. మధ్యలో సూర్యకాంతంలాగా వస్తావు"

లావణ్య కోపంతో అక్కడికి వచ్చింది.

"ఇదిగో సూర్యకాంతం గీర్యకాంతం అంటే ఊరుకోను. నేనూ నీకు త్రిపాది, నారదుడు వగైరా పేర్లు పెట్టగలను"

పాపకి డౌటు వచ్చింది "మామ్మా! త్రిపాది అంటే ఏమిటి? " అశోక్ పాపవైపు చూశాడు. "శ్వేతా! తల్లీ! నువ్వయినా ఆడపిల్లలాగ మర్యాదగా పెరిగితే బావుంటుంది. మనకి పిచ్చిపిచ్చి పేర్ల అర్థాలు వద్దు"



బాబయ్య మాటలకి శ్వేత నవ్వి, "అది తిట్టా బాబయ్యా" అంది.

అశోక్ పాపను తీసికొని ముందు వరండాలోకి వెళ్ళిపోయాడు.

వెనకాల వెళుతూ శశాంక "బాబయ్యా! ఏ సందేహం ఉన్నా వెంటనే అడిగి తెలుసుకోవాలని చెప్పావు కదా! ఇప్పుడు అక్కని ఎందుకు తెస్తున్నావు? " అడిగాడు.

లావణ్య అదీ అలాగ అడగరా అంటూంటే అశోక్ మాత్రం వాడిని ఒళ్ళోకి లాక్కొన్నాడు. "అబ్బబ్బ ఏం పిల్లలు? పిల్లలు కాదు పిడుగులు" అనుకొంటూ వాళ్ళకి హితబోధ ప్రారంభించాడు.

"నేను మీకు మిత్రపక్షం వాడినిరా! అత్త ఉంది చూశావూ మనకి శతృపక్షం. మన గురించి మనం వెక్కిరించుకొంటామా? "

"ఛా... ఊరుకో బాబయ్యా! అత్త చాలా మంచిది. మనకి ఏం శతృపక్షం కాదు" శ్వేత అత్తనంటే కళ్ళు పోతాయన్న టైపులో అంటూంటే అశోక్ గుండెలు బాదుకొన్నాడు.

'ఎప్పుడైనా ఏది చెప్పినా గుడ్డిగా నమ్మే ఈ పిల్లలకి ఏం తెలివి తేటలు వస్తున్నాయి. ఇవి ఆరోగ్యకరమైనవి కావు. మన పొజిషన్‌కి ముప్పు తెస్తారు...' అశోక్ స్వగతంగా అనుకొంటున్నట్లు అంటూంటే శిరీష నవ్వసాగింది.

అక్కడ రవీంద్ర, శ్రీనివాసు తమ ప్రయత్నాలు ఎంతచేసినా సమాచారం సేకరించలేకపోయారు. ట్రాన్స్ఫర్స్ విషయాలు ఎవరినీ లీక్ చేయవద్దని గట్టిగా పై అధికారులు ఆర్డర్ వేశారుట.

జిల్లాపరిషత్ భవనం తిరునాళ్ళ పండుగలాగ ఉంది. యం.ఎల్.ఏలు, యం.పి.లు, జడ్‌పి. మెంబర్లు, యం.పి. మెంబర్లు, తమ పనులకొరకు వచ్చిన టీచర్లు ఇలాగ వీరందరితో కోలాహలంగా ఉంది.

లిష్టు ఫైనలైజ్ చేస్తున్నారని కొందరు, కాదు రహస్యంగా టైపు చేయిస్తున్నారని కొందరు గోలగా చెప్పుకొంటున్నారు.

శ్రీనివాసు తన బంధువుతో రవి తనకి ఎంత ప్రాణమిత్రుడో చెప్పి, వాళ్ళ గురించి సహాయం చేయమని కోరాడు. అతడు వీలు చూసికొని ఏదైనా సమాచారం అందితే ఫోను చేస్తానన్నాడు.

ఏం జరుగుతోందో ఎవరికీ తెలియదు. ఛైర్మన్‌గారు మాత్రం ప్రతీ యం.ఎల్.ఏని, యం.పి.ని వాళ్ళ తాలూకా టీచర్ల లిష్టులు ఇమ్మన్నారని వార్తలు.

శ్రీనివాసు, రవీంద్ర తిరుగు ప్రయాణం కట్టారు.

"చూశావా రవీ! ఎంతసేపూ రాజకీయనాయకులని ఆశ్రయించుకొని మనవాళ్ళు తిరుగుతారు అందుకే మనలాంటివాళ్ళం ఎందుకూ పనికిరాం"

స్నేహితుడి మాటలలో అశాంతిని రవి గమనించాడు. అక్కడికే వెళ్ళి తన స్టూడెంటు అయిన సర్పంచితో రవి తమకి ఈ ఏడాది ట్రాన్స్ఫర్ ఆపమని అడిగాడు.

అతడు ఎంతో నొచ్చుకొన్నాడు. ఏనాడూ తన గురువుగారు ఎవరినీ ఏదీ అడగలేదు. ఈనాడు తనతో అంటే జరిగే పనికాదు. ఎవరినీ వదిలేది లేదని పై నాయకులు అంటూంటే ఏంచేయగలడు?

ఈ ఏడాది పదవతరగతికి వచ్చిన విద్యార్థులకోసం అతడు ప్రయత్నించడం తప్ప తనకోసం కాదు. వాళ్ళు నొచ్చుకొంటారని, శిరీష బాధపడుతుందని అతడు ఈ మాత్రమైనా బయలుదేరాడు.

రూల్స్ ప్రకారం ట్రాన్స్ఫర్లు అవుతాయంటూ ప్రకటనలు, పోనీ ఇద్దరినీ ఒకచోటుకే వేస్తారు కదా! చూద్దాం అనుకొన్నాడు.




భర్త ఇంటికి రాగానే శిరీష ఆప్యాయంగా ఎదురు వచ్చింది. "పోనీలెండి., తప్పనిస రైతే మనం ఏం చేస్తాం? ఉద్యోగికి దూర భూమిలేదు. మీరు మాత్రం తిరగవద్దు" అంది.

భార్య మాటలకి అతడు ఏం జవాబు చెపుతాడు? అతడికీ ఎవరితో ఎలా పని ముందుగా చేయించుకోవాలో తెలియదు.

మర్నాడు స్కూలు ప్రారంభం. ఆర్డర్స్ అప్పుడే రావు. ఎలా లేదన్నా పది రోజులు పట్టవా? అనుకొన్నాడు.

స్కూల్లో అడుగు పెట్టారో లేదో అక్కడి వాతావరణం కూడా వేడిగా ఉంది. విద్యార్థులందరూ వాళ్ళని చుట్టు ముట్టేశారు

"మేడమ్! మీరు వెళ్ళిపోతారా? మీకు, సార్‌కి ట్రాన్స్ఫర్ అయిందా? "

శిరీష ఏం సమాధానం చెపుతుంది? స్టాఫ్ వచ్చి శిరీష బ్రదర్ పోయినందుకు పరామర్శించారు. శిరీష కళ్లల్లో కన్నీళ్ళు గిర్రున తిరిగాయి.

పెళ్ళైందా అతడికని కొందరు, ఎలా పోయాడని కొందరు ప్రశ్నలు గుప్పించారు. అన్నయ్య ఇంకా పెళ్ళి చేసుకోకపోవడం ఇందుకోసమే కాబోలనుకుంది.

కొన్ని సంబంధాలు పెద్దమ్మకి నచ్చక, కొన్ని వాడికి నచ్చక ఆలస్యం చేశారు. ఈ ఏడాది ఎలాగైనా సంబంధాలు కుదిరితే ఇద్దరు కొడుకులుకీ ఒక్కసారే చేయాలని శిరీష పెద్దమ్మ అనుకుంది.

శిరీష వేళాకోళంగా "ఒరే అన్నయ్యా! నువ్వు ఇలాగే ముసలివాడివైపోతావా? జుట్టంతా నెరిశాక ఎవరు పిల్లనిస్తారని" అడిగేది.

అతడు తన జుట్టు అద్దంలో చూసు కొంటూ అనేవాడు "ఆ... భయపడకే. ఎవరు చేసుకోపోయినా మా చెల్లికూతురు ఉంది కదా! దాన్నే చేసుకొంటాను. ఏం కూతురిని ఇవ్వవా? "

వాడి దబాయింపుకి శిరీష నవ్వుతూ "మా అమ్మాయి ఈ ముసలిమావయ్య వద్దంటే..." అనేది.

అతడు శ్వేతని చూస్తూ "నా దగ్గర బోలెడు డబ్బు ఉందే. నన్ను చేసుకొంటే నగలూ, కారూ, డబ్బూ, చీరలూ ఇస్తాను చేసుకొంటావా? " అనేవాడు.

పెద్దమ్మ కల్పించుకొనేది "పోరా! పసిదానితో ఈ వేళాకోళాలు ఏమిటి? "

అతడు నవ్వుతూ "ఆ పసిది పెద్దదైనా, నువ్వు ఈలోపు పెళ్ళిచేస్తావన్న నమ్మకం నాకు లేదు" అనేవాడు.

వాడి నోట్లో ఏం శని ఉందో? లేకపోతే అన్నీ ఉన్న వాడు పెళ్ళికి ఆలస్యం చేయడమేమిటి? ఏ పిల్లని చూసినా ఏదో విషయంలో అవాంతరం ఏర్పడేది.

క్రాఫ్ట్ మాష్టారు ఆ అబ్బాయికి పెళ్ళి కాక పోవడమే మంచిదయిందంటే అందరూ అవునంటే అవుననుకొన్నారు. డ్రాయింగ్ మేష్టారు ఆ గోలలోనే "మీకు తెలుసా? మన ఎనిమిదవ తరగతి సత్యం పోయిన సంగతి" అని అడిగాడు.

శిరీష నిర్విణ్ణురాలైంది. ఏమిటీ చావుక బుర్లు? ఒకదాని వెంబడి ఒకటి. పసిపిల్ల వాడు, బోలెడు భవిష్యత్తు ఉన్నవాడు చని పోవడం ఏమిటి?

వాడికి తండ్రిలేడు. తల్లి కష్టపడి పొలం పండించి బిడ్డలను పెంచుకొంటోంది. వాళ్ళ అమ్మ ఎవరి దగ్గరో అడిగి రెండువేలు అప్పు అవసరమై చేసిందిట. వాడు ఆవిడకి తెలియకుండా పేకాట ఆడేశాడుట. డబ్బు పోయిందని తల్లి తిడుతుందని చనిపోయాడు.

ఆత్మహత్య... ఎండ్రిన్ తాగి ఆత్మ హత్య... ఎలాగ చేసుకోగలిగాడు?



"వాడు... వాడు... పేకాట ఆడతాడా? " అడగలేక అడగలేక అడుగుతున్న శిరీషను స్టాఫ్ జాలిగా చూశారు.

వాడు ఆడతాడంటే రవీంద్రకి కూడా నమ్మకం కలగలేదు. ఎప్పుడూ స్కూలు మానకుండా వచ్చేవాడు. చురుకైనవాడు.

వాడి గురించి రవీంద్ర అడుగుతోంటే క్రాఫ్ట్ మేష్టారు చెప్పారు. "వేసవి సెలవులు కదా! వీధుల్లో చేరి పిల్లలు పేకాట ఆడే వారు. ఇళ్ళదగ్గర తల్లిదండ్రులు తిడతారని చాటుగా ఆడేవారు. తల్లి తన పని అయ్యాక, ఆ డబ్బు చూసుకొందిట. డబ్బు పెట్టెలో కనబడకపోవడంతో ఆవిడ గాబరా పడిందిట. తల్లి డబ్బు గురించి అడుగుతుం దని, ఖర్చయిపోయిందంటే తిడుతుందని వాడు పొలంలోకి వెళ్ళి ఆ పని చేశాడుట"

బాధతో మెలికలు తిరుగుతున్న కొడుకుని ఊళ్ళో చూసినవాళ్ళు మోసుకొని వచ్చారుట. మరో అరగంటకి వాడు చనిపోయాడుట. వెధవ డబ్బు నా కొడుక్కన్నా ఎక్కువా? అని ఆవిడ ఏడుపుట.

హెడ్‌మేష్టారు ప్రేయర్ క్లాసులో ఆ అబ్బాయి గురించి చెప్పి, మౌనం పాటించ మన్నారు. పిల్లలు అడగడంవలన 12 గంట లకి స్కూలు వదిలేశారు.

శిరీషకి ఆరోజు అలాగ గడవడం ఎంతో బాధగా ఉంది. రీ-ఓపెనింగ్ అంటే ఆమెకి ఎంతో సంబరం. చాలా రోజుల తర్వాత పిల్లలు, మేష్టర్లు కలుస్తారు. నూతన సంవ త్సరంలో కొత్తక్లాసులలో కూర్చుంటున్న విద్యార్థులలో ఎవరెష్టుశిఖరం ఎక్కినంత సంతోషం.

ఆ దంపతుల మనసు ఆ విద్యార్థి గురించే ఆలోచిస్తోంది. ఈ గొడవలో తమ గొడవ తాత్కాలికంగా పక్కకి తోశారు.





రవి సాలోచనగా అన్నాడు "మనం విద్యా ర్థులకి ఏ పరిస్థితులనైనా ఎదుర్కొనే ధైర్యం కలిగించలేకపోతున్నాం. పరీక్షలు పోతే ఆత్మహత్యలు, డిబ్బార్టైతే ఆత్మహత్యలు, తల్లి దండ్రులు కష్టంతోచి తిడితే ఆత్మహత్యలు. అబ్బబ్బ... చస్తున్నాం. ఈ చావు వార్తలు వినలేక మనం క్షణక్షణం చస్తున్నాం. వీరం దరికీ బతుకు తీపి ఎందుకు అర్థం అవదు? "

రవి వేసిన ప్రశ్నలు ఆమెలో కొత్త ద్వారా లను తెరుస్తున్నాయి. ఈనాటి పిల్లలకు ఎవరు ధైర్యం ఇవ్వాలి? ఎవరు వారిలో ఆలోచనలు సక్రమంగా ఉన్నాయో, లేవో చూడాలి. ఎవరు శ్రద్ధపడి వారి వ్యక్తిత్వ వికాసానికి దోహదపడాలి? తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు, సమాజం వీటిగురించి ఆలోచిస్తున్నారా? ఎదిగే వయసులో చెడు అలవాట్ల బారినుండి ఎలా తమ బిడ్డల్ని కాపాడుకోవాలో వాళ్ళు ఆలోచిస్తున్నారా?

మధ్యాహ్నమే ఇంటికి వచ్చిన కొడుకుని, కోడల్ని చూసి సావిత్రమ్మ ఆశ్చర్యపో యింది. కొడుకు విషయం చెప్పాక "బాగుంది రామేశ్వరం వెళ్ళినా శనేశ్వరం తప్పలేదుట. స్కూలుకి వెళ్ళినా అక్కడా చావు వార్తేనా? " అని విసుక్కొంది.

మర్నాడు ప్రేయరులో శిరీష హెడ్‌మేష్టా రుని పదినిముషాలు టైము కావాలని అడి గింది. ఆయన సరేనన్నారు.

శిరీష విద్యార్థులముందుకు వచ్చింది. ఆమె ఏదో చెప్పబోతోందని వాళ్ళు గ్రహించి, నిశ్శబ్దంగా నిలబడ్డారు.

"ప్రియమైన విద్యార్థినీ విద్యార్థులారా! నిన్న కొత్త సంవత్సరం మనకి ఎంతో బాధతో ప్రారంభమైంది. మనలో ఒకడు, మనలో కొన్నాళ్ళు ఈ విద్యాప్రాంగణంలో తిరిగిన పిల్లవాడు బతుకుని అర్థాంతరంగా ముగించుకొని వెళ్ళిపోయాడు. ఎందుకు ఆ సంఘటన జరిగింది? చెడు అలవాట్లకి

మనిషి లోనవడంవలన. అటు తీసికొన్న డబ్బు గురించి తల్లికి చెప్పలేక, డబ్బు వృధాగా పేకాటలో పోగొట్టుకొన్నానన్న బాధతో ఇలాగ చేశాడు. ఇది మంచిపనా? ఆ ఇల్లు చూడండి. ఆ తల్లి ఏడుపు వినండి. మళ్ళీ అతడు వస్తాడా? వాళ్ళు బతికి ఉన్నంతకాలం ఈ లోటును భరించవల సిందే.

ఆత్మహత్య పిరికితనం. మనిషి వివేకంతో బతకాలి. ఈ జీవితం భగవంతుడిచ్చిన వరం. దాన్ని వృధాచేసుకొంటారా? బతక డానికి ధైర్యం, వివేకం కావాలి. మీరు ఎప్పుడూ ఇలాగ ప్రవర్తించమని మనసులో ప్రమాణం చేసుకోండి. సమస్యలు చిన్న వైనా, పెద్దవైనా పరిష్కరించుకోవడానికి ప్రయత్నించండి. వాటిని పరిష్కరించుకోవ డంలో మీకు సహాయపడటానికి మీ తల్లి దండ్రులున్నారు, మేం ఉన్నాం. ఏ బాధ కలిగినా మాకు చెప్పండి. అంతేకానీ ఇలాంటి పిచ్చి పనులు చేయకండి. నా విద్యార్థులను అలాంటి స్థితిలో చూడలేను"

శిరీష కళ్ళనుండి తెగిపడిన ముత్యాలలాగ కన్నీళ్ళు రాలసాగాయి. విద్యా ర్థులు ఆమె మాటలను మౌనంగా విన్నారు. వాళ్ళ టీచర్ బాధ, ఆవిడ చెప్పిన విష యాలు వాళ్ళకి బాగా అర్థమయ్యాయి.

టీచర్స్ అందరూ కాసేపు ట్రాన్స్ఫర్స్ గురించి మాట్లాడుకొన్నారు. డ్రాయింగ్ మేష్టారు, శిరీష, రవీంద్ర క్లాసులకి వెళ్ళబో తోంటే ఎలాగో ట్రాన్స్ఫర్ ఆర్డర్స్ వస్తాయం టున్నారు. ఈలోపు పాఠాలు మొదలుపె ట్టడం ఎందుకు? వచ్చిన వాళ్ళే చెప్పుకొం టారు అన్నాడు.

సైన్సు మేష్టారు అంతేనన్నారు. ఆయనకి కూడా ట్రాన్స్ఫర్ అవుతుందేమోననుకొంటు న్నారు. ఆయన బహువ్యాపకుడు. అందరి ప్రాపకాలూ ఉన్నవాడు. అయితే ఆయన వచ్చి అయిదు సంవత్సరాలే అయింది. కనుక అవకపోవచ్చునని ఆయన ఉద్దేశ్యం.

రవీంద్ర అన్నాడు "మనిషి ఎప్పుడో అప్పుడు చచ్చిపోతాడు. అలాగని బతకడం మానేస్తున్నాడా? కోరికలు తీర్చుకోవడానికి ప్రయత్నాలు మానుతున్నాడా? మనం మంచి రోజు చూసి పాఠాలు మొదలె డతాం. ఎప్పుడు వెళ్ళవలసివస్తే అప్పుడు వెళతాం"

సైన్సు మేష్టారి తల సిగ్గుతో వాలిపో యింది. అప్పటికే శిరీష కేలండర్ చూస్తోంది. విదియ. బావుందనుకొంది. ఏదైతే అదే అయింది. తనచేత్తో పదవతర గతి ప్రారంభిస్తే సరి.

ఆమె అనుకొని వస్తున్నలోపే హెడ్మే ష్టారు శిరీషను పిలిచి "మేడమ్! పదవతర గతి ప్రారంభించండి" అన్నారు. ఆయన శిరీ షను ఒక చెల్లెలిగా చూశారు.

కొత్త రిజిష్టరు ప్రారంభిస్తే ఆమెనే మొదట సంతకం పెట్టమనేవారు. కొత్త సంవత్సరం క్లాసు మొదట ఆమే చెప్పాలనే వారు. నీ చేత్తో ప్రారంభం బావుంటుం దమ్మా అనేవారు.

శిరీష క్లాసుకి వెళ్ళిపోయింది. పిల్లలు చుట్టుముట్టి అడిగారు "మేడమ్! ఈ ఏడాది మీరు ఉండరా? మీకు ట్రాన్స్ఫర్ అవు తుందా? "

శిరీషకే కళ్ళనీళ్ళు తిరుగుతున్నాయి. "మీ ప్రశ్నలు తర్వాత, ముందు సరస్వతీదేవిని ప్రార్థన చేయండి. మీరందరూ ప్రథమశ్రే ణిలో ఉత్తీర్ణులవ్వాలి"

వారు ఆమె చెప్పినట్లే చేశారు.

"మా ప్రశ్నలకి సమాధానం చెప్పండి" వాళ్ళు పట్టుపట్టారు.

"ఏమో! ట్రాన్స్ఫర్ ఆర్డర్స్ వస్తాయంటు న్నారు" శిరీష ఎలాగో అంది.



"మీరు ఆపుకొంటే ఆగదా?" ఒక అబ్బాయి అడిగాడు.

"ఆగకపోవచ్చును నేను కావాలని ట్రాన్స్ఫర్ కోరతానా? మీకు తెలియదా?"

"మేం అందరం మిమ్మల్ని వెళ్ళనివ్వం" విమల అంది. శిరీష రత్నంవైపు చూసింది. రత్నం గుమ్మం దగ్గర నిల్చుంది.

రత్నం కళ్ళు మళ్ళీ శిరీష కనబడదేమోనన్నట్లు చూస్తున్నాయి. మాట మరిచిపోయిన మనిషిలాగుంది.

శిరీషే నవ్వు తెచ్చుకుని పలకరించింది. "అమ్మగారు బావున్నారా? వ్యాపారం బావుందా?"

రత్నం తీక్షణంగా చూస్తూ అంది "ఈ ఊరునుండి మీరు, సార్ వెళ్లిపోతున్నారా?"

శిరీష జవాబు చెప్పలేకపోయింది.

"నాకేం బావుండలేదు. మీరు వెళితే ఎలాగ?" నిలదీసింది.

శిరీష ఎలాగో తనని తాను కంట్రోల్ చేసుకొని "నువ్వు ఎలాగూ పై క్లాసుకి వెళుతున్నావు కదా! రత్నం లేని క్లాసు మేడమ్‌కి బావుండదుకదా!" అంది.

రత్నం కళ్ళు తిప్పుతూ"కబుర్లు చెప్పకండి. మా ఊర్లో, మా స్కూల్లో చూడటంవేరు. ఎప్పుడో కలిసి ఒక గంట చూడటం వేరు. అవునా!" అంది క్లాసులోని పిల్లలను చూస్తూ.

శిరీష నవ్వేస్తూ "టీచర్లన్నాక ట్రాన్స్ఫర్లు అవవా?" అని మళ్ళీ అంది. "నేను వీళ్ళకి కొత్త పాఠం మొదలుపెడదామనుకుంటున్నాను"

"చెప్పండి. నేనూ వింటాను. మే ఐ కమిన్?"





శిరీష గబుక్కున తల ఊపింది. రత్నం వెళ్లి వెనక బెంచీవైపు మొదట కూర్చుంది. శిరీష అక్కడికి ఎంతో బాగా కన్పిస్తుంది.

శిరీష కొంచెంసేపు సాంఘిక శాస్త్ర ప్రాధాన్యత వివరించి, "ప్రపంచంలో విప్లవోద్యమాలు" చరిత్ర పాఠం మొదలుపెట్టింది. ఆవిడ గొంతు గంగా ప్రవాహంలాగా సాగిపోతోంది. పిల్లలకి తెలిసిన విప్లవాల గురించి అడుగుతోంది. ఎందుకు ఆ విప్లవాలు ప్రారంభమయ్యాయని అడుగుతోంది.

వాళ్ళకి తెలిసిన విషయాలు చెప్పిస్తూ, తెలియనివి చెపుతూ ఆ పీరియడ్ గడిపింది. వేసవి సెలవులలో విద్యార్థులని చూడలేదు కదా! అందుకని వాళ్ళని పేరు పేరునా పలకరించింది.

రామకృష్ణ, స్వామినాయుడు అందరూ ముక్తకంఠంతో అన్నారు "మేడమ్! మా తల్లిదండ్రులకి చెపుతాం. మీరు, సార్ వెళ్ళిపోతే మాకు కష్టం. ఎలాగైనా ఆపమని కోరతాం"

శిరీష వాళ్ళను ప్రేమగా చూస్తూ అంది "ఆర్డర్స్ రాలేదు. ఎందుకు గాబరా పడతారు? ఎవరు ఉన్నా, ఎవరు వచ్చినా, ఎవరు వెళ్ళినా మీరు బాగా చదవాలి. మీ ధర్మాన్ని మీరు నిర్వహించాలి." వాళ్ళు డగ్గుత్తికతో అన్నారు "అసలు మీకే ఇక్కడ ఉండాలని లేనట్టుంది. అందుకే వద్దనడం లేదు"

శిరీష వాళ్లవైపు చూసింది. "నాకు మీరంతా ఇష్టమో, కాదో తెలియదా? అయినా ఇప్పుడే నేను వెళ్ళిపోతున్నానా ఏమన్నానా?"

రత్నం వెనకాలే స్టాఫ్ రూంకి వచ్చింది. తను ఆరోజు స్కూలు స్టాఫ్‌కి పార్టీ ఇస్తోందిట.

రవీంద్ర, శిరీష దెబ్బలాడారు. పార్టీ అసలు స్కూలు ఫస్టు వచ్చినందుకు తామే

ఇవ్వాలన్నారు.

ఆ పిల్ల వింటే కదా! భారీగా ఏర్పాట్లు చేసి, అన్నీ పట్టుకొచ్చింది.

జానకమ్మ మేడమ్ చేతులు కడుక్కుని వస్తూ అంది "మనం వాళ్ళకి కష్టపడి పాఠాలు చెప్పకపోతే వాళ్ళు అభివృద్ధిలోకి వస్తారా? స్కూలు ఫస్టు వచ్చాక పార్టీ అయినా ఇవ్వవద్దా? "

డ్రాయింగ్ మాష్టారు అందుకున్నారు "మీరు మరీ కష్టపడి చెప్పారు"

ఆవిడ చెవిని ఈ మాటలు పడనేపడ్డాయి. ఆవిడ ఊరుకుంటుందా? "నాలుగు సైన్సు బొమ్మలు అయినా నువ్వు బోర్డుమీద వేశావా? పిల్లలచేత వేయించావా? పైగా నీతులు చెపుతున్నావు"

ఆవిడ జోలికి ఎందుకులే అనుకున్నాడు డ్రాయింగ్ మాష్టారు.

ఆరోజూ ఆర్డర్స్ రాలేదు. కానీ ప్రెసిడెంటు వార్తలు పట్టుకొచ్చాడు. మన స్కూల్లో ముగ్గురికి ట్రాన్ఫర్స్ అయ్యాయి అని. "మన స్కూలుకి ఎవరిని వేశారు? " ఊళ్ళోవాళ్ళు ఆరాగా అడిగారు.

"అవన్నీ నాకు ఎలా తెలుస్తాయి? అయినా ఇంక వచ్చేస్తాయి కదా!"అంటూ తప్పించుకున్నాడు.

కోడూరు గ్రామం పెద్దది. అక్కడి వాళ్ల రాజకీయాలూ పెద్దవే. ఒకపార్టీవారు అవునంటే మరొకపార్టీవారు కాదంటారు. ఎవరికి వారే స్వతంత్రులు. ఒకరు కర్మకాలి ఏదైనా మంచి పని ఎవరి ప్రోద్బలం వల్ల అయినా చేయడానికి పూనుకొంటే వెంటనే మరికొందరు ఆ పని ఆపించేంతవరకూ నిద్రపోరు. యువకులైన పిల్లలు ఈ రెండు పార్టీలవలన ఊరికి ఏమీ జరగడంలేదని వాపోతుంటారు.

సుబ్బారావుగారు మంచివారే. పనిని సాధించడంలో ఘటికుడు. అయితే సాహసంగా చేయడానికి వెనుదీస్తాడు. తన హయాంలో హైస్కూల్ కి కొన్ని మంచి పనులైనా జరగాలని ఆయన తపన.

హైస్కూల్ కి కావలసిన బిల్డింగ్ పనులు, ఎక్విప్‌మెంట్ ఊళ్ళో వాళ్ళనుండి చేయించుకోవాలి. వాళ్ళు కాంట్రాక్టు పనుల విషయంలో పోటీలుపడి సమస్యలు సృష్టించుకొన్నారు. ప్రభుత్వం ఇచ్చిన నిధులు మురిగిపోతున్నాయి.

అవి పోయినా వాళ్ళకి బాధలేదు. తమ కిష్టం లేని వాళ్లకి లాభం చేకూరకూడదు అంతే!

దీనివలన గ్రామం ఎంత వెనుకబడిపోతోందో వాళ్ళకి అక్కరలేదు. రాబోయే తరాలు ఎంత నష్టపోతున్నదీ వాళ్లకి అర్థం కాదు.

సుబ్బారావుగారు స్కూలు బిల్డింగ్‌కోసం ఎన్నోసార్లు సర్పంచికి, హైస్కూలు కమిటీ మెంబర్లకి కబుర్లు పెట్టారు. క్లాసు రూంలు లేక విద్యార్థులు ఎంత అవస్థపడుతున్నదీ కళ్ళకి చూపించి వివరించేవారు. చెట్లకింద స్కూలు క్లాసులు కొన్ని పెట్టుకోవడం, వర్షం పడితే పిల్లలని వదలలేకా, స్కూలు ఉంచలేకా నరకయాతన.

హెడ్ మాష్టారుగారు వచ్చిన పెద్దలకి నిష్కర్షగా చెప్పారు "మీ గ్రామ రాజకీయాలు మాకు వద్దు. మా స్కూలు పని చూడండి" అని. కానీ ఆయన మాటలు నిష్ప్రయోజనమే అయ్యాయి.

ఇంక ఇది పని కాదనుకొని ఒక పార్టీవారు అధికారంలోకి వచ్చాక తాము స్కూలుకి భవనాలు నిర్మించి, కుర్చీలు, బల్లలు వూళ్ళోవాళ్ళని చందాలడిగి ఇస్తామన్నారని పుకారు లేవదీయించారు.

దానితో అవతల అధికారంలోఉన్న



సర్పంచికి, అతడి గ్రూప్‌కి వేడి పుట్టుకొ చ్చింది. వాళ్ళు చేయడమా? మాకేం ఖర్మ. మేం అధికారంలో ఉండగా చేయలేని వాళ్ళం. వాళ్ళు చేసే వాళ్ళూనా? వాళ్ళు అడ్డుతగలకుండా ఎప్పుడో చేసేవాళ్ళం అంటూ క్లాసురూం భవనాలు రెండూ తయారయ్యేందుకు పూనుకొన్నారు. టీచర్లూ, హెడ్‌మాష్టారూ ఊపిరి పీల్చుకున్నారు.

ఒక్కొక్కసారి ఏవైనా ఊళ్ళో చందాలు అడిగి కుర్చీలు, బెంచీలు చేయించమని అడి గితే, "ఏ మాష్టారో ఎప్పుడో పని ఉండి లేటైతే పెద్ద నాయకుల్లాగ దాన్ని పట్టుకొని అడుగుతారు. మీ మాష్టర్ల పని పాటలు బావుండేలాగ చూడండి. పిల్లలకి నాలుగ క్షరం ముక్కలు కూడా రావడంలేదు" అని అంటారు.

హెడ్ మాష్టారుకు చిరాకు వచ్చేసింది. పావుగంట ఎప్పుడో ఏదైనా పని ఉండి ఆలస్యం అయితే ఆరా తీస్తారు. పల్లెటూరు ప్రజలు అమాయకులని అనుకొన్నవాళ్ళని అనాలి. టీచర్స్ మీద చూపే శ్రద్ధ తమ పిల్లల చదువు సంధ్యలమీద చూపవచ్చు కదా!

ఎలిమెంటరీ స్కూలు ఉపాధ్యాయులు ఎప్పుడు వచ్చినా పర్వాలేదు. ఎప్పుడు వెళ్ళినా పర్వాలేదు. మా మీదే మీ అజమా యిషీ. ఎందుకంటే చుట్టుపక్కల అందరి కన్నా కష్టపడి పని చేస్తున్నాం కదా!

హెడ్ మాష్టారు ఎప్పుడో తప్ప ఇలాగ బయటపడరు. తమ చుట్టాలు, తమ కులం, తమ ఊరు అని గిరి గీసుకొని మంచిని మంచిగా, చెడుని చెడుగా చూడని వారిపై అప్పుడప్పుడూ ఆయన ధ్వజం ఎత్తుతారు.

ఇంటికి రాగానే రవీంద్రని తల్లి అడిగింది ఆర్డర్స్ వచ్చాయా నాయనా? అని.

ఇంట్లో ఇప్పుడు ఇదే చర్చనీయాంశం అయింది. రవీంద్రకే ఈ పరిస్థితి చిరాకుగా ఉంది.

చివరికి ఎలాగైతేనేం స్నేహితుడి బంధువు రాత్రి ఫోను చేసి చెప్పారు. ఇద్ద రికీ ట్రాన్స్ఫర్లు అయ్యాయని, రవీంద్రను దూరంలో ఉన్న హైస్కూల్‌కి వేశారుట. శిరీషను మరికొంత దూరంలో ఉన్న మరో వైపున ఉన్న అప్పర్ ప్రైమరీ స్కూల్ హెడ్ మిస్ట్రస్‌గా వేశారు. ఆర్డర్స్ పోష్టు చేసేశారు.

రవీంద్ర స్థాణువే అయ్యాడు. అంతదూ రంలోనున్న టీచర్‌ను తమ స్కూలుకి వేశారు అని ఆ ప్రాంతం యం.ఎల్.ఏ. గొప్పగా చెప్పుకొంటున్నారుట. "మీకోసం బాగా చదువు చెప్పే టీచర్‌ను తెచ్చాను. నేను ఈ ప్రాంతాన్ని పట్టించుకోనని మీరు ఎలా అంటారు? " అని ప్రజల దగ్గర అంటే గానీ ఆయనకి తృప్తి కలగలేదుట!

జిల్లా కేంద్రానికి దగ్గరలో నున్న యు.పి. స్కూల్లో పనిచేస్తున్న ఇద్దరిని రవీంద్ర, శిరీ షల స్థానాల్లో వేశారు. వాళ్ళు ఎన్నాళ్ళ నుంచో హైస్కూలుకి రావాలని ప్రయత్నిస్తు న్నారుట. ఈ ప్రాంతంలో చౌకగా వచ్చా యని పొలాలు, తోట కొనుక్కున్నారుట. ఇటు ఉద్యోగపు కోరిక, అటు బతుకు తెరువు కోరిక రెండూ మహాకష్టపడి సాధిం చుకున్నారు.

ఆ వార్త విన్న శిరీష స్థాణువే అయింది. పన్నెండు సంవత్సరాలుగా అత్యధిక శాతం ఉత్తీర్ణత సాధిస్తున్న తనను, తన ఉద్యోగ బాధ్యతలో విశ్రాంతి, అపజయం ఎరుగని తనను ఎక్కడికో ట్రాన్స్ఫర్ చేశారు. అదీ ప్రాథమికోన్నత పాఠశాలకి. ఏం చేయాలి? ఇది నిజమేనా? లేక అతడు పొరపాటుగా విన్నాడా?

ఆవార్త విన్న క్షణంలో రవీంద్రకి అన్పిం చింది. తమ దంపతులు ఏ నాయకులనూ ఆశ్రయించుకొని తిరగకపోవడమే ఉద్యోగ





జీవితంలో ఇంత చేదు అనుభవానికి కారణమా? ... అని

భార్యాభర్తలిద్దరికీ ఆరాత్రి నిద్రపట్టేలేదు. ఏం చేయడమా అని ఆలోచనలో మునిగారు. ఒకరినొకరు పలకరించుకోవడానికి కూడా అశక్తులయ్యారు.

ఆరాత్రి ఒంట్లో బావుండలేదని సావిత్రమ్మ పెందరాళే నిద్రపోయింది. ఈ విషయం ఆవిడ చెవిని పడలేదు. ఉదయం లేవగానే లావణ్యను వాళ్ళు అలా ఎందుకున్నారని అడిగింది.

లావణ్య నెమ్మదిగా విషయం చెప్పింది.

ఇంక ఆవిడ ఆ ట్రాన్స్ఫర్లు చేసిన వాళ్ళని తిట్లు మొదలుపెట్టింది. వాళ్ళు పిల్లా పాప ఉన్న వాళ్లేగా అంది. భార్యాభర్తలను చెరో దిక్కూ విడదీసి పాపం మూటగట్టుకుంటారా? అంది. అధికారం ఉందని వెధవపనులు చేస్తే ఆ పాపం కట్టి కుదుపుతుందంది.

లావణ్యకి తల్లి బాధ అర్థమవుతోంది. అయినా "వాళ్ళెవరైనా ఎదురుగా ఉన్నారా? ఇవన్నీ వింటున్నారా? ఎందుకు? అరిచి నీరసపడటం తప్ప" అంది.

ఆవిడ లావణ్యమీద గయ్యిమని "నాబాధకి నేను తిడతాను. తండ్రిలేని బిడ్డను అంతదూరం వేస్తారా? అయినా వాళ్ళకి అవ్వాలిలే. మా స్కూలు, మా క్లాసులు అంటూ చచ్చే చాకిరీ చేస్తారు కదా...! 'బాగా కష్టపడి చెప్పకపోతే ఎలాగమ్మా! తీసికొన్న జీతం అరగవద్దా? మన పిల్లలు బాగుపడాలంటే ఆ పిల్లలని బాగు చేయవద్దా? ' అంటారు గదా!" అంటూ కొడుకు నిత్యం అనే మాటలు అతడిని అనుకరిస్తూ వల్లించింది.

"వెళ్ళమను. వెళ్లి ఇంకా గొడ్డు చాకిరీ చేయమను. అవ్వ. బాగా పనిచేస్తాడని. ఏమూల ఊరికో వేస్తారా? ఇదేం విడ్డూరం. మన పొరుగింటి టీచరుని చూసైనా నేర్చుకోరు. ఆలస్యంగా స్కూలుకి వెళతాడు. పెందరాళే వస్తాడు. వారాలకు వారాలు స్కూలు మానేస్తాడు. "ఏవమ్మాయి మీ ఆయన స్కూలుకి వెళ్ళలేదా? " అని అతగాడి భార్యను అడిగితే, ఆవిడ ఒకటే వంకరలు తిరిగిపోతూ గొప్పగా చెపుతుంది. వాళ్ళ ఆయన మండల ఆఫీసులో పనులు చూస్తాడుట. కనుక పెద్దగా స్కూలుకి వెళ్లనక్కరలేదుట"

రవి వచ్చి సావిత్రమ్మను ఓదార్చాడు. దూరం అయినా తను వెళ్లగలనన్నాడు. ఉదయమే ఆరుగంటలకి బయలుదేరితే సరన్నాడు.

ఆవిడ తల్లి హృదయం అయ్యో! పిచ్చివాడా అనుకుంది. బిడ్డలకు బాగా ఆస్తిపాస్తులు ఇచ్చే తల్లిదండ్రులు ధన్యులు. తన లాంటి నిర్భాగ్యురాలు బాధ్యతలుకాక బిడ్డకి ఏం మిగిల్చింది?

ఎదురు చూసినట్లే, అందరూ అనుకుంటున్నట్లే ఆరోజు స్కూలుకి ఆర్డర్స్ వచ్చేశాయి. టీచర్లందరూ హెడ్‌మాష్టారు టేబుల్ దగ్గర చేరారు. తనకి తొమ్మిదవ తరగతి పాఠం ఉండటం వలన శిరీష, తనకి ఆరవ తరగతి పాఠం ఉండటం వలన శ్యామల క్లాసులో ఉన్నారు. వాళ్ళని హెడ్ మాష్టారు పిలుద్దామనుకుని విరమించుకున్నారు. ఎలాగూ ఒంటిగంటకి వాళ్ళు వస్తారు. ఈలోపు తొందర దేనికి. ఆయనకి మరీ నిరుత్సాహంగా ఉంది. సైన్సు మాష్టారికి ట్రాన్స్ఫర్ అవలేదు. వచ్చి చాలా ఏళ్ళు అవలేదు కదా అనుకున్నారు. మరి ఆ సర్వీస్ ఉన్నవాళ్ళకి కొందరికి చేశారు.

శిరీష రాగానే సైన్సు మాష్టారు విషయం చెప్పారు. వస్తాయని అనుకుంటున్నవే కదా! శిరీష ఆర్డర్ అందుకుని చూసింది. ఆ స్కూలుకి ఎలా వెళ్ళడం? అక్కడ ఉండిపో

వాలా? తిరగలేనా? అంతదూరం వేయడం ఎలా సాధ్యమైంది.

ఆ పూట ఎవరికీ కేరేజీలు విప్పబుద్ధి పుట్టలేదు. ఏదో తిన్నామన్పించి లేచారు. సరే. జరగవలసింది ఆలోచించాలి. కావాలని తమ స్థానాల్లోకి వచ్చేవాళ్ళు ఆలస్యం చేస్తారా? సాధ్యమైతే ఈరోజే లేకపోతే మర్నాడే వచ్చేస్తారు.

సెలవుపెట్టి ఇంటికి వెళ్ళిపోదామా అని అడిగాడు భర్త. ఎందుకు? ఈ ఉన్న కాసేపు పిల్లలతో గడపకుండా. మధ్యాహ్నం ఎలాగో మనసు నిబ్బరపరచుకుని క్లాసుకెళ్ళింది. రవీంద్రకీ చాలా బాధగా ఉంది. అయినా ఎలాగో తనని తను నిగ్రహపరచుకున్నాడు.

పిల్లలు శిరీషని చూసి ఏం మాట్లాడటానికీ సాహసించలేకపోయారు. వాళ్ళల్లో వాళ్ళు ఇలాగ చేద్దాం, అలాగ చేద్దాం అని ప్లానులు వేసుకుంటున్నారు. తమ తల్లిదండ్రులని తిట్టుకుంటున్నారు. వాళ్ళు ఇలాగ వెళ్లిపోకుండా ఎలా ఆపడం?

పదవ తరగతిలోకి వచ్చిన పంకజం, మరో ఇద్దరు పిల్లలు శిరీష దగ్గర ఉన్న చనువు వలన దగ్గరకి వచ్చారు.

"మేడమ్! మేం దశమంతులం కాదు. మాకు నచ్చిన టీచర్ల దగ్గర చదువుకునే భాగ్యం మాకులేదు. పదవతరగతిలో బాగా మార్కులు సాధిద్దామనుకున్నాం. ఇలాగ జరిగింది."

వాళ్లమాటలకి శిరీషమనసు మూగపోయింది. ఏమిటీ పిల్లలు. ఇంతగా గుండె మూలలను కుదుపుతున్నారు. ఎలా తను బేలన్స్ తప్పకుండా ఉండాలి?

సీత కన్నీళ్ళు తుడుచుకుంటూ "మిమ్మల్ని చూడకుండా ఉండలేం, మేడమ్. ఇక్కడే ఉండటానికి ప్రయత్నించండి" అంది.

"మా నాన్నగారు చెప్పారు మన యం.ఎల్.ఏ. ఏం చదువుకోలేదుట. ఏం తెలియదుట. ఈరోజు వాళ్ళువెళ్లి అడుగుతారుట" ఆశగా పంకజాక్షి చెప్పింది.

సింహాచలం వెంటనే అందుకున్నాడు. "మేడమ్ మేం పిల్లలం సంతకాలు పెట్టి ఈ మేడమ్ మాకు కావాలి. మా చదువు పాడు చేయవద్దు" అని కలెక్టరుగారికి, పై వాళ్ళకి, యం.ఎల్.ఏ. అమ్మకి చెప్పినప్పుడు మిమ్మల్ని ఉంచుతారు కదూ!"

వాళ్లల్లో ఏదో చేసెయ్యాలన్న తపన, ఎలాగైనా ఆమెను, సార్‌ను ఆపాలన్న గాఢమైన కోరిక, సినిమాలు చూసిన విజ్ఞానం కలిసి వాళ్లను అలాగ ఆలోచింపచేస్తున్నాయి.

శిరీషకి ఏదో తెలియని నిస్సత్తువ, నరనరంలోనూ నిరుత్సాహం ఆమెని ఆలోచనా విముఖురాలిని చేస్తున్నాయి. ఎలాగో మనసు దిటవు చేసుకొని అన్ని క్లాసులకీ పాఠాలు చెప్పింది.

లాస్ట్ పీరియడ్ ఇంక స్కూల్లో ఉండటం ఆమెవలన కాలేదు. తోటలోకి వచ్చింది. ఎన్ని కాయగూరల మొక్కలో, ఎన్ని పూల మొక్కలో, పాదులెన్నో ఉన్నాయి. వేసవి అయ్యాక చెట్లన్నీ మాడి మసై పోతాయంటారు. మామూలుగా అయితే నీళ్ళు పోసే వాళ్ళు ఉండరు.

కానీ ఆ స్కూలు పిల్లలు బేచ్ బేచ్‌లుగా వచ్చి మొక్కల సంరక్షణ చేసేవారు. పంచాయితీవాళ్ళు ఊళ్ళో బోరింగ్‌లు కుళాయిలు వేయించుకున్నప్పుడు స్కూలుస్టాఫ్ పట్టుదల పట్టి స్కూల్‌కి ఒక బోరింగ్ కుళాయి వేయించుకున్నారు.

ఎటెండర్‌కి మాష్టార్లకున్న శ్రద్ధ తెలుసును. అందుకే అతడు, నైట్‌వాచర్ షికారుగా స్కూలుకి వచ్చేవారు. పిల్లలు వచ్చి





సంరక్షణ చేసేవారు.

రవీంద్రకి అన్నీ ప్లానులే. కాయగూరలు టీచర్స్ కావాలన్నప్పుడు ఇచ్చేవాడు. ఒక పుస్తకం పెట్టి ఎవరు ఏయే కూరలు పట్టు కెళ్ళారో వ్రాసేవాడు. ఆ డబ్బు జీతాలలో టీచర్స్ ఇచ్చేవారు. అలాగ స్కూలు డబ్బుతో గోడ గడియారం, పిల్లలు తాగడానికి రెండు స్టీలు బాల్చీలు నీళ్లకోసం, టీచర్స్‌కి నీళ్ళు తేవడానికి రెండు బిందెలు, మొక్కలకి నీళ్ళు పోయడానికి మామూలు బాల్చీలు ఇలాగ ఎన్నెన్నో కొన్నారు.

పద్దన్నా అవన్నీ శిరీషకి గుర్తు వస్తు న్నాయి. ఇదేదో తన సామ్రాజ్యం. దీని నుండి తనని ఎవరో వేరు చేస్తున్నారు. ఇంత బాగా ఈ మట్టిలో, మొక్కలో, ఏకమై నిశ్చింతగా బతుకుతున్న తనకి ట్రాన్స్ఫర్.

ఈ పిల్లలను వదిలి వెళ్లాలి. ఎలా... ఎలా వెళ్లాడం? ఎంత ఆపుకొందామన్నా కన్నీళ్ళు ఆగలేదు. శ్యామల, జానకమ్మ మేడమ్ ఆమెను వెదుక్కుంటూ తోటలోకి వచ్చారు. చెట్లకున్న కాయలను, పువ్వులను దీక్షగా గమనిస్తూ బాధపడుతున్న శిరీషను చూశారు. శ్యామల అనునయంగా భుజం మీద చెయ్యివేసింది.

జానకమ్మ చిన్న పిల్లలాగ ఏడుస్తున్న శిరీ షను చూసింది. వెంటనే అందుకొంది "ఏమిటమ్మా ఈ పిచ్చి. టీచర్స్ అన్నాక బది లీలు ఉండవా? మా టీచర్స్, ఈ స్కూలు పిల్లలు ఏడవాలి. నీకు ఏడుపు వద్దు. మీలాంటి మంచి దంపతులు టీచర్స్‌గా వీళ్ళకి దొరుకుతారా? నీ జీతం పైసా తగ్గదు. పైగా నాకు ఏమనిపిస్తోందో తెలుసా? నీ సామర్థ్యం, తెలివితేటలు ఇక్కడే వుండిపోకూడదు. హెడ్ మిస్ట్రస్‌గా ఒక స్కూలునే నువ్వు నడపబోతున్నావు. చిన్న వయసులో అధికారం అందరికీ వస్తుందా? "

శ్యామలకి తెలుసును శిరీష ఎందుకు బాధపడుతోందో. ట్రాన్స్ఫర్ విషయంలో కూడా వాళ్ళకి న్యాయం జరగలేదు. ఇద్దరికి చెరొకవైపు ఉద్యోగం అంటే ఎంత కష్టం?

మంచి స్నేహితురాలు దూరమవుతోం దన్న తన బాధ ఎవరికి తెలుస్తుంది? మళ్ళీ ఎవర్నైనా కలిస్తే బాగుంటుందేమో? నిశ్శ బ్దంగా ఒకరినొకరు చూసుకుంటూ కూర్చు న్నారు.

ఇద్దరూ కళాకాంతులులేని మొహాలతో ఇల్లు చేరేటప్పటికి సావిత్రమ్మకి, లావణ్యకి కడుపులో దేవినట్లయింది. భగవంతుడా ఏం సమస్యలు తెచ్చావురా అనుకున్నారు.

ఏదో ఎంగిలిపడ్డామన్పించి దంపతులి ద్దరూ లేచిపోయారు. అతడికి భార్యతో మాట్లాడాలంటే భయంగా ఉంది. ఆమె మౌనం అతడిని భయపెడుతోంది.

లావణ్య అంది "అన్నయ్యా! రేపుగానీ, ఎల్లుండిగానీ ఒకసారి పై అధికారుల దగ్గ రికి వెళ్లండి. ఇద్దరికీ ఒకచోట కాకపోయినా కాస్త దగ్గర స్కూళ్లకి ఇమ్మనండి. ఇంతటితో అయిపోలేదు కదా? మార్పులు, సవరణలు ఉండనే ఉంటాయి"

మర్నాడు వాళ్ళు వచ్చి రిలీవ్ చేస్తారు. ఆగమన్నా వాళ్ళు ఆగరు. వాళ్ళ భయాలు వాళ్ళవి. ట్రాన్స్ఫర్ ఎవైల్ చేసుకొని ఈ సమస్య పరిష్కరించుకోవాలి.

ఆరాత్రి శిరీషకి నిద్ర పట్టలేదు. రెండుగం టల సమయంలో "రవీ" అని పిలిచింది. అతడు నిద్రపోతే కదా! వెంటనే భార్యవైపు తిరిగాడు.

"నేను కొత్త స్కూల్లో చేరను. నా చదువు ఏమవ్వాలి? పదవ తరగతికి పాఠం చెప్పిన తృప్తి నాకు అక్కడ ఉండదు. నేను నా సమస్య పరిష్కరించుకుందామనుకుంటు న్నాను. నేను... నేను ఇది తేలేవరకూ సెలవు పెట్టేద్దామనుకుంటున్నాను. నా



మనసుని చంపుకొని నేను ఆ ఉద్యోగం చేయలేను" ఆపై మాటలు రాలేదు. వెక్కి వెక్కి ఏడుస్తూ ఉండిపోయింది.

రవికి ఎంతో బాధగా అన్పించింది. ఏనాడూ కన్నీరుపెట్టని భార్య ఈనాడు తల్ల డిల్లి ఏడుస్తోంది. ఈ కన్నీటికి శక్తి ఉంటే... ఈమె బాధను తను ఎలా మాన్ప గలడు? తను మామూలు ఉపాధ్యాయుడే. తనకి అధికారులని మంచి చేసుకోవడం తెలియదు. నాయకుల చుట్టూ తిరగడం తెలియదు. డబ్బు పంచడం తెలియదు. తన రక్తనాళాలు, నరాలు నీతి నిజాయితీ అంటూ ఏడుస్తాయి? ఏ ఎండకా గొడుగు పట్టడం రాని తాము ఎలా ఈ సమస్య నుండి బయటపడతారు?

భార్య తల నిమురుతూ మృదువుగా అన్నాడు.

"నీకు ఇష్టంలేని పని ఏదీ చెయ్యొద్దు. నీ మనసుకి ఎలా అన్పిస్తే అలాగ చెయ్యి. నేనుగానీ, ఇతరులుగానీ నిన్ను ఏమీ అనం. తెలిసిందా? పిచ్చి ఆలోచనలు మాని నిద్రపో"

అతడు ప్రేమగా ఆమె తల నిమురుతూ ఉండిపోయాడు. శిరీషలో దుఃఖం కట్టలు తెంచుకొని వచ్చింది. ఆ ఏడుపు వింటున్న ప్రాణి, మౌనంగా తానూ రోదిస్తున్న ప్రాణి ఆ ఇంట్లో మరొకరున్నారు.

ఎలా తెల్లవారిందో తెలియదు. ఉదయం లేచాక ఎంతో నీరసంగా అన్పించింది. అలాగే పనులు పూర్తి చేసుకొంది.

లావణ్య అన్నావదినల దగ్గరకొచ్చింది.

"ఎలాగో కష్టపడి ఇక్కడికి దగ్గర మండ లానికి వేయించు. ఇద్దరూ విడివిడిగా చేయడం కష్టమే. ఇన్నాళ్ళూ కలిసి పనిచే శారు. ప్రతి విషయంలో మంచి ఆలోచిస్తే, జరిగిన దానికి అనుకూలమైన తృప్తి పొంద గలిగితే మనకి బాధ అనేది ఉండదు.

"ఇన్నాళ్ళూ మీరిద్దరూ స్కూలు కబుర్లు చెప్పుకొని ఎరగరు. జరిగినవి ఇద్దరికీ తెలుసు కాబట్టి. ఇప్పుడు రాత్రి కలిశాక ఆవిడ స్కూలు కబుర్లు ఆవిడ, నీ స్కూలు కబుర్లు నువ్వు చెప్పుకోవచ్చును. గంట కాల క్షేపం అవుతుంది. ఉదయంనుండి ఒకరినొ కరు చూసుకోరు కనుక సాయంత్రం ఎప్పు డెప్పుడు ఒకరినొకరు చూద్దామా అని రావ చ్చును"

రవీంద్ర చెల్లెలి మాటలకి అప్రతిభుడ య్యాడు. ఎంత చక్కగా ఆలోచించింది. ఈ పిల్లకి జీవితంలో ఏ బాధా ఉండదు.

రవీంద్ర లావణ్యతో వాళ్ళు ఏమనుకుంటు న్నదీ చెప్పాడు. నెమ్మదిగా కన్పించే వదిన గారిలో ఆమెకి కొత్తవ్యక్తి కన్పించింది. ఆరోజు రవీంద్ర మాత్రమే స్కూలుకి వెళ్ళాడు. శిరీష మెడికల్ లీవు పెడుతు న్నట్లు అప్లికేషన్ వ్రాసి పంపించింది.

పిల్లలందరూ శిరీష స్కూలుకి రాకపోయే సరికి నిరాశపడ్డారు. వాళ్ళు క్రితంరోజే ఇళ్ళ దగ్గర గొడవ పెట్టెయ్యడంతో తల్లిదండ్రులు సర్పంచి దగ్గరికి వెళ్ళారు.

వాళ్ళకి ఒక అనుమానం వచ్చింది. అసలు తమ ఊరంటే నాయకులు ఏమను కుంటున్నారు? తమకి చెప్పకుండా తమ ఊరి స్కూలుకి టీచర్స్‌ని వేయడమా? పైగా ఎలిమెంటరీ స్కూలు వాళ్ళనొకరిని, యు.పి. స్కూలువాళ్ళ నొకరిని తీసుకొని వచ్చి వేయడమా?

వేసేవాళ్ళు ఏ హైస్కూలు వాళ్ళనో వేస్తే ఏం పోయింది? అనుభవం ఉన్నవాళ్ళని తొలగించి, అనుభవంలేని వాళ్ళని అందలం ఎక్కించారు. ఈ విషయంలో ఇతడి పాత్ర ఎంత?

ప్రెసిడెంటు వాళ్ళ మాటలకి అదిరిపో యాడు. ఊరి విషయాలలో అజాగ్రత్తగా





ఉంటే ఉండవచ్చును కానీ మరీ తమ పిల్లల భవిష్యత్తు పాడుచేసుకుంటాడా?

ఆయన ఎంత గోలపెట్టినా వాళ్ళు నమ్మ లేదు. తల్లిదండ్రులు, ఊరి ప్రజలు ఆలోచించి అప్లికేషన్స్ వ్రాసి అందరూ సంత కాలు పెట్టి కలెక్టరుకి, పైఅధికారులకి, యం.ఎల్.ఏ.కి పంపించారు.

వాళ్ళు వెళ్ళి యం.ఎల్.ఏ. నాగమ్మ దగ్గర గోలపెట్టారు. తమ ఊరికి ఇంత అన్యాయం ఎలా చేశావని నిలదీశారు.

ఆవిడ స్టయిలుగా జడవేసుకొంది. ఒక తెల్లగులాబీ పువ్వు చెవిదగ్గర పెట్టుకొంది. నీలం జరీచీర, నీలం జాకట్టు.

"సెక్రట్రీ! నువ్వు సెప్పవయ్యా! మనం ఎవుళ్ళని రికమండ్ సేశామయ్యా! ఆళ్ళు అడుగుతున్న యిసయం సెప్పు"

సెక్రట్రీగా పిలవడానికి, తన పనులు చూడమనడానికి బాగా చదువుకొన్న, ఒక నిరుద్యోగ యువకుడిని పెట్టుకొంది.

"మీ తమ్ముడుగారు వాళ్ళ అత్తవారివైపు చుట్టం అంటూ ఒకరి గురించి చెప్పారు కదమ్మా! వారిని వీళ్ళ ఊరు తెచ్చారు. మీకు గుర్తు లేదుగానీ ఆనాడే ఇది కష్టమైన పనని చెప్పాను"

"అది సరేలెయ్యా! మరొకరిని కూడా ఏయించామని కదా ఈళ్ళు అంటున్నది. నా పేడ, కాగితాలు పట్టుకొనిరా"

సెక్రటరీ నీళ్ళు నములుతూ "పేడ కాదండీ! పేడ్" అని సరిదిద్దాడు.

ఆవిడకి చిర్రెత్తుకొచ్చింది. "సూడు, నువ్వు 'మేడమూ' అని పిలవాలని సెప్పలేదయ్యా! ఎప్పుడూ ఆ మాట వదిలేత్తావే"

అతడికి ఒళ్ళు మండింది. కానీ ఏమంటాడు? బయటికి వెళితే ఈమాత్రం సంపాదనా ఉండదు. కాస్త నలుగురూ పరిచయం అయ్యాక మరొకరి దగ్గరికి వెళ్ళిపోవాలి. ఈలోపు ఉద్యోగం వస్తే మంచిదే.

"ఏం సెక్రెట్రీవయ్యా! అన్నింటికీ నీళ్ళన ములుతావు. పనులన్నీ సూడలేక నా పని సూడు. ఈళ్ళూరు టీసర్ల ఇషయం సెప్పు"

ఈవిడ సొంతంగా పనులు చేసుకోవడమా! అటు మరిది, ఇటు తమ్ముడు ఈవిడని కీలుబొమ్మను చేసి ఆడిస్తూన్నారు కదా! అనుకున్నాడా సెక్రటరీ.

ఆ ఇద్దరూ పనులకోసం వచ్చిన పార్టీలదగ్గర డబ్బు గుంజేస్తారు. ఆ పని, వాళ్ళ విషయాలు చేయాలని పట్టుపడతారు. అందులోనున్న కష్టసుఖాలు సెక్రటరీ చెప్పినా వినరు.

"మేడమ్! మీ ఆయనగారి దూరం చుట్టం గారిని మనకి దగ్గరలోకి తెద్దామనుకొన్నారు కదమ్మా! వీళ్ళ ఊరే వేయమని మనం ఛైర్మన్‌గారికి చెప్పామమ్మా!" అన్నాడు.

ఈలోపు ఆవిడ తండ్రి "పెంటమ్మా! ఈళ్ళకి ఆ కాలువల కాంట్రాక్టు కావాలిట, కాస్త చూడమ్మా" అన్నాడు.

ఆవిడకి తండ్రిమీద కోపం ముంచుకొని వచ్చింది. ఎవరు వచ్చినా పెంటా, పెంటమ్మా అంటూ తయారవుతారు. నాగేశ్వరీ అంటూ పిలవకపోతేమానె, నాగమ్మా అనచ్చుకదా!

ఆవిడ చిరాకుగా ఆయనని చూస్తూ "నిన్ను పొలంకాడికి ఒకపాలి ఎల్లమన్నానుగదా! ఎల్లు. ఈ ఇసయాలు నేను సూత్తా" అంది.

ఊరివాళ్ళు అంతసేపు ఉండటమూ ఆవిడకి చిరాకుగా ఉంది. చివరికి చచ్చు తెగేసినట్లు చెప్పింది. "మరి మాం పదవులలో అధికారంలో నున్న ఏళ్ళల్లో మా వాళ్ళు అది సేయమని, ఇది సేయమని అడుగరా! సేయకపోతే బందుగులూరుకొంటారా? అందుకే సేయాల్సివచ్చింది"

ఊరి అతను ఒకడు ధైర్యంగా అన్నాడు. "అది కాదమ్మా! బొత్తిగా అనుభవం లేనివా ళ్ళని మా ఊరి హైస్కూల్‌కి వేశారు. గుంటలు ఒకటే గోల, మా పరీక్షలు పోతా యంటూ"

నాగమ్మకి విషయం అర్థమైపోయింది. అయినా వాళ్ళని మాట్లాడనీయదలచుకో లేదు.

"సూడండి. పని సేయకపోతే అనుబవం ఎట్టావత్తంది? "

ప్రెసిడెంటు చిరాగ్గా అన్నాడు "బావుం దమ్మా మా ఊరిమీదేనా కొత్త ప్రయోగం. ఊరివారు నన్ను తిడుతున్నారు. వాళ్లని మార్చండి. పాతవాళ్ళు బాగా చెపుతారు. ఈ ఏడాది ఉంచండి"

నాగమ్మకి తను చేసిన పనిని ఎవరైనా బావుండలేదంటే చిన్నప్పటినుండీ కోపం ఎక్కువ. తన తెలివితేటలమీద, కష్టంమీద నమ్మకం ఎక్కువ.

అందుకే సూటిగా అతడిని చూస్తూ "ఆళ్ళని ఎలా మళ్ళీ తెస్తామయ్యా! ఛైర్మన్ గారు ఇనుకోరే. ముందే ఆలోసించి కాగి తాలు ఇయ్యండి అంటూ సెప్పారు. ఈళ్ళకి బాగా సెప్పమని సెపుతాలే"

ఊరివారు, ప్రెసిడెంటు కాళ్ళీడ్చుకొంటూ ఇవతలికి వచ్చారు. ఆ సాయంత్రమే శ్రీని వాసు ఆవిడ పార్టీకి చెందిన మరొక చిన్న నాయకులిద్దరినీ స్నేహితుడైన టీచర్‌ని తీసి కొని వెళ్లాడు. ఆ టీచర్ ఆవిడకి చిన్నప్పటి నుండీ తెలుసును.

నాగమ్మ వాళ్ళందరినీ చూసి మొహానికి నవ్వు పులుముకొంది. నలుగురు నాలుగు పనులమీద తన దగ్గరకి రావడం ఇష్టమే. కానీ మరీ ఒకే పనా? ఆవిడకి ఒక్కసారి తమ చుట్టాలు తనకి తెచ్చిన పట్టుచీర, బంగారం గుర్తు వచ్చాయి.

చుట్టాలైనా ఏది మానారు! డబ్బుకి డబ్బు, కానుకలికి కానుకలు రెండూ ఇచ్చారే!

"ఏంటి కత? అందరూ ఒక్కసారి దండె త్తినట్లు వచ్చేశారే"

శ్రీనివాసుతో వచ్చిన టీచర్ అన్నాడు. "చూడండి! మీరు ఈయన స్నేహితుడిని, భార్యను చొరొకవైపూ ట్రాన్స్ఫర్ చేశారు. ఇద్దరినీ ఒకవైపు వేయలేదు. ఆవిడ ఇన్నాళ్ళు హైస్కూల్‌లో చెపితే, ఇప్పుడు యు.పి. లో వేశారు. వాళ్ళని మార్చమని ఒకదగ్గరికి వేయమని అడగడానికి వచ్చాం"

ఆమె ఒక్క క్షణం ఊపిరి పీల్చుకొంది. "ఇప్పుడు అన్నీ అయిపోయాయయ్యా! మరి ఎలా అవుద్ది. అయినా ఆ మేష్టరు కానీ భార్య కానీ ఈడకి రాలేదు. ఆళ్ళ గురించి నాకేటి తెలుస్తుంది. ...అదేదో అంట..." అంటూంటే సెక్రటరీ "లాంగ్‌స్టాండింగ్" అంటూ అందించాడు.

"నాకు తెలియదనుకొంటున్నావా! ఆ... నాంగ్ స్టాండింగ్ కనుక అక్కడినుండి తీత్తున్నానని పెద్దాయన సెప్పారు. నన్నేటి సెయ్యమన్నారు!"

శ్రీనివాసుకి ఒళ్ళు మండింది. "ఆ టీచర్లు చాలా మంచివాళ్ళండీ! వాళ్ళకి బాధ్యతలు బోలెడున్నాయి. పెద్ద కుటుంబం. ఇద్దరినీ ఇలాగ విడదీస్తే కష్టం. కాస్త చూసి దగ్గ రలో సర్దండి" అని ఎలాగో ఓర్పు తెచ్చుకొని అడిగాడు.

"ఈసారి కాళీలు అయితే మళ్ళీ తెద్దాం లేవయ్యా! ఇప్పుడు కొత్తోళ్ళు వచ్చి సేరి పోరా? మార్చడం ఎలా? " అంది. వచ్చిన పెద్దవాళ్ళు ఉదయం ప్రాణం తినేశారు. ఇప్పుడు వీళ్ళు అని పళ్ళు నూరుకొంది.

ఛోటానాయకులు ఊరుకోలేదు. వాళ్ళు కాస్త ఇంటర్‌వరకూ, డిగ్రీవరకూ చదివిన వాళ్ళు. "ఛైర్మన్‌గారికి మీ లిష్టు ఇచ్చేటప్పుడు





మనందరం కూర్చుని అనుకోవచ్చు కదా! మీరు వినరు. మీకు తోచింది చేస్తారు. మీ తమ్ముడుగారు, మరిదిగారు ఏది చెపితే అది చేస్తారు. ఇలాంటి పనులు రెండు చేశామంటే మరెప్పుడూ అధికారంలో ఉండం"

వాళ్ళు అంత గట్టిగా మాట్లాడటం ఆవిడకి నచ్చలేదు. "మీరు మాత్రం నాకు సెప్పకుండా మీకు కావలసిన పనులు పెద్దాయన చేత సెప్పి సేయించుకోలేదా? " అంది.

ఆమె నోరు చిన్నదికాదు. గట్టిగానే అనడంతో వాళ్ళకి చిరాకు వచ్చింది. ఒకే పని మీద వెళుతున్నప్పుడు అందరూ కలిసి వెళ్ళవచ్చును. కానీ వాళ్ళు ఒప్పుకొన్నా ఆమె కలవదు.

ఆమెను ఆశ్రయించుకొన్న మరిది,

తమ్ముడూ ఒకలాంటివారే. వెధవ పనులు అన్నీ చెప్పి చేయిస్తారు. డబ్బు... డబ్బు... డబ్బు... అది తప్ప మరొకటి వాళ్ళకి అవసరంలేదు.

ఇప్పుడు వాళ్ళు ఏం చేయగలరు? ఎలాగైనా ఆమెను తీసికెళ్ళి ఛైర్మన్‌గారికి చెప్పించాలి. అందుకే ఆ నాయకులు నెమ్మదిగా ఓర్పు తెచ్చుకొని అన్నారు.

"ఎలాగో ప్రజలు కోరుతున్నారు కనుక మనం ఎక్కడి వాళ్ళనక్కడ వేయమని చెపుదాం. దానివలన నష్టంలేదు. అలాగే చిక్కలూరుపేట తెలుగు పండిట్ రిక్వెష్టుచేసిన ప్రదేశం ఒకటి మనం వేయించిన ప్రదేశం మరొకటి. ఆ ఊరివాళ్ళు ఒకటే గోల. ఇలాంటివి చేశామంటే మనల్ని తిట్టినతిట్టు తిట్టకుండా తిడతారు. మరి ప్రజలలోకి వెళ్ళలేం"

ఆమె దాంతో గయ్యిమని లేచింది. "ఆ టీచరు ఆ ఊరినుండి కదలడానికి ఒప్పుకొన్నాడు కనుక ఆ వూరు కావాలన్న బాబుకి ఏయించాం. కదలడానికి ఒప్పుకొన్నవాడు కోరిన సోటికే ఎళ్ళాలా? కొంచెం పైఊరు వేయించాం. దానికే అలిసిపోతాడా? మరీ యిసిత్రం"

శ్రీనివాసుతో వచ్చిన టీచరు అన్నాడు "మీరు మీకు కావలసిన నియోజకవర్గం కాకుండా మరొకటి ఇస్తే ఊరుకొంటున్నామా? ప్రజలను రాజధానికి తీసికెళతాం. గోలపెట్టిస్తాం. అలాగే వాళ్ళును. మీరు ఒకసారి బయలుదేరితేబావుంటుంది"

ఈలోపు షాహుకారు ఒకడు ఏవేవో మోసుకొని వచ్చాడు "అమ్మా! నాగేశ్వరి గారూ! మీకు 60 శాతం ఇస్తాను. నాకు బిల్డింగ్స్ కాంట్రాక్టు ఇప్పించండి. నేనైతే మీదయవలన ఏదో చిన్న వ్యాపారం చేసుకొంటున్నాను కానీ మా పెద్దోడు ఏ పనీ లేకుండా ఉన్నాడు. మీరే ఆ హౌసింగ్ బోర్డ్ కాంట్రాక్టు ఇప్పించాలి"

యం.ఎల్.ఎ అమ్మగారి కోటాకింద అధికార వర్గం కొన్ని కాలనీ ఇళ్ళను వెనకబడిన వారికోసం మంజూరుచేసింది. ఆ కాంట్రాక్టు ఇప్పించమని వాడిగొడవ.

నాగేశ్వరికి తనని పూర్తిపేరుతో పిలిస్తే ఎంతో ఇష్టం. తనని పొగిడితే ఎంతో మక్కువ. వాళ్ళు ఏం చేయమన్నా చేస్తుంది. పైగా ఇన్ని కానుకలు. అయితే ఇస్తానన్న పర్సంటేజ్ నచ్చలేదు.

అందుకే ధాటీగా అంది "అదేంటయ్యా! నాకు మానేసి లాభాలు అన్నీ నువ్వు పొందుతావా? ఈల్లేదు. నాకు పిఫ్టీ కావాలయ్యా మరీ తగ్గిస్తే ఒప్పుకోను"

వచ్చిన షాహుకారు తెల్లబోయాడు. ఆవిడ అనేది ఏమిటో అతడికి అర్థమవలేదు. పక్కనున్న సెక్రటరీ నెత్తిబాదుకొన్నాడు. తను మాట్లాడుతాడు కదా! మధ్యలో అన్నీ తెలిసినదానిలాగ దూరుతుంది.

అతడు నెమ్మదిగా అన్నాడు. "ఫిఫ్టీకన్నా

సిక్స్టీ పర్సెంట్ ఎక్కువ మేడమ్‌గారూ"

ఆమె ఒక్కక్షణం తడబడినా, పైకి కన్పించనీయకుండా "ఆ... షావుకారుగారు మనోళ్ళు. ఆయన పని రాసుకో" అంటూ ఆర్డర్ జారీచేసింది.

వస్తోంటే శ్రీనివాసుకి, మిగిలిన వాళ్ళకి వాళ్ళ మాటలు బాగానే వినబడ్డాయి. వాళ్ళు ఆవిడ మాటలకి నవ్వుకోసాగారు.

సాయంత్రం శ్రీనివాసు ఇల్లు చేరేటప్పటికి రవీంద్ర వచ్చి ఉన్నాడు. "ఈరోజు ఎక్కడికి వెళ్ళావు? కనబడలేదు? "

శ్రీనివాసు అతడి ప్రశ్నకి బదులివ్వకుండా "రిలీవ్ అయిపోయావా? " అని అడిగాడు.

"కొత్తవాళ్ళు వచ్చారు. రిలీవ్ అవక తప్పదు కదా! "

శ్రీనివాసు ఒక్క నిట్టూర్పు విడిచాడు. వాళ్ళ ఉద్యోగాలకన్నా ఈ మున్సిపాలిటీ ఉద్యోగమే మేలు. వాళ్ళు ఊళ్ళో స్కూళ్ళే తిప్పుతారు. ఇలాగ జిల్లా అంతా తిరగమనరు. కానీ రవి ఆ మాటలు ఒప్పుకోడు. ఎందులో ఉన్న బాధలు అందులో ఉన్నాయంటాడు. ఆరునెలలకి ఒకసారి కానీ జీతాలు ఇవ్వరు. జీతాలు నెలనెలా రాకపోతే సామాన్యంగా జీతంమీద ఆధారపడినవాళ్ళు ఇబ్బంది పడక తప్పదు.

భూములుండీ, ఆస్తి ఉండి వచ్చిన టీచర్స్‌కి మాత్రం జీతాలు మిగులుతాయి, ఏ ఖర్చుకో పనికివస్తాయని సరదా పడతారు! శ్రీనివాసు అన్నట్లు అతడిలాంటి టీచర్స్ వలన పాలవాళ్ళు, కొట్టువాళ్ళు కూడా ఆరునెలలకో, మూడునెలలకో ఒకసారి జీతాలు పుచ్చుకోవడానికి అలవాటుపడతారు.

మర్నాడు శిరీష, తాను అధికారులను, ఛైర్మన్‌గారిని కలవడానికి వెళుతున్నామని చెప్పాడు. శ్రీనివాసుకి అనుమానమే. వాళ్ళు ఇద్దరూ మొహమాటస్థులు. ఎలా కలుస్తారో, ఏం చేస్తారో?

జిల్లాపరిషత్ భవనం తిరునాళ్ళలాగ ఉంది. ఈ ట్రాన్స్ఫర్లు సజావుగా అవలేదని దాన్నిబట్టే అర్ధమౌతోంది. అన్యాయం జరిగి వచ్చిన వాళ్ళు కొందరైతే, తమకి కావలసిన చోట్లు రాలేదని ఫిర్యాదులతో కొందరు కన్పిస్తున్నారు. ప్రతీ టీచర్ ఎవరినో ఒకరిని ఆశ్రయించుకొని బతకాలా? లేకపోతే ఈ సంస్థలో జీవించడానికి అనర్హుడా?

ఇద్దరు యం.ఎల్.ఎ.ల కేండిడేట్లు ఒకే ప్రదేశాన్ని కోరితే పాపం ఛైర్మన్‌గారు ఏం చేస్తారు? అధికారులు ఏం చేస్తారు? ప్రజలు చూస్తే ఆ టీచర్ సరిగ్గా చెప్పడంలేదని, స్కూలుకి గైర్హాజరని గోల. అప్లికేషన్స్ బోలెడు గుప్పిస్తున్నారు.

నాయకులు మాత్రం "మా మేష్టరు మా ఊళ్ళోనే ఉండాలి. పనున్నప్పుడు ఏదో మేం పిలుస్తాం. అంతమాత్రానికే ఈ పిటిషన్లు. మీరు వాటిని పట్టించుకోవద్దు" అంటారు.

ప్రతీవాళ్ళూ రాజకీయనాయకులే. మా వాడు నేను చెప్పిన ప్లేసుకి రావాలని ఒకరంటే, అదెలాగ కుదురుతుంది మా వాడే రావాలని మరొకరు. సర్పంచుల దగ్గర నుండీ మంత్రుల వరకూ ప్రతీ విషయానికీ పట్టుపట్టడమే. వాళ్ళని ఆశ్రయించుకొన్న వాళ్ళకోసం, వాళ్ళని వంధి మాగదుల్లాగ పొగిడేవాళ్ళకోసం ఈ మధ్యవర్తిత్వం.

అధికారులు మాత్రం తక్కువ తిన్నారా? ఉద్యోగస్తుల దగ్గరవాళ్ళు పుచ్చుకొనే లంచాలు కొన్ని. వాళ్ళ జేబులు తడిపిన వారికోసం ఏ బాధ అయినా పడతారు. వాళ్ళ చుట్టూ తిరగని వారికోసం ఏ సహాయం అందించరు. పైగా రూల్స్ ఒప్పుకోవు అంటారు.

సి.ఇ.ఓ గోవర్ధనం గదిలో రవీంద్ర ఉన్నాడు. మొదట తను వెళ్ళి అవసర




మంటే భార్యను పిలుద్దామనుకొన్నాడు. ఆయన గదిలో కొందరు గుమాస్తాలు. కొందరు ఎవరో బయట వారూ ఉన్నారు.

అప్పటికి అరగంట ఎదురు చూశాక రవీంద్రకి ఆయన దర్శన భాగ్యం లభించింది. ఆయన ఒక్కసారిగా రవీంద్రవైపు ఒక చూపు చూశారు.

"మీరు వచ్చిన పని చెప్పండి. ట్రాన్స్ఫర్ల విషయం అయితే నేను ఏం చేయలేను. మిగిలిన ఏ పి.యఫ్ గొడవో అయితే చెప్పండి"

జరిగినవే ట్రాన్స్ఫర్లు. అపసవ్యమైన బదిలీలు. అవైతే ఏం చేయలేడుట. పి.ఎఫ్. అయితే చేస్తాడుట. ఈయనే చెయ్యాలా పి.ఎఫ్.కి. ఒక నెల రాకపోతే ఆ లోన్ మళ్ళీ నెలలో వస్తుంది. తాము దాచుకొన్నది తమకి ఇవ్వక తప్పదు కదా!

రవీంద్ర తన ఆలోచనలను అణచుకొని "మేం కోడూరు జిల్లాపరిషత్ హైస్కూల్లో మాథ్స్, ఎస్.ఎస్. అసిస్టెంట్స్‌గా పనిచేస్తున్నాం సార్! మా భార్యాభర్తలని చెరొక చోటికీ ట్రాన్స్ఫర్ చేశారు. ఇద్దరివీ పొంతన లేని ఊళ్ళు. చెరోదిక్కున ఉన్నాయి. నా భార్య విషయంలో అయితే మరీ ఘోరం. ఆవిడని అప్పర్‌ప్రైమరీస్కూల్లో వేశారు. ఆవిడ ఇన్నాళ్ళుగా హైస్కూల్‌లోనే చేసింది. దయచేసి మళ్ళీ హైస్కూల్‌లో వేయండి. మేం మిమ్మల్ని ఒకే స్కూలు వేయమని అడగడంలేదు. కనీసం దగ్గరదగ్గర స్కూళ్ళు ఇవ్వండి" అని అన్నాడు.

సి.ఇ.వోగారు క్లర్కువైపు చూశారు. అతడు వెంటనే అందుకొని "వాళ్ళ విషయం మనం చెప్పినా ఆ యం.యల్.ఎ ఒప్పుకోలేదు. మనం ఏం చేస్తాం? " అన్నాడు.

సి.ఇ.వోగారు "చూడండి మేష్టారూ! మా చేతిలో ఏం లేదు. అంతా ఆ రాజకీయనాయకుల చేతుల్లో ఉంది. వాళ్ళు చెప్పినట్లు మేం వినాలి. పెట్టమన్నచోట సంతకం పెట్టాలి. ఆవిడ బంధువులను దగ్గరలోకి తేవాలని ఆవిడ కాగితం ఇచ్చి చేయించుకొంది. ఛైర్మన్‌గారు చేశారు. అంతే మేం ఏమీ చేయలేం"

రవీంద్ర ఆయనని బతిమాలాడు. తనకి ఏ రాజకీయ నాయకులూ తెలియరన్నాడు. ఆయనే జాలి చూపాలన్నాడు. సి.ఇ.వో చిరాకుగా అన్నాడు. "నన్నేం చేయమంటారు? నా డ్యూటీ నన్ను చేయనిస్తున్నారా? భార్యా భర్తలను ఒక్క దగ్గర వీలు కాకపోతే దగ్గరలో వేద్దామయ్యా అన్నా ఆయన వినలేదు. ఆయన కొచ్చిన రికమెండేషన్లు అలాంటివి. నామాట వినండి. ఆవిడను హాయిగా చేరిపొమ్మనండి. అప్పర్‌ప్రైమరీలో వర్క్ తక్కువ. హాయిగా కూర్చుని జీతం తీసుకోమనండి. ఎందుకొచ్చిన గొడ్డు చాకిరీ. నన్నడిగితే మన జీతం మనకి వస్తుందంటే ఎలిమెంటరీ స్కూలు బెల్ కొట్టమన్నా సరేననవచ్చును"

ఆ మాటలకి రవీంద్ర ఇంక ఓర్చుకోలేకపోయాడు. "విద్యారంగం బాధ్యత పడవలసినవారు మీరు మాట్లాడవలసిన మాట లేనా ఇవి. ఒక దేశభవిష్యత్తు ఆ దేశక్లాసు రూంలలో రూపుదిద్దుకొంటుంది అని ఎంతో విశ్వాసంతో అన్న రాధాకృష్ణన్‌గారి మాటలు మరిచారా?

"అనుభవంగల మమ్మల్ని దూరం తోశారు. పదవతరగతి ఈనాటివరకూ చెప్పకుండా ఇరవై ఏళ్ళు చేసిన వాళ్ళను తెచ్చి హైస్కూల్‌లో అందలం ఎక్కించారు. ఇది అన్యాయం కాదా? మాకు సమర్థత ఉంది. ఇన్నేళ్ళు మంచి రిజల్ట్సు తెచ్చాం. ఇంకా మా సమర్థత చూపించే అవకాశం ఇవ్వండి" అన్నాడు.

"నాకోసం ఇంకా చాలామంది వచ్చారు. మీ విషయంలో నేను ఏమీ చేయలేను. నా




సలహా అడిగితే చేరిపొమ్మని చెపుతాను అంతే" అని సి.ఇ.వో నిక్కచ్చిగా చెప్పాడు.

ఆరోజు ఛైర్మన్‌గారి దర్శనం అవలేదు. యం.ఎల్.ఎలతో వచ్చిన టీచర్లు మాత్రం చూడగలిగారు. ఎడ్జస్టుమెంటు అవక ఆయన కొన్ని అటూ, ఇటూ చేశారు. వాళ్ళు అది కుదరదంటారు.

రవీంద్ర ఎంత ప్రయత్నంచేసినా లోపలికి వెళ్ళడానికి కుదరలేదు. వరుసగా ఒకరి తరువాత ఒకరు తోరణాలమాదిరి లోపలికి వెళ్ళేవాళ్ళే కన్పించారు.

ఒక టీచర్ రవీంద్రతో అన్నాడు. "నా దగ్గర వెయ్యి రూపాయలూ తీసుకొన్నారు. మా పిల్లని మారుమూల వేశారు. ఆడపిల్ల పెళ్ళికానిది. అంతదూరం నడిచివెళ్ళి ఎలా ఉద్యోగం చేస్తుంది? మీరే చెప్పండి. మగ వాళ్ళమే నడవలేం. అదేం నడుస్తుంది? "

ఆయన ఆ ముసలి వయసులో కూతురి కోసం ఇంకా తిరగడం చూసి శిరీష బాధప డింది.

ఆయన శిరీషతో అన్నాడు "ఏం చేస్తాం? చెప్పు తల్లీ! ఉద్యోగం మానెయ్యమని ఆడపి ల్లలను అనలేని రోజులు వచ్చాయి. ఉద్యోగం ఉన్నా, చదువు ఉన్నా, కట్నం సమర్పించుకొంటేనే కానీ పెళ్ళి అవదు. ఆ పెళ్ళి అయ్యేవరకూ నాలాంటి బీద బ్రాహ్మ డికి ఈ యాతన తప్పదు"

అక్కడికి బంట్రోతు వచ్చి అన్నాడు. "తాతగారూ? మిమ్మల్ని గుమాస్తాగారు రమ్మనారు"

ఆయన అతడిని "నాయనా ఈరోజు ఛైర్మ న్‌గారి దర్శనం అవదా? " అనడిగారు.

"అవదు సార్! ఆయనకి మరొకచోట మీటింగ్ ఉంది. మళ్ళీ రేపు రండి" అన్నాడు.

కాసేపటికి ఆయన తిరిగి వచ్చారు. "వాళ్ళకి ఇచ్చిన వెయ్యి రూపాయలుకి దిక్కు లేదు. వాళ్ళు ఏదో చేస్తారుట. ఏం చేస్తారో? ఇంక ఈ గుమాస్తాలకి సమర్పిం చాలి కాబోలు"

ఆయన గొణుక్కొంటూ వెళుతూ ఈ దంపతులకి చెప్పి వెళ్ళిపోయారు. ఇంక ఆరోజుకి అవదని రవీంద్ర భార్యను తీసికొని ఇంటికి బయలుదేరాడు.

మర్నాడు ఉదయమే నిద్రలేచిన శశాంక తండ్రి వీపుమీద వాలిపోయాడు. "నాన్న గారూ! రాత్రి నేను మీకోసం ఎంతసేపు చూశానో? అత్త మీరు వచ్చేటప్పటికి ఆలస్య మవుతుందంటే పడుకుండిపోయాను.

రవీంద్ర కొడుకు బుగ్గమీద ముద్దుపెట్టుకొ న్నాడు. "రాత్రి నీకోసం స్వీట్లు, పళ్ళు తెచ్చాను, చూశావా? " అని అడిగాడు. ఈలోపు కూతురు వచ్చింది. తన స్కూలు విషయాలు చెప్పి, నోట్సులు కొనాలని చెప్పింది. శశాంక తనకీ నోట్సులు కొనాల న్నాడు. తనకి బూట్లు కొనిపెట్టమన్నాడు"

ఈ హడావుడిలోనే లావణ్యకి బి.యిడిలో చేరడానికి ఇంటర్వ్యూకి రమ్మని పిలుపు. ఇప్పుడు ఆ అమ్మాయిని అక్కడికి తీసికె ళ్ళాలి. రవీంద్ర మర్నాడు లావణ్య పని గురించి శ్రీనివాసుకి చెపితే ఆ విషయం రవికి వీలవకపోతే తాను చూస్తానన్నాడు.

మళ్ళీ ఒక్కడూ అధికారులను, ఛైర్మన్‌గా రినీ కలవడానికి వెళ్ళాడు. ఛైర్మన్ దర్శనం ఎలాగో దొరికింది. తనకి, తన భార్యకి జరి గిన ట్రాన్సుఫర్స్ గురించి తన బాధ అతడు వెళ్ళబోసుకొన్నాడు.

ఆయన ఇప్పటికి రెండురోజులనుండీ ఇదే గొడవలో ఉన్నాడు. "అందరికీ రోడ్డుపాయిం ట్‌లు వేయాలంటే ఎలా కుదురుతుంది మేస్టారూ! ట్రాన్సుఫర్లు చేసి తీరాలని పైనుండి మాకు ఒత్తిడి, అందరినీ వేసెయ్యడం అయి పోయింది. ఏం చెయ్యగలం? " అని

జవాబు ఇచ్చారు.

రవీంద్ర నిస్పృహాయంగా చూస్తూ అన్నాడు. "నాపై మా కుటుంబబాధ్యత ఉంది. ఆఖరి సంవత్సరం చదువుతున్న తమ్ముడు, చెల్లెలు, మా అమ్మగారు, నా కుటుంబం ఈ ట్రాన్స్ఫర్ వలన అవస్థపడతాం. నా భార్యను మీరు దగ్గరలోనున్న హైస్కూల్‌కి వేయండి. నన్ను తేకపోయినా పర్వాలేదు. ఆవిడను దగ్గరలోకి వేయండి"

ఛైర్మన్‌గారిదగ్గరలో కూర్చున్న ఆ ప్రాంతపు జిల్లాపరిషత్ కార్యవర్గ సభ్యుడు, అక్కడనున్న యం.ఎల్.ఎవైపు సదభిప్రాయకంగా చూశాడు.

"ఒక పని చేస్తే సమస్య ఉండదు" ఆయన ఛైర్మన్‌వైపు, రవీంద్రవైపు చూస్తూ అన్నాడు. "ఈ మేష్టారిని కూడా ఇటువైపు దగ్గర మండలానికి ఇచ్చెయండి. ఆ స్థానంలో ఈయన అల్లుడిని వేసెయ్యవచ్చును.

రవీంద్ర అప్రతిభుడయ్యాడు. తనని మరో మండలానికి బదిలీ చేయించడమా? అదీ అవతలి వ్యక్తి అల్లుడికోసం.

ఆ యం.ఎల్.ఎ ఆత్రుతగా "వీళ్ళిద్దరి చేత మీకు మ్యూచువల్ అప్లికేషన్ ఇప్పించనా?" అన్నాడు.

ఛైర్మన్ ఇబ్బందిగా చూస్తూ "మీరు తొందరపడవద్దు. ఈయనకి ఇటు రావడం ఇష్టమో, కాదో అడగాలి. ఒకరికి మళ్ళీ చేశామంటే అందరూ పట్టుకొంటారు" అన్నారు.

వాళ్ళ వాళ్ళకి హైస్కూల్‌లో వేయాలని ఉందిట. లిష్టులో ఆ పేరు ఎలా మరిచిపోయారో తెలియదు. ఇప్పుడు ఎలాగైనా తన వర్గమనిషికి ఫేవర్ చేయాలి.

రవీంద్ర ఈ ఒక్క సంవత్సరం తమని అక్కడ ఉంచమని బతిమాలాడు. ఆయనకి రవీంద్ర స్వభావం అర్థమైంది. ఏ రాజకీయ నాయకులనూ తేకుండా తనని చూడటానికి వచ్చాడు. దానికి సాయం ప్రజలనుండి వచ్చిన అప్లికేషన్ ఉంది.

సాధారణంగా ఒకరు సమర్థుడు, మంచి వాడంటే నలుగురు కాదంటారు. అలాంటిది ఈ టీచర్స్ విషయంలో ఊరందరూ సమర్థులు, స్కూలు పనిపాటలు నిర్వహిస్తారని రాశారు. ఆ విషయం గుర్తుంది. కానీ వాళ్ళను ఉంచెయ్యాలంటే ఆ నాగేశ్వరి లిష్టు వాళ్ళని వెనక్కి పంపాలి. ఆవిడ ఊరుకొంటుందా? "

మరొక యం.ఎల్.ఎ. విసుగ్గా చూస్తూ "ఈ ట్రాన్స్ఫర్స్ ఈ ఏడాది మానేస్తే ఏమయ్యేది? " అన్నారు.

ఛైర్మన్ తప్పనిసరిగా అన్నారు "అధిష్టానం నిర్ణయించాక తప్పుతుందా? వాళ్లు ఏం చెపితే అది వినాలి"

ఆయన చిరాకుగా అన్నాడు, "మనం ఇక్కడివాళ్లం. ఇక్కడ ప్రజలతో తిరుగుతాం. వాళ్లు వద్దన్నది చేస్తే ఎలా? మళ్లీ నెగ్గాలా? వద్దా? జగన్నాధం చెప్పిన ఏకోపాధ్యాయ టీచర్‌ని బదిలీ చేయించడం కోసమని ఒక వితంతువును అక్కడికి వేశారు. ఆవిడ పాపం ఒకటే ఏడుపు. ఆ కొండల్లో ఆడది ఏం ఉద్యోగం చేస్తుంది? మీరుగట్టిగా కాదని, ఆవిడను వేయకుండా ఉండవలసింది"

ఛైర్మన్ సాలోచనగా చూశారు. నిజమే... ప్రతీ నాయకుడు తమకి కావలసిన టీచర్లే తమ దగ్గర ఉండాలంటారు. ప్రజలు ఆ సింగిల్ టీచర్ స్కూల్‌కి రెగ్యులర్‌గా రావడం లేదని పిటిషన్లు, అధికారులు ఎన్నోసార్లు పనిష్మంట్లు ఇచ్చారు. అయితే ఏం?

అతడికి మంత్రి తాలూకా అండ ఉంది. ఆ నెపంపై ట్రాన్స్ఫర్ చేయించి, తమకి దగ్గరలో వేయమన్నారు. ఇదీ రాజకీయం. ఈ




అన్యాయం వలన మరొక స్త్రీ ఆ స్థలానికి బదిలీ అయింది. ఆమె గోడు వినేవారెవరు?

ఎవరి కేండిడేట్సును వాళ్లు వదులుకోరు. వాళ్లు వీళ్లకి వెన్నెముకలు. అసలు రాజకీయాలు నడుపుతున్నది వీళ్లా, వీళ్ల వెనుకనున్న టీచర్లా? ఆయనకి అర్థంకాదు.

ఎవరు అధికారంలో ఉంటే వాళ్ల వాళ్లు సుఖపడుతున్నారు. వీళ్లకోసం వెధవ పనులు చేయలేక చేస్తూ, అవతలవాళ్ల ఉసురు తాము పోసుకొంటున్నారు.

ఆ వితంతువు వచ్చి ఏడ్చి విషయం చెపుతున్నపుడు ఆ మంత్రిగారు కూడా ఎందుకో పనుండి ఛైర్మన్‌తో మాట్లాడటానికి వచ్చారు.

ఆయన మధ్యలో కల్పించుకొని అన్నారు "చూడమ్మా! అన్నింటిలో సమానత్వం కావాలంటూ గోల చేస్తున్నారు మీ ఆడవాళ్లు. మరి ఉద్యోగాలు సుఖంగా చేయాలంటే ఎలా? కొన్నాళ్లు కష్టపడాలి. అతడు ఇన్నాళ్లూ అక్కడ చేశాడుకదా!"

ఆవిడ అడగవలసిన విషయం ఒకటి అడిగేస్తే బావుంటుందనుకుంది. "ఎన్నాళ్లు కష్టపడాలి బాబూ? మీరు అందలం దిగిపోయేవరకూ చాలా? " అని.

కాని అలా అడిగే తెలివితేటలు ఉన్నదైతే ఇలాగ నిస్సహాయంగా బాధపడదు.

ఛైర్మన్‌గారు ఇంక చెప్పేది లేనట్లు తేల్చేశారు. "మీరు మీ అధికారులను ముందుగా కలిసి వాళ్లకి డబ్బు ఇచ్చినా బాగుండేది. మీ ఇద్దరి విషయంలో వాళ్లు కిమ్మనకుండా ఊరుకొన్నారు. వాళ్లకి మీ యం.ఎల్.ఏకి మధ్య ఏం అవగాహన కుదిరిందో? ఆవిడ కేండిడేట్స్‌ని ట్రాన్స్ఫర్ చేశాం. అయిందేదో అయింది. ఆవిడను ఇప్పుడు చేరిపొమ్మనండి. తర్వాత చూద్దాం"

బస్సులో కూర్చున్నాడేకానీ రవీంద్రకి ఈ సంఘంమీద ఎంతో చిరాకుగా ఉంది. డబ్బు... డబ్బు. ఎంత డబ్బు అడ్డదారులలో సంపాదిస్తే వీళ్ల కడుపులు నిండుతాయి? ఈ లోకం నుండి పోయేటప్పుడు ఏం పట్టుకెళతారు? ఈ అధికారాలు హోదాలు శాశ్వతం కాదని ఎందరికి తెలుసు? ఈ నాలుగు రోజుల భోగం చూసుకొని గర్వపడిపోతున్నారు.

బస్సులోనున్న మరొక మాష్టారు రవీంద్రను విషయం ఏమైందని అడిగారు. వాళ్లందరికీ ఈ విషయం తెలిసి బాధపడుతున్నారు. "మీ ఆవిడని పోష్టింగ్ ఇచ్చిన చోటచేరవద్దని చెప్పండి. ఆ మండలానికి వెళ్లారంటే ఇప్పట్లో మళ్లీ రాలేరు. ఇలాగే కొన్నేళ్లు చెయ్యాలి. జాయినవకుండా ఒక నెల ఉంటే రీఆర్డర్స్ ఇస్తారుకదా! చూద్దాం"

అదీ ఆయన ఇచ్చిన సలహా. తనని కూడా మరొక మండలానికి బదిలీ చేస్తానన్న విషయం చెప్పాడు.

ఆయన కోపంతో అన్నాడు, "చేస్తారు. ఏదైనా చేస్తారు. వాళ్లు చేయాలనుకొన్న విషయాల్లో అన్యాయం జరిగినా పట్టించుకోరు. రూల్స్ పక్కకిపోతున్నా పట్టించుకోరు. అందుకే అపహాస్యం పాలవుతున్నారు. మీరు వెంటనే జాయినయిపోండి. ఎలాగో వెళ్లండి. వెళ్లలేకపోయినప్పుడు మానెయ్యండి. అప్పుడు వాళ్లకే విసుగు వచ్చి ట్రాన్స్ఫర్ చేస్తారు"

వీళ్ల పక్కనే కూర్చుని ఈ సంభాషణంతా వింటున్న ఆయన నవ్వారు. "నిజమే ఈ వ్యవస్థతో సర్దుకొనిపోవాలి. లేదా ఎదురు తిరగాలి"

ఇద్దరూ ఆయనని పరిచయం చేసుకొన్నారు. ఆయన ఇరిగేషన్ డిపార్టుమెంటులో అసిస్టెంట్ ఇంజనీర్‌గా చేస్తున్నారుట. ఆయన రంగంలో జరుగుతున్న

అన్యాయాలపై ఆయన గోల పెట్టారు. "రాజకీయ నాయకులతో చస్తున్నామండీ! వాళ్లు మా మాట వినరు. వాళ్లు చెప్పినట్లు చేస్తే మా ఉద్యోగాలు పోతాయి. మా భార్యాబిడ్డలు అన్యాయమైపోతారు. వాళ్ల మాట కాదంటే ట్రాన్స్ఫర్లు, కక్ష సాధింపు చర్యలు"

ముగ్గురూ ఏవో విషయాలు మాట్లాడు కుంటూ ప్రయాణం ప్రారంభించారు. కోర్టు లున్నాయి కనుక ఉద్యోగస్తులు కొందరు బతుకుతున్నారు. లేకపోతే శంకరగిరి మాన్యాలు పట్టవలసిందే.

ఆయన తన ట్రాన్స్ఫర్ విషయంలో కోర్టుకే వెళ్లారుట. అవతలివాళ్ల నోరు మూయించి ఆర్డర్ తెచ్చుకొన్నారుట. వీలైతే రవీంద్రను కోర్టులో కేసు వేయమన్నారు.

ఇంటికి వచ్చాక భార్యతో విషయాలన్నీ చెప్పాడు. ఆమె కొద్దిసేపు ఆలోచించి అంది.

"ఒక టీచర్‌గా మీ అభివృద్ధికోరాలి. ఒక భార్యగా భర్త ఉన్నతినే కోరాలి. కనుక మీరు ముందు మీ ప్లేస్‌లో చేరిపోండి. అప్పుడు మిమ్మల్ని వాళ్లు ట్రాన్స్ఫరు చేయ లేరు. లేకపోతే నా మూలంగా మీరు వెనక్కి రావలసి వస్తుంది. ఇంక నా సంగ తంటారా? కోర్టుకి వెళితే ఎలాగుంటుందా అని ఆలోచిస్తున్నాను. అయితే డబ్బూ ఖర్చు విషయం త్వరగా తేలదు. వీళ్లు కక్షగా మనల్ని సాధించవచ్చు మనం ఇప్పుడే రిటైర్ అవంకదా! పై అధికారులతో తగాదా పడటం మంచిదా? "

రవీంద్ర భార్యవైపు రెప్పవేయకుండా చూశాడు. ఈ పరిస్థితికి తట్టుకొని ఎలా నిలబడుతోంది? పైగా తనను చేరిపొమ్మని సలహా ఇస్తోంది.

స్నేహితుడు కూడా రవిని చేరిపొమ్మని సలహా ఇచ్చాడు. వీలు చూసుకొని తమ సంఘనాయకులను కలుద్దామన్నాడు. తల్లి మర్నాడు మంచి రోజని చెప్పడంతో రవీంద్ర స్కూలుకి వెళ్లిపోయాడు.

శిరీషకి ఏమీ తోచలేదు. ఈపాటికి ఏ ఆంగ్లేయ విప్లవమో, ఏ అమెరికా విప్లవమో చెప్పుకోవలసిన సమయం. ఇలాగ నిస్తే జంగా, నిరుత్సాహంగా కాలం నడుస్తోంది.

లావణ్య ఇంట్లో ఉంటే శిరీషను నిముషం వదలడం లేదు. వదిన బాధపడుతోందని వెనక వెనకే తిరుగుతోంది.

సాయంత్రం అత్తగారు దెబ్బలాడితే స్నానంచేసి తెమిలి భర్తకోసం ఎదురుచూడ సాగింది. ఎనిమిది గంటలవుతుండగా రవి వచ్చాడు. ఉదయం రెండున్నర గంటలు, సాయంత్రం రెండున్నర గంటలు ప్రయాణం. బస్సు పాస్ తీసుకొంటాన న్నాడు.

శిరీష ఎదురుగా వెళ్లి "స్కూలు బావుందా? హెడ్మాస్టర్ బావున్నారా? ఈ రోజు ఏ క్లాసు తీసుకొన్నారు? " అని అడి గింది.

సావిత్రమ్మ కోడలి ప్రశ్నలకి విస్తుపో యింది. మంచినీళ్లు పట్టుకొచ్చి కొడుక్కి ఇచ్చింది. "బయటనుండి వచ్చిన వాడికి మంచినీళ్లైనా ఇవ్వకుండా ఇన్ని ప్రశ్నలా? ఆ స్కూలు ఎలా ఉంటే తమకేం? నాలుగు జీతం రాళ్లు తెచ్చుకోవాలి కనుక వెళ్లాలి"

రవీంద్ర మంచినీళ్లు తాగి గ్లాసుకిందపె ట్టాడు. శిరీషకి తను చేసిన తప్పు అర్థ మైంది. బయటినుండి వచ్చినాయన ఆలనా పాలనా చూడవద్దా? అనుకొంది. వెంటనే లోపలికి వెళ్లి కాఫీ కలిపింది.

రవీంద్ర స్నానంచేసి వచ్చి కూర్చున్నాక అప్పుడు అన్నాడు "ఈ రోజు నాకేం బావుం డలేదు. శిరీ! బహుశా ఇన్నేళ్ల తర్వాత ఒంటరిగా ఉద్యోగం చేయడం ఏదోలాగ





ఉంది. నువ్వే గుర్తువచ్చావు. ఒంటిగంటకి భోజనమే చెయ్యబుద్ధి కాలేదు"

శిరీష కళ్లల్లో నీళ్లు తిరిగాయి. చప్పున తుడుచుకొని "అందరం పెందరాళే భోజనాలు చేసేద్దాం" అంది. శశాంక వచ్చి "నాన్నా! నాకు ఈ లెక్కలు రావడంలేదు" అన్నాడు. శ్వేత ఇంగ్లీషు పోయమ్ చెప్పమంది.

వాళ్లు తండ్రిని అలా అడుగుతోంటే శిరీష మొహం పాలిపోయింది. తను తన ఆలోచనలలో తన బాధలో ఉండిపోయింది. కనీసం వాళ్లు ఏం వర్క్ చేస్తున్నారో చూడలేదు. పాపం అలిసిపోయి వచ్చిన అతడు ఆ పని చూస్తున్నాడు.

లావణ్య పిల్లలని కసిరింది నన్ను అడగకపోయారా అని.

వాడు వెంటనే అందుకొన్నాడు "నువ్వు అమ్మ దగ్గర కూర్చున్నావుకదా! అమ్మని విసిగించవద్దన్నావుకదా! నిన్ను కూడా విసిగించకూడదేమోనని అడగలేదు"

లావణ్య వాడి నెత్తిమీద ఒకటి చిన్నగా మొట్టింది. "అతి తెలివి తేటలు. ఇవన్నీ ఆ బాబయ్యగాడు నేర్పినవేకదా!"

వాడు బాబయ్యనంటే ఊరుకొంటాడా? "మా బాబయ్యవి మంచి తెలివితేటలు. అందుకే కాలేజీ ఫస్టు"

పక్కవాళ్ల పాప వచ్చి ఫోను వచ్చిందని చెప్పింది. వెంటనే పిల్లలు "అదిగో బాబయ్యే చేస్తున్నాడు" అని ఒకరు, బాబయ్యతో నీ విషయం చెపుతానని ఒకరు పరుగెత్తారు.

లావణ్య పిల్లల వెంట తనూ వెళ్లింది.

ఆవతలినుండి అశోక్ మాట్లాడుతున్నాడు. పిల్లలిద్దరూ పోటీపడి ముందుగా ఫోను తీసేసుకొన్నారు. అత్తకివ్వండిరా అన్నాక అప్పుడు ఇచ్చారు. ఫోనులో అశోక్ ఒకటే ప్రశ్నలు.

"ఇంటి విశేషాలు ఏమిటే? వదిన ట్రాన్స్ఫర్ ఏమైంది? వాళ్లిద్దరినీ ఒక చోటవేశారా? "

లావణ్య నెమ్మదిగా ఇక్కడి విషయాలు చెప్పింది. అతడు "ఎలాగే? ఇప్పుడెలాగ? " అన్నాడు.

"అన్నయ్య ఈరోజు చేరాడు. వదిన లీవ్‌లో ఉంది. రేపు మళ్లీ ఛైర్మన్‌గారి దగ్గరికి వెళుతుంది"

"లావణ్యా! వాళ్లున్న పరిస్థితులలో ఇలాగ అడగడం సిగ్గుగా ఉందే? అడగక తప్పడం లేదు"

అతడు పడుతున్న బాధ ఆ స్వరంలో వ్యక్తమవుతోంది. "నేను ప్రాజెక్టు వర్క్ చేయాలి. 10 వేలు అయినా ఖర్చవుతుందే? అన్నయ్యకి ఎలా చెప్పడం? హైదరాబాద్‌లో మా ఫ్రెండ్ నాన్నగారు పనిచేస్తున్న కంపెనీ ఉంది. ఆ కంపెనీలో చేద్దామని మా ఆలోచన"

లావణ్య అన్నయ్యకు ఈ విషయం చెపుతానని, అతడిని వీలుచూసికొని వచ్చి డబ్బు తీసుకొని వెళ్లమంది. తాను మళ్లీ వారం వస్తానని అతడు చెప్పాడు.

లావణ్య తిరిగి వస్తూ విషయం ఎప్పుడు చెప్పాలా అని ఆలోచిస్తోంది. ఈలోపే శశాంక తండ్రి చెవిలో ఊదేశాడు.

"మరేమో బాబయ్యకి డబ్బు కావాలంట. మిమ్మల్ని ఎలా అడగడం అని అంటున్నాడు"

రవి లావణ్యరాగానే తమ్ముడు చెప్పిన విషయం ఏమిటని అడిగాడు. లావణ్య తడబడుతూనే విషయం వివరించింది. రవి ఈ ఆఖరి సమయంలో మొహమాటపడితే ఎలాగని మందలించాడు.

ఆరాత్రి అతడికి నిద్రపట్టలేదు. ఒకవైపు



తమ్ముడి చదువు చివరలో నుండటం, చెల్లి ట్రైనింగ్ గొడవ, ఇది చాలదన్నట్లు తెగని భార్య ఉద్యోగ సమస్య. ఆమె మనసు ఉద్యోగ విషయంలో బాధపడుతోంది. తను ఆ సమస్యని చక్కదిద్దలేకపోయాడు.

తనకు ఎప్పుడూ సమస్యలే. తన జీవితంలో శాంతి, సంతోషం శిరీషే. ఆమె బాధ పడుతోంటే తనకి తృప్తి ఎలా లభిస్తుంది? ఏనాడూ దేవుడిని ప్రార్థించనివాడు శిరీషను తనకి జతచేయమని వందదేవుళ్లకి మనవి చేసుకొన్నాడు.

లావణ్య పెళ్లి బాధ్యత నిర్వహించాలి. తమ్ముడు, చెల్లి జీవితంలో సెటిలైతే తమకి ఇంక బెంగ ఏముంటుంది? శ్వేత, శశాంక పుట్టాక తనని ఆపరేషన్ చేయించుకోవద్దని తల్లి గొడవ. మరొక కొడుకుని కానీ కూతురినికానీ చూడమంది. తల్లి గొడవ తట్టుకోవడం కష్టమే అయింది.

శిరీష మాత్రం బెదరలేదు. "మాకు ఇప్పుడు ఇద్దరు అబ్బాయిలు, ఇద్దరు అమ్మాయిలు ఉన్నారు. ఇంకా ఎందుకు బిడ్డల కోసం ప్రాకులాడాలి? వాళ్ల నలుగురినీ బాగా పెంచితే చాలు" అంటూ లావణ్యను, అశోక్‌ను తన బిడ్డలుగా చూపింది.

రాత్రి వాడు ఫోను చేశాడనగానే విషయం చెప్పమని నిలదీసింది. శిరీషకి ఏం చేసినా తక్కువే. తన సమస్యలు, బాధలు అన్నీ పంచుకొంది. తనకన్నా ఎక్కువగా వారిని ప్రేమిస్తుంది.

తనుకూడా ఏ మెడికల్ లీవోపెట్టి ఆమె ఉద్యోగ విషయం చూద్దామంటే కుటుంబ పోషణ కష్టమవుతుంది. ఒక జీతమైనా వస్తే కొంత తెమలవచ్చును.

మర్నాడు శిరీష అతడితో చెప్పి జిల్లాపరిషత్‌కి బయలుదేరింది. చాలా రోజులకి





ఒంటరిగా బయటికి రావడం, ఇదే! పెళ్లి అయాక ఏ పనున్నా అతడు చేయడం, ఎక్కడికైనా వెళ్లవలసివస్తే ఇద్దరూ వెళ్లడం.

రవి బస్‌స్టాండ్‌కి వచ్చి ఎక్కించాడు "ధైర్యంగా వెళ్లగలవా? జాగ్రత్తగా వాళ్లతో మాట్లాడగలవా?" అంటూ పదిసార్లు ప్రశ్నించాడు.

తనకి ధైర్యం? ఎటువంటి అనుభవాలు గతంలో లేవు. ఇప్పుడు తెచ్చుకోవాలి. అతడి చేత ఎన్నాళ్లు సెలవు పెట్టిస్తుంది?

బస్సులో మరొక స్టేజిలో ఎక్కినావిడ శిరీషని చూసి పలకరింపుగా నవ్వింది. శిరీషకి ఆవిడ ఎవరో తెలియదు. బిడియంగా తనూ నవ్వింది.

ఆవిడ హిందీ పండిట్‌గా చేస్తున్నదట. మీరు "రవీంద్రగారి భార్యకదూ!" అని అడిగింది. శిరీష బిడియంగా సమాధానాలు చెప్పింది.

ఆవిడ చాలా కలుపుగోలుగా మాట్లాడారు. ఆవిడ భర్త ఏక్సిడెంటులో పోయారుట. ప్రభుత్వం హిందీ పండిట్‌గా ఉద్యోగం ఇచ్చారుట. ఆవిడకి ఒక అవిటి బాబు, పాప. బాబుకి ఇంకా అనారోగ్యాలు. డాక్టరు అవసరం ఎప్పుడూ ఉంటుందిట.

ఆవిడని ట్రాన్స్ఫర్ చేసిన ఊరుకి బస్సు ఒకటే వెళుతుందిట. అక్కడ ఉండటం కుదరదు. ఆ ఊరువెళ్లే బస్సు ఉదయం ఒకసారి, సాయంత్రం ఒకసారి వెళుతుంది.

ఉదయం వెళ్లాలంటే అయిదు గంటలకి బయలుదేరాలి. సాయంత్రం 3.30 గంటలకే ఆ ఊరినుండి రిటర్న్ అవుతుంది. స్కూలుకి అంత ముందుగా వెళ్లడం కుదరదు. అంత ముందుగా స్కూలు వదిలి బస్సుకోసం రాలేరు. ఆటో సదుపాయాలు లేవు. నడవాలంటే చాలా కష్టం. తర్వాత బస్సులు ఎక్కినా సగం దూరమే ప్రయాణం చేయడం అవుతుందిట.




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

ఆగస్టు చతుర నవల ఆర్తి

..............................

సమీక్షకుని పేరు : ..............................

చిరునామా : ..............................

..............................

..............................

..............................

# ఏరిన ముత్యాలు

★ న్యాయం గెలుస్తుందన్న మాట నిజమే, కాని గెలిచిందల్లా న్యాయం కాదు.

–శ్రీశ్రీ

★ నాకు అందినది నాది. నాకు అందనిది మనది. –కాళోజీ

★ ఉదార బుద్ధులను కుంగతీసేదీ, కృషిని నిర్వీర్యం చేసేది, దృఢనిర్ణయాన్ని నిస్పృహగా మార్చేది 'పేదరికం'

–ఎడిసన్

★ నిజమైన సంతోషం కొరకు బయట ఎక్కడా వెదుకాడకు. అది నీ అంతరాత్మలోనే ఉంటుంది.

– సెనేకా

★ చవట దగ్గరి డబ్బు రేపో మాపో విడాకులు తీసుకోనున్న భార్య వంటిది.

–ఆంగ్ల సామెత

★ గడచిపోయిన కష్టాలను స్మరించుకో, అనుభవిస్తున్న సుఖాల తీయదనం పెరుగుతుంది.

–కాల్టన్

★ ప్రకృతివలెనే నిశ్శబ్దంగా భగవంతుని ధ్యానించాలి. అతని ప్రేమకు చేరుకోవాలి.

–మదర్‌థెరిసా

★ వ్యాకోచం అంతా జీవితం. సంకోచం అంతా చావు.

–వివేకానందుడు

★ ప్రేమ ఇస్తుందే కాని, ఇమ్మని కోరదు. ప్రేమ బాధలను సహిస్తుందేగానీ ప్రతీకారం తలబెట్టదు.

–మహాత్మాగాంధీ

★ ఈ ప్రపంచంలో నీకేమీ లేదని చింతించకు. మానవజన్మ అనే మహాశక్తినీ, సత్యాన్ని జోడించితే అంతా నీ పాదాక్రాంతమవుతుంది.

–వేదసూక్తి

★ బంగారంవంటి అమూల్యమైన ఉపదేశాలు భవిష్యత్కాలానికి, భావితరాలవారికి, బహుఅక్కరకు వచ్చే భాండాగారం.

–రాజగోపాలచారి

★ నిజాయితీతో కూడిన ధైర్యం ఎల్లప్పుడూ న్యాయాన్నే పాటిస్తూ ఉంటుంది. రానున్న ప్రమాదాలను ముందుగానే ఊహిస్తుంది. ఫలితం ఎలాంటిదైనా దాన్ని మౌనంగానే స్వీకరిస్తుంది.

–వాసన్

సేకరణ : చింతా కృష్ణమోహన్

దీనికి సాయం ఇంట్లో ముసలి అత్తమామలు. కొడుకు ఉద్యోగం కోడలు చేస్తోంది కనుక తమని పోషించే బాధ్యత ఆ పిల్లదే అంటారుట వాళ్లు.

"మీ బావగారు, మరిది ఎవరూ లేరా?" శిరీష కొద్దిగా ఈ లోకంలోకి వస్తూ అడిగింది.

"మరిది, మరిది భార్య తెలివైన వాళ్లమ్మా! అక్కడ ఉంటే సదుపాయంగా చూడరు. సాధించి వదులుతారు. పైగా ఒంటరిదైన వదినకి పెద్దదిక్కు ఎవరు? అంటూ వాళ్లని నాకే వదిలేశారు. ఎప్పుడో చుట్టంచూపుగా అత్తమామలే వెళతారు"

"ఎక్కడ దొరికింది ప్రభుత్వానికి ఈ ఊరు? మీరే ఆ స్కూల్‌కి బలైపోవాలా? మగవాళ్లే భయపడతారే ఆ పెదనందిపాడు వెళ్లడానికి. ఆడవాళ్లని ఎలావేశారు?"

"అందుకే వెళుతున్నానమ్మా! ఎక్కడికైనా దగ్గర్లోకి డిప్టేషన్ వేస్తారేమో అడుగుతాను"

ఆవిడ బాధ చూస్తే శిరీషకి జాలివేసింది.

ప్రపంచంలో అసహాయులు, పేదలు, అడుగడుగునా బాధింపబడుతూండటం సహజమైపోయింది. ఆవిడ తన భర్త పోయాక ఆ ఉద్యోగం పొందడానికి ఎన్ని సార్లు ఎందరి చుట్టూ తిరిగిందో, ఎంతెంత లంచాలు ఎందరికి ఇచ్చిందో అన్నీ చెప్పింది.

"ప్రజల చేత, ప్రజల కొరకు, ప్రజలవలన నడుస్తున్న ప్రభుత్వాలివి. ప్రజల బాగోగులు చూస్తామని ప్రమాణాలు... ఎవరివి చూస్తున్నారు? ఎక్కడ సమానత్వం న్యాయం ఆచరించబడుతోంది? ఎక్కడ చూసినా దోపిడీ, ఎక్కడ చూసినా అరాచకత్వం, ఎక్కడ చూసినా అవినీతి, ఎక్కడ చూసినా లంచగొండితనం.

ఏ అసహాయులకి అండదండలుగా ఈ ప్రభుత్వాలు ఉంటున్నాయి? ఈ నాయకులు చెప్పేవి వట్టి నీతులు. ఆచరణలో అవి సున్నా. ప్రజల కష్టసుఖాలలో పాలు పంచుకొనే నాయకులు అతికొద్దిమంది. ప్రజలను దోచుకొనే నాయకులే ఎక్కువ.

రాసిన రాజ్యాంగాన్ని గౌరవించరు. తాము నిర్మించుకొన్న భవనాలు ప్రజల ఉసురు తగిలితే కూకటివేళ్లతో పెళ్లగించబడతాయని వాళ్లకి ఎప్పుడు తెలుస్తుంది?

ఒక గూటి పక్షులు ఒకేచోటికి చేరతాయంటారు. అలాగ ఆ ఇద్దరు ఆడవాళ్లు ఒకరి విషయాలొకరు పంచుకొంటూ ప్రయాణం సాగించారు.

ఆరోజు జనరల్ బాడీ మీటింగ్ కనుక అందరూ అక్కడ సమావేశమయ్యారు. మండలాధ్యక్షులు, యం.ఎల్.ఏలు, జిల్లాపరిషత్ సభ్యులు అందరూ కళకళలాడుతున్న మొహాల్తో వచ్చేశారు.

లోపల గదిలో ఒకటే గందరగోళం. "మేం ఇచ్చిన లిష్టు ఏం ఫాలో అయ్యారు? ఒక చోట వెయ్యమంటే ఒక చోటవేశారు" నాయకుల అసహనం.

"మీరు ఒక చోటికి నలుగురిని వెయ్యమంటే ఎలా? అందరూ అనుకొని లిస్టు ఇవ్వమంటే ఇవ్వరు" పెద్దాయన దెబ్బలాడారు.

ఆయన అందరినీ కలుపుకొని వెళ్లాలి. ఎవరినీ నొప్పించకుండా ఎవరూ పైకి రిపోర్టు చేయకుండా చూసుకోవాలి. ఒక పోస్టుకి నలుగురూ నలుగురిని రికమండ్ చేస్తే ఎలా? బదిలీలు అలాగే అవుతున్నాయి. అవి బదిలీలు కావు. రాజకీయ నాయకుల లీలలు. వాళ్లు వాళ్లనాశ్రయించుకొన్న వాళ్లకోసం చేస్తున్న మాయలు.

వాళ్ల కేండిడేట్స్ దూర ప్రదేశాలకి వెళ్లరాదు. రోడ్‌పాయింట్‌లు మాత్రమే చెయ్యాలి. తమ చుట్టూ తిరిగే వీలు

ఉండాలి! అలాగే వేయించుకొనే వరకూ వాళ్లు నిద్రపోరు.

బదిలీలవలన బాధపడుతున్నది ఉద్యోగ స్థులైతే వాళ్లు ఒంటరిగా వెళ్లి అధికారులకి ఫిర్యాదు చేసుకోవచ్చుకదా! అలాగ జర గదేం? ఒక్కరి వెనకాల నలుగురు ఉద్యోగ స్థులు. నాయకులను ఆశ్రయించుకోకపోతే వాళ్లు బతకలేరా? తమ సమస్యలు తెము ల్చుకోలేరా? ఇవన్నీ శిరీష మెదడును దొలు స్తున్న ప్రశ్నలు.

కరుణమ్మ, శిరీష ఒక పక్కగా సోఫాలో కూర్చుండిపోయారు. నాయకులు ఒక్కొ క్కరూ లోపలికి వెళుతున్నారు. వాళ్లతో వెనకాల టీచర్లు, కాంట్రాక్టులు కావాలనుకొ నేవాళ్లు ఇలాగ పనులుకోసం ఒకటే రద్దీ.

తమకి ఎవరూ లేరు. తమ నిజాయితీ ఎవరూ గుర్తించలేదు. ఈ నాడు తమ వృత్తిధర్మం ఎవరికీ అక్కరలేదు. మధ్యాహ్నం ఒంటిగంటయిపోయింది.

"అయ్యగారు మినిష్టర్‌గారి దగ్గరికి వెళు తున్నారు. మీరు భోంచేసి రండమ్మా!"అటెం డర్ చెప్పాడు. అతడికి వాళ్లను చూస్తే జాలివేసింది. ఉదయం అనగా వచ్చారు. లోపలికి వెళ్లలేకపోయారు. వాళ్లతో వచ్చిన నాయకుల వెనుక వాళ్లు అందరూ వెళ్లగలి గారు. వీళ్లు ఎవరినీ తీసుకొని వచ్చినట్లు లేదు.

కరుణమ్మ అతడి దగ్గరకు వచ్చి "కాస్త మమ్మల్ని లోపలకి పంపించుబాబూ! మా బాధ చెప్పుకోవాలి"

"సాయంత్రం వీటి గురించే ఆళ్లందరూ కూకుని మాటాడుకొంటారటమ్మ! తప్పక వెళ్దురుగాని" హామీ ఇచ్చాడతను.

ఇద్దరూ బయటనున్న చెట్టు దగ్గరకి వచ్చారు. "మీరు భోజనం చేయండి" శిరీష వాడిపోయిన మొహం చూసి జాలిపడి కరు ణమ్మ అంది.

"మీరు చేయరా? " అంది శిరీష.

"పనిపూర్తి చేయిదేవుడా ఈ రోజు ఉప వాసం చేస్తాను అని అనుకొన్నానమ్మా! బయలుదేరేటప్పుడు టీ తాగుతాలే!"

ఆవిడ మాటలకి శిరీష జాలిపడింది. తనూ భోజనం చేయనంటే ఆవిడ దెబ్బ లాడి, హోటల్‌కి తీసుకెళ్లి టిఫిన్ పెట్టిం చింది.

ఇద్దరూ మళ్లీ వచ్చి పూర్వపు స్థలంలో కూర్చున్నారు. మళ్లీ ఛైర్మన్‌గారు వచ్చేవ రకూ ఎదురు చూపులు. సాయంత్రం నాలు గున్నర ప్రాంతంలో లోపలికి వెళ్లగలిగారు.

శిరీష ఆయనకి నమస్కారంచేసి తను ఎవరో చెప్పింది. తనకు చేసిన ట్రాన్స్ఫర్ గురించి చెపుదామని ఎంత ప్రయత్నించినా ఒకటే దుఃఖం. ఎంత ఆపుకొందామన్నా ఆమెకి వీలవలేదు.

ఛైర్మన్‌గారు శిరీష ఏడుపుచూసి తడబ డ్డారు. "టీచర్‌గారూ! ముందుమీరు కూర్చోండి. విషయం పూర్తిగా వింటాను. మొదటమీరు బాధపడటం మానెయ్యండి" అంటూ ఆయన ఎంత బుజ్జగించి చెప్పినా ఆమెకి ఏడుపు తగ్గలేదు.

కన్నీళ్లతో మెరుస్తున్న కళ్లను పైకెత్తింది. అవి అచ్చం నీళ్లతో నిండిన రెండు నీలి, నల్లని మేఘాల్లాగ ఆయనకి అన్పించాయి.

"మీరు.." అంటూ శిరీష ప్రారంభిం చింది.

"మీరు ఏం చేశారో తెలుసా? వృత్తిని ప్రాణంగా, తపస్సుగా భావిస్తున్న నన్ను కిందికి లాగారు. ఒక హైస్కూల్‌లో సమ ర్థవంతంగా పనిచేసి, సెంట్‌పర్సంట్ రిజల్ట్సు పదవ తరగతిలో ప్రతి సంవత్సరం సాధిస్తున్న నన్ను పక్కకి తోశారు. ఇది బావుందా? ఇది సమంజసమైన పనా? " శిరీష గొంతులో దుఃఖం సుడులు తిరుగు





తోంది. కన్నీళ్ళు ధారాపాతంగా బుగ్గలపై నుండి ప్రసరిస్తున్నాయి.

ఆయనకి ఆ అమ్మాయిలో పసిపాప కన్పిస్తోంది. తను ఆమెను ఎంతో గాయపరిచానని అర్థమైంది.

ఆయన నెమ్మదైన స్వరంతో అన్నారు "గ్రామాల్లో ఉపాధ్యాయులే రాజకీయాలు నడుపుతున్నారు. ఒకే ప్రదేశంలో వారు ఉండటంవలన బలోపేతులవుతున్నారు. అలాగ జరగకుండా ట్రాన్స్ఫర్స్ చేయండి. అని నన్ను పై నాయకులు ఒత్తిడి చేశారమ్మా! ఆ పని నిర్వహణలో ఈవిధంగా చేయక తప్పలేదు"

శిరీష ఆయన మాటలకి చివ్వుమని చూసింది. "మావలన రాజకీయాలు బలోపేతం అవుతున్నాయా? చెప్పండి. ఏనాడైనా మీ వద్దకి వచ్చానా? పోనీ ఇది అడగండి. ఇక్కడ ఉన్న యంఎల్ఏలుగానీ మీ మెంబర్లుగానీ నాకు తెలుసునా అడగండి. ఎవరో కొందరు పనిచేయలేని చాతకాని బద్ధకస్తులు పబ్బం గడుపుకోవడానికి మీ నాయకుల వెనుక తిరుగుతారు. నాకేం ఖర్మండీ! నేనేకాదు నాలాంటి వృత్తిని నమ్ముకొని కూపస్థమండూకాల్లాగ బతుకుతున్న వాళ్లు చాలామంది ఉన్నారు. మాకు మాత్రం ఈ ఎదురు దెబ్బలు తప్పడంలేదు"

ఆయన నవ్వారు. "అయితే టీచర్స్కి ట్రాన్స్ఫర్లు చేయకూడదా? " అని అడిగారు.

శిరీష వాడిగా చూసింది. వెంటనే అంది. "చెయ్యండి. ఎవరొద్దన్నారు? "

ఆయన తెల్లబోయారు. "మరి నువ్వు టాన్స్ఫర్స్ అవుతున్నాయనేకదమ్మా ఇలాగ బాధపడుతున్నది" ఆయన సంభాషణను పక్కతోవపట్టించి, తను చేసిన పని సరైనదే అని ఆమెచేత అన్పిద్దామనుకొన్నాడు.

"మీ సమర్థత మరొకరికి కూడా ఉపయోగపడుతుందికదా" శిరీష ఏం భయపడకుండా అంది. "ఇప్పుడు నన్ను టాన్స్ఫర్ చేశారు. 14 ఏళ్లు పదవతరగతికి చెప్పిన నేను ఇప్పుడు 6, 7 తరగతులతో కుస్తీ పట్టాలా? నా ప్రతిభ ఏమవుతుంది? ఒక స్థాయికి అలవాటుపడ్డ నేను క్రిందికి దిగాలా? ఏమిటి మీరు చేసిన ట్రాన్స్ఫర్ ఎప్పుడూ పదవ తరగతి చెప్పనివాళ్లని ఆ క్లాసుకి, మా స్కూలుకి వేశారు. భార్యాభర్తలను ఒకచోట లేదా వీలైనంత దగ్గరలో వేయాలని జీవో ఉంది. అయినా మీకు అవసరంలేదు. మా క్లాసురూం, మా స్కూలూ తప్పు ఎరగని మా వలన రాజకీయాలు బలపడుతున్నాయా? ఎందుకండీ ఈమాటలు"

ఆయన ఆమె మాటలకి అప్రతిభుడయ్యాడు. నెమ్మదిగా తేరుకొని, అనుభవజ్ఞుడు కనుక "అప్పర్ ప్రైమరీ స్కూల్ అయితే మీకే లాభం కదండీ! హాయిగా రెస్ట్ తీసుకోవచ్చు మీ జీతం మీకు వస్తుంది."

శిరీష మొహం చూస్తుంటే తను మాట్లాడిన విషయం ఎంత అప్రియమైనదో ఆయనకి అర్థమైంది.

అక్కడే కూర్చున్న యం.ఎల్.ఎ. నాగమ్మకి ఒంటికి కారం రాసుకున్నట్లన్పించింది. తన ఏరియాలో మనిషి, తన దగ్గరికి రాక, పైగా ఇలాగ మాట్లాడటం?

వెంటనే తను కల్పించుకుంటూ అంది "ఎల్లకాలం ఆళ్ళు యు.పి.లో ఎట్టా సేత్తారు? ఆళ్ళకి పైకి రావాలని ఉండదా? అయినా మాలాంటోళ్ళని ఇవన్నీ అడగడానికి మీరెవరు? "

శిరీషకి చాలా కోపం వచ్చింది. అయినా నిగ్రహించుకుంది. "చూడండి. మీలాంటి వాళ్ళకి అక్షరాలు నేర్పి, మీరు ఈనాడు ఇన్ని మాట్లాడటం నేర్పిన ఉపాధ్యాయులం. అధికారంలో మీరున్నప్పుడు, మీవాళ్ళను

అందలం ఎక్కించాలనుకోవడం న్యాయమే. కానీ అర్హత కలిగిన మమ్మల్ని వెనక్కి వెళ్లమనడం, ప్రభుత్వం మాకిచ్చిన సౌకర్యాలకి భంగం కలిగించడం న్యాయమా? "

అంతలో ఛైర్మన్ గారు కల్పించుకున్నారు. "చూడండి టీచర్! ఏవైనా ఖాళీ ఉంటే చెప్పండి. లేదా ప్రస్తుతానికి చేరండి. తర్వాత చూద్దాం"

శిరీష కళ్ళు మళ్ళీ నీరు చిప్పిల్లాయి. "నా విషయంలో అన్యాయం చేశారు! నా సబ్జక్టుకి నన్ను దూరం చేశారు. భార్యాభర్తలు ఎన్నో ఏళ్లనుండి కలిసి పనిచేస్తున్న వాళ్ళని విడదీశారు. కనీసం ఒక దిక్కువైపుగానీ, దగ్గర స్కూళ్ళకుగానీ వేయలేదు. ఎవరైనా మా విషయాలు వింటే మాకు పనిష్మెంటు అనుకుంటారు. అలాగ తప్పుచేశారు. ఇది సరిదిద్దండి. దిద్దకతప్పదు. మీరు నాకు న్యాయం చేసేవరకూ నేను సెలవులోనే ఉంటాను. ఒక మధ్యతరగతి స్త్రీ జీతాన్ని వదులుకొని సెలవు పెట్టుకోవడం ఎంత బాధాకరమైన విషయమో మీకు తెలుసును, వస్తాను" అంటూ శిరీష ఇవతలికి వచ్చేసింది. వస్తోంటే "ఎక్కడైనా ఖాళీలుంటే చెప్పమ్మా" అని ఆయన అన్నారు. కానీ ఏవో మారుమూల ఊళ్లల్లో రెండుమాత్రమే ఉన్నాయన్న విషయం ఆయనకీ తెలుసును. ఆయన పి. యే. కీ తెలుసును.

శిరీష, హిందీ టీచర్ల దగ్గరే ఎక్కువ టైమయిపోవడంతో ఏదో మాట్లాడాలని వచ్చిన మరొక జడ్. పి. మెంబరు అన్నారు "ఇదివరకు బతకలేక బడిపంతులనేవారు. ఇప్పుడు బతకనేర్చిన వారని పిలవాలి. ఆవిడ చూడండి. ఎన్ని చెపుతోందో? ఇష్టం అయితే వెళ్లి చేరాలి. లేదా మానెయ్యాలి. మనల్నే తక్కువ చేస్తూ మాట్లాడటానికి ఎన్ని గుండెలు? అందువలనే వాళ్ళు ఇన్ని అవస్థలు పడుతున్నారు"

"బాగా సెప్పావు బావగారూ! నా మాట కూడా అదే" నాగేశ్వరి నవ్వుతూ అతడితో అంది.

కారిడార్ దాటి డోర్ దగ్గరికి రాబోతున్న శిరీష ఆగిపోయింది.

"వేలిముద్రలు వేసుకునే వాళ్ళు, ప్రజల ధర్మమా అని నాలుగు కబుర్లు చెప్పి నాయకులవుతున్నారు. మీలాంటి వాళ్ళు చదువుకోవాలంటే ఒక జీవితకాలం పడుతుంది. మేం మీలాగ నాయకులవ్వాలంటే నాలుగు రోజులు పట్టవు" అని ఘాటుగా అని వెళ్ళిపోయింది.

వాళ్ళ మొహాలు మాడిపోయాయి. ఛైర్మన్‌గారికి వాళ్ల గురించి కొంత తెలుసును. అందుకే విననట్లుండిపోయారు.

నాగేశ్వరిని ఆవిడ స్నేహితులు కొందరిని చూస్తే శిరీషకి అసహ్యం వేసింది. వాళ్ళు మన ప్రజా ప్రతినిధులు. కర్తవ్య నిర్వహణ అంటే ఏమిటో ఎరుగని వాళ్ళు. ప్రభుత్వ నిర్వహణ అంటే అర్ధమవని వాళ్ళు అందలాలు ఎక్కడం. ఈనాడు గూండాయిజం, రౌడీయిజం ఈ దేశాన్ని భ్రష్టు పట్టిస్తున్నాయి.

బయటికి వచ్చాక శిరీషకి ఉసూరనిపించింది. "మళ్ళీ ఎప్పుడు వస్తారు? " హిందీ టీచర్ అడిగింది. శిరీష ఆలోచనలో పడింది. ఎప్పటికి సమస్య తెములుతుంది?

శిరీష అక్కడివాళ్లతో దెబ్బలాడింది. వాళ్ళు ఇంకా ఏం చిరాకులు పెడతారో? అనవసరంగా లేనిపోని బాధలు కొని తెచ్చుకోవడమవుతుందేమో! అనుకుందామె.

అదే అంటే శిరీష నవ్వి "ఇప్పుడు బాధలు లేకపోతే కదా!" అంది. ఆ నవ్వులో వేదన ఉంది. నిర్లిప్తత ఉంది.

"మీరు చాలా ధైర్యస్థులు"

హిందీ టీచర్ మాటలకి శిరీష నవ్వింది.





"ఇది ధైర్యంకాదు. మొండితనం. తెగింపు ఇంతకన్నా వాళ్ళు మనకి చేసే హాని ఏముంది? ఇంకా దూరం స్కూల్లో వేస్తారు. అంతేకదా!"

ఇంటికి వచ్చాక అన్ని విషయాలూ భర్తకి చెప్పింది. సావిత్రమ్మ కోడలితో "త్వరగా స్నానం చేసిరా! వాడుకూడా భోజనం చేయ కుండా నీకోసం కూర్చున్నాడు" అంది.

శిరీష కళ్ళు గడియారం వేపు చూశాయి. పదకొండు గంటలైంది. భర్తవైపు చూసింది. ఆ కళ్ళు ప్రేమగా తనని చూస్తు న్నాయి. మరి ఆలస్యం చేయకుండా బాత్‌రూం వైపు నడిచింది.

రవికి నమ్మబుద్ధి కావడంలేదు. శిరీష అంతధైర్యంగా అన్ని మాటలు అంటుందను కోలేదు. సుకుమారమైన ఆమె హృదయం ఎంత బాధపడుతోందో? అతడికి నిద్ర రావడంలేదు. మంచినీళ్ళు పట్టుకొని వచ్చి శిరీష అడిగింది "ఏమిటంత ఆలోచన?"

"నువ్వు అన్నిమాటలు ఎలా అనగలిగావా అని ఆలోచిస్తున్నాను" అతడు ఎటువంటి జంకు లేకుండా అన్నాడు.

ఆమె తలగడ సర్దుకొని, అతడివైపు చూస్తూ పడుకొంది. రవి పక్కకి తిరిగి "నాకు అనుమానంగా ఉంది. మనం కలిసి నప్పుడు గట్టిగా మాటకూడా మాటాడ్డానికి నువ్వు ఇష్టపడే దానివి కాదు. అలాంటిది ఈరోజు వాళ్లను నిలదీయగలిగావంటే ఆశ్చ ర్యంగా ఉంది" అన్నాడు.

శిరీష భర్త మొహాన్ని తదేకంగా చూసింది. "రవీ! నేను ఈ సమస్యను అన్వ యించుకోలేకపోతున్నాను. ఉద్యోగమే లోకం అనుకొన్నాను. లోకాన్ని కూడా పట్టించుకోలేదు. ఈరోజు అర్హత లేనివాళ్ళు నా అనుభవం నుండి నన్ను వేరు చేయా లని చూస్తూంటే భరించలేకపోతున్నాను. అందుకే ఈ సమస్యను పరిష్కరించుకోవ డానికి ధైర్యాన్ని కూడగట్టుకొంటున్నాను"

అతడు ఏమీ మాట్లాడలేకపోయాడు. ఆమే మళ్ళీ అంది "వాళ్ళుకూడా తప్పు చేశారు కనుకనే ఊరుకొంటున్నారు"

కాసేపు ఇద్దరూ మౌనంగా వున్నారు. అతడి గుండెల దగ్గిరగా జరిగి ఎదమీద తల పెట్టుకొని తనలో తను అనుకొంటు న్నట్లు అంది "ఈ సమస్య ఎప్పటికి తెము లుతుందో? ఈలోపు ఇంటి ఖర్చు ఎలాగో? బాగా ఇబ్బందులు పడవలసి వస్తుందేమో నని నా భయం. అత్తయ్యగారు ఏమం టారో?"

అతడు ఆమె తలను గట్టిగా అదుముకు న్నాడు. "శిరీ! ఏ భయాలూ నీకు వద్దు. నీకు ఇష్టమైన విధంగా చేద్దాం. ఇంటి విషయం ఇంక నీకు వద్దు. నేను ఉన్నాను కదా! ఇంక పడుకో!"

అతడు ఆమె నడుంచుట్టూ చెయ్యివేసి, చిన్న పిల్లను దగ్గరకు తీసుకున్నట్టు తీసు కొని పడుకున్నాడు. కాసేపటికే అలసిపో యిన ఆమె నిద్రపోయింది.

ఆమెనలాగ దగ్గరికి తీసుకొని పడుకో వడం వలన అతడికి ఏదో తెలియని శాంతి లభించినట్లు అయింది. ఎన్ని నెలలు గడ వనీ! తను ఆమెను ఇంటి విషయాలతో బాధించకూడదు. ఆమెకి అసంతృప్తిగా అన్పిస్తే అప్పుడే ఉద్యోగం మానెయ్య మందాం అనుకొన్నాడు.

తెల్లటి ఆడపిల్లలే అందంగా ఉంటారని అతడి ఫ్రెండ్స్ అనుకొనేవారు. మీ మొహం. అందం చూసే కళ్ళల్లో ఉంటుం దని ఇతడు వాదించేవాడు. కన్ను, ముక్కు తీరుగా ఉండి కళగా ఉంటే ఏ రంగు అయితే ఏమి అని స్నేహితుల నోరు మూయించేవాడు.

అయితే వాళ్ళు పట్టినే ఆడపిల్లల్ని



కామెంటు చేస్తున్నారని అలా అన్నాడు తప్ప, ఏ అందం అతడిని అంతవరకూ ఆకర్షించలేదు. బంధువుల అమ్మాయిలు, క్లాసు మేట్సు, ఇరుగు పొరుగులవాళ్ళు ఎందరు కన్పించినా ఎవరూ అతడిలో ఆసక్తి కలిగించలేదు.

రవి నెమ్మదిగా లేచి శిరీషను తలగడ మీద పడుకోపెట్టాడు. చెదిరిన ఆమె ముంగురులను జాగ్రత్తగా సవరించాడు. తర్వాత ఆమెను చూస్తూ ఆలోచనలో పడ్డాడు.

గతం! మధురమైన గతం ఎప్పుడూ మనిషికి ఆనందాన్నిస్తుంది. ఎన్నిసార్లు తలచుకొన్నా మరింత రసపుష్టిని చేకూరుస్తుంది. "ప్రేమించు ప్రేమకై" అన్న కవికి ధన్యవాదాలు చెప్పాలన్పిస్తుంది. సున్నితమైన భావాలు ఆడవారి సొత్తే అంటే అన్యాయం ఏమో! మగవారిలో కూడా సున్నితంగా ఆలోచించేవారు ఉంటారు.

శిరీషను మొదటిసారి చూసినప్పటి జ్ఞాపకాలు అతడి హృదయపు పొరలను సున్నితంగా పైకి లేపుతున్నాయి. అతడి పెదవులు వాటిని తలచుకోగానే చిరునవ్వుతో విచ్చుకున్నాయి. కళ్ళు అపురూప వస్తువుని చూస్తున్నట్లు ఆమె మొహాన్ని వదిలి రానంటున్నాయి.

డబుల్స్ తొక్కుతూ వస్తున్న ఆమె సైకిలు, తన సైకిలును ఢీ కొట్టడం వలన పడిపోయిన తను ఎదుటిమనిషి అందాన్ని చూస్తూ మైమరచిపోయాడు.

అందమైన కనుదోయి, సన్నటి చిన్న సంపెంగలాంటి ముక్కు, చిన్న దొండపండు లాంటి ఎర్రని పెదవులు, గడ్డందగ్గర ఆమె అందానికి దిష్టి తగలకుండా భగవంతుడే పెట్టిన చిన్న పుట్టుమచ్చ, చక్కటి పొడవు, సున్నితమైన ఆ శరీర తీరుని చూస్తూ తను సైకిలు దగ్గరనుండి లేవలేకపోయాడు.

ఆమె స్నేహితురాలు కాబోలు, చెయ్యి అందించి ఆమెను లేవదీసింది. ఇంతలో అక్కడికి వచ్చిన పిల్లలు అతడినీ, సైకిలునీ లేవతీశారు. అతడు పైకిలేస్తూ మళ్ళీ ఆమె వైపు చూశాడు.

నెమ్మదిగా లేచి, చీరకంటిన దుమ్ము దులుపుకుంటూ ఆమె సన్నటి స్వరంతో "డబల్స్ వద్దని చెప్పాను. నువ్వు వద్దన్నా వినలేదు. ఇప్పుడు చూడు ఏమైందో? ఆయనని కూడా పడేశాం" అంటోంది.

"రూపానికి తగ్గ స్వరమాధుర్యం" అనుకోకుండా ఉండలేకపోయాడు.

ఆమె స్నేహితురాలు కాబోలు మహా తేలిగ్గా అంది "ఏం ఫర్వాలేదు. ఏక్సిడెంట్లు అన్నీ మగవాళ్ళే చెయ్యాలా? మనంకూడా ఇలాంటి చిన్నచిన్నవి చేస్తూ ఉంటే మనమంటే వాళ్ళకి భయం కలుగుతుంది"

శిరీషకి స్నేహితురాలిపై కోపం వచ్చింది. ఎదురుగా వస్తున్నాయనను డేష్ ఇచ్చి పడేసింది కాక, సారీ అయినా చెప్పకుండా ఈ గోల ఏమిటి?

పైకి లేస్తున్న అతడిని సిగ్గుగా చూస్తూ "సారీ! సారీ అండీ! చూసుకోలేదు" అని నెమ్మదిగా అంది.

రవి ఆమె మాటలకి తెప్పరిల్లాడు. "ఫర్వాలేదులెండి. ఆవిడ చెప్పినట్లు ఇలాంటివి అప్పుడప్పుడూ ఆడవాళ్ళు చెయ్యాలి" అని నవ్వాడు.

శిరీష స్నేహితురాలు "అమ్మో! గట్టి పిండమే" అనుకొంది. శిరీష మొహమాటంగా అడిగింది "దెబ్బలేమైనా తగిలాయా? "

"లేదండీ... మీరు ఇటు...? " అంటూ అర్థోక్తిగా ఆగాడు.

"మేం ఇద్దరం ఏటివలస హైస్కూల్లో టీచర్లుగా పనిచేస్తున్నాం. బస్సు ఈరోజు ఎర్లీగా వెళ్లిపోయిందని సైకిలు మీద బయలుదేరాం.

రవీంద్ర తాను బి.యిడి మేథ్స్ అసిస్టెంటుగా చేస్తున్నానని పరిచయం చేసుకున్నాడు. అతడు చిరునవ్వుతో రెప్పవేయకుండా చూస్తోంటే శిరీష కొద్దిగా తడబడింది.

"పద తల్లీ! పద!" అంది స్నేహితురాలు.

శిరీష సెలవు తీసుకొని వెళ్లిపోయింది.

ఆమె వెళ్లిపోతూంటే ఏదో సన్నని బాధ. తన ప్రాణం ఎవరో తీసుకొని వెళ్లిపోతున్నట్లు భావన. అతడు కొద్దిసేపు వెళుతున్న వాళ్ళనే చూస్తూ ఉండిపోయాడు.

పసుపు చీరమీద నల్లని డిజైనున్న చీర, నల్లని జాకట్టుతో ఆమె ఎంతో అందంగా ఉంది. వెనుకనుండి అటూ, ఇటూ ఊగుతున్న సొగసైన జడ అందం అంతా నాలో ఉంది సుమా అని తెలియచేస్తోంది. తల




లోని కనకాంబరాలు అటూ ఇటూ కదులుతున్నాయి. అతడి కళ్ళకి ఆమె ఒక కావ్య నాయికలాగా అన్పించింది.

ఇంటికి వచ్చినా ఏదో లోకంలోనున్నట్లు మౌనంగా ఉండిపోయాడు. రాత్రంతా తిరుగుతున్న ఫానునే చూస్తుండిపోయాడు.

ఆ తర్వాత రెండురోజులు గడవడం కూడా కష్టమైపోయింది. చివరికి స్నేహితుడి దగ్గర తన ఆవేదన చెప్పాడు. ఆమెను చూడాలని ప్రాణం కొట్టుకొనిపోతోందన్నాడు.

ఇంటి బాధ్యతలు, స్కూలు తప్ప తెలియని అతడిలో ఇంత అలజడి లేవడం స్నేహితుడికి ఆశ్చర్యాన్ని కల్గించింది.

ఒకపూట సెలవుపెట్టి ఆ స్కూల్లో ఉన్న తన స్నేహితుడిని చూడటానికని చెప్పి ఇద్దరూ బయలుదేరారు.

రవీంద్రలో ఒకటే టెన్షన్. ఆమె ఈరోజు సెలవు పెట్టలేదు కదా? పెడితే ఎలాగ?

అతడికి కళ్ళనీళ్ళు తిరిగాయి. ఏమిటి తను చేస్తున్న పని. ఆ అమ్మాయి ఏమనుకుంటుందో? ఒక గౌరవస్థానంలో ఉన్న తను ఇలాగ ఆరాటపడవచ్చునా?

శ్రీనివాస్ తన స్నేహితుడికి రవీంద్రను పరిచయం చేశాడు.

తర్వాత, స్టాఫ్ రూంలో శిరీష కనబడింది. గ్రేడ్ టూగా పనిచేస్తున్న శ్రీనివాసు ఫ్రెండ్ వాళ్ళకి శిరీషను పరిచయం చేయబోయాడు.

రవి చిరునవ్వుతో ఆ టీచర్‌ని ఆపాడు.

"ఆవిడ శిరీషగారు. ఎస్.ఎస్. బి.యిడి అసిస్టెంట్. అంతేనా? నాకు ఆవిడ బాగా తెలుసును" అన్నాడు.

అతడి మాటలకి శిరీష తెల్లబోయింది. ఒక్కసారే కదా తాము కలిశారు. మరి బాగా తెలుసునంటాడేం?

శ్రీనివాసు, స్నేహితుడు ఇద్దరూ కబుర్లలో పడ్డారు. శిరీష పిల్లల మేప్ బుక్స్ దిద్దుకుంటోంది. రవీంద్ర ఆమెవైపు చూస్తూ కూర్చున్నాడు. మధ్యలో ఎందుకో కళ్ళెత్తిన శిరీష తెల్లబోయింది. అతడు తననే దీక్షగా చూస్తున్నాడు.

ఆమె అతడిని ఏమీ అనలేకపోయింది. అది సభ్యత కాదని తెలుసును. అయినా అతడు అలాగ చూస్తాడేం? ఆ చూపులో వెకిలితనం లేదు. కొంటెగుణం లేదు. ఒక ఆత్మీయత, ఒక అనురాగం కన్పిస్తున్నాయి.

సెకండ్ పీరియడ్ ఆమె క్లాసుందని లేచింది. అతడుకూడా లేచి శ్రీనివాసుతో పద వెళ్లిపోదాం అన్నాడు. అతడు తెల్లమొహం వేశాడు. వెళ్ళేంతవరకూ తొందర, వచ్చేంతవరకూ తొందర? ఏం మనిషి అనుకున్నాడు.

స్నేహితుడి వలన శిరీష విషయాలన్నీ శ్రీనివాసు సేకరించాడు. వివరాలు విన్నాక అతడు ఉసూరుమన్నాడు.

పెద్ద భూస్వామి అయిన ఆనందరావు రవిని అల్లుడిగా అంగీకరిస్తాడా? అనుకున్నాడు. రవికిమాత్రం ఇవేమీ పట్టలేదు.

శిరీషకి శుక్రవారం దుర్గ కోవెలకి వెళ్ళడం అలవాటు. అక్కడ రవి కన్పించేవాడు. ఏమీ మాట్లాడేవాడు కాడు. కళ్లారా ఆమెను చూసి వెళ్ళిపోయేవాడు. శిరీష పలకరిస్తే జవాబు చెప్పేవాడు. ఇద్దరూ ఒకరికొకరు ఏమనుకుంటారో అని భయపడేవారు. చివరికి అతడొక నిర్ణయానికి వచ్చేశాడు.

మళ్ళీవారం కోవెలలో కలిసినప్పుడు నేను మీతో మాట్లాడాలనుకుంటున్నాను అన్నాడు.

ఆమెకి నమ్మబుద్ధి కాలేదు. తనతో మాట్లాడడానికి అతడికి ఏం అవసరం ఉంది? అసలు మాట్లాడతానని పిలిచిన

ప్పుడు నిరాకరిస్తే బావుంటుందా? అందమైనవాడు, పైగా టీచర్! పిలుస్తోంటే వెళ్ళననే ఆడది స్నేహితురాలి భాషలో వట్టి మూర్ఖురాలు.

అయినా, ఏం మాట్లాడతాడో వెళితే కదా తెలుస్తుంది. వెళ్లకుండా ఆలోచనలు అనవసరం అనుకుంది.

అతడు ఆమెను చిరునవ్వుతో చూస్తూ "మీరు దైవదర్శనం చేసుకున్నాక రావచ్చును" అన్నాడు.

ఆమె ప్రదక్షిణాలు పూర్తి చేసుకొని, దైవ దర్శనం చేసుకొని వచ్చింది. నుదిటిమీద కుంకుమతో శిరీష ఎంతో పవిత్రంగా కన్పించింది. ఆమె ఇచ్చిన ప్రసాదం తీసుకొని ఇద్దరూ నెమ్మదిగా నడుస్తూ ఇవతలికి వచ్చారు.

నడుస్తూ అతడు నెమ్మదిగా "ఆ ప్రదేశంలో కాసేపు కూర్చుందామా?" అన్నాడు. ఆమె తల ఊపి పార్కువైపు నడిచింది.

ఒత్తుగా గడ్డి ఉన్న ఒకపక్కగా అతడు కూర్చున్నాడు. ఆమె కూర్చుంటూ చుట్టూ చూసింది. పిల్లలు కేరింతలు కొడుతూ దూరంలో ఆడుకొంటున్నారు. వారికి కాస్త దూరంలో వృద్ధ దంపతులు కూర్చుని, దగ్గరలో ఆడుకొంటున్న మనవలను చూస్తూ నెమ్మదిగా మాట్లాడుకొంటున్నారు. అక్కడక్కడా ఎవరెవరో కూర్చుని కబుర్లు చెప్పుకొంటున్నారు.

అతడు కొద్దిసేపు ఏమీ మాట్లాడలేదు. శిరీష చల్లటి ఆ దారిని, పరిసరాలను గమనించసాగింది. ఇన్నిసార్లు కోవెలకి వచ్చినా ఎప్పుడూ ఇక్కడికి వచ్చి కూర్చోలేదు.

అతడు ఆమెను చూస్తూ చిన్నగా నవ్వి అన్నాడు. "నేను చెప్పేది వినండి. తర్వాత మీరు మాట్లాడండి. సరే, గానీ ఇతడు ఇలా పిలవడమేంటి? అని తిట్టుకోలేదు కదా?"

శిరీష నవ్వింది. "ఇన్ని రోజుల పరిచయంతో ఆ దశ దాటామని మీకు తెలియదా?"

అతడు ఔనన్నట్లు తల ఊపాడు.

"నాకు చదువు పూర్తయ్యేసరికి తండ్రి పోయాడు. కుటుంబాన్ని ఎలా నడపాలో అని బెంగపడుతున్న అమ్మ మిగిలింది. ఒక చెల్లెలు, చదువుకుంటున్న ఒక తమ్ముడు. ఇదీ నా ప్రపంచం. నాకు ఈ ప్రపంచం చాలా గొప్పగా అన్పిస్తుంది. అమ్మ బాధ్యత అని నేననుకోను. భగవంతుడు నాకు ప్రసాదించిన ప్రత్యక్ష దేవత. ఆవిడతో బతుకు సాగించడం నా అదృష్టం అనుకుంటాను.

"చెల్లి పెళ్లి నా బాధ్యత. తమ్ముడికి ఒక తోవ చూపాలి. ఈ నా ప్రపంచమే గొప్పదనుకొన్నాను. ఏ ఆలోచనలూ లేని నాలో మిమ్మల్ని చూశాక ఒక కదలిక..."

శిరీష తుళ్ళిపడి అతడివైపు చూసింది. ఆ కళ్లు నిర్మలంగా ఉన్నాయి. నల్లటి, ఒత్తైన క్రాఫ్‌ని సవరించుకుంటూ అన్నాడు.

"అమ్మ, తమ్ముడు, చెల్లి తప్ప మరేం అక్కరలేదనుకొనే నాకు నా ఆలోచన తప్పన్నట్లు మీరు కన్పించారు. బాధ్యతలతో ముడిపడిన నా జీవితంలో అలజడి రేగింది.

"ప్రస్తుతం గడుపుతున్న జీవితం అసంపూర్ణ కావ్యం అన్పిస్తోంది. జీవితంలో కొరత ఉందన్పిస్తోంది. పెళ్లిమీద, వైవాహిక జీవితంమీద ఏ ఆశలూ లేని ఏనాడూ ఆలోచించని నాలో సంఘర్షణ...

"మీతో జీవితం పంచుకోకపోతే ఈ బతుకు బావుండదన్పిస్తోంది. మా అమ్మ, చెల్లి, తమ్ముడు లాగ నా జీవితంలో మీరు ఇమడగలరా?"

శిరీష ఆర్ద్రంగా అతడివైపు చూసింది. ఏ విషయం దాపరికం లేకుండా చెపుతున్న





అతడంటే ఒక విధమైన గౌరవం కలుగు తోంది.

"శిరీషగారూ! కార్లు, మేడలు నాకు లేవు. వాటిని మీకు నేను ఇవ్వలేను. నా బీద జీవి తంలోకి... సామాన్యమైన ఈ బతుకు లోకి... రాగలరా? నా బాధ్యతలను నెరవే ర్చుకొని వారిలాగే కూర్చునే అదృష్టం కలిగిం చగలరా? "

దూరంగా కన్పిస్తున్న దంపతులవైపు ఆరాధనగా చూస్తూ సజలనయనాలతో అడి గాడు.

"తొందరలేదు. నెమ్మదిగా ఆలోచించండి. ఎప్పుడూ మిమ్మల్ని చూడాలన్పిస్తుంది. మీతో కలిసి బతకాలన్పిస్తుంది. దీన్ని ప్రేమంటారో, మరేమంటారో నాకు తెలి యదు. నా విషయాలు మీకు అర్థమ య్యాయి కదా! ఆలోచించి మీ నిర్ణయం చెప్పండి" అతడు ఇన్నాళ్ళు పడుతున్న బాధ నుండి బయటపడిన తృప్తితో అన్నాడు.

శిరీష మౌనంగా అక్కడ కూర్చున్న దంప తులవైపు చూసింది. వాళ్ళిద్దరూ మరో లోకంలో ఉన్నట్లూ, ఈ లోకంతో పని లేద న్నట్టున్నారు. శిరీష లేచి వెళ్లడానికి సిద్ధప డింది.

ఆ తర్వాత రవీంద్ర నెమ్మదిగా తల్లితో ఆమె విషయం చెప్పాడు. సావిత్రమ్మ ఊహించని విషయం ఇది. ఎంతోనెమ్మ దిగా, తామే లోకం అన్నట్లు బతికే కొడుకు ఆమె లేకపోతే బతుక్కి అర్థం లేదంటు న్నాడు.

కొడుకు పెళ్లిచేసి కట్నం బాగా తీసుకొంటే లావణ్య పెళ్ళి జరిపించవచ్చని ఆవిడ ఆలో చన. చిన్నవాడి చదువు ఎలాగో ఒడ్డెక్కితే ఇంక కృష్ణా, రామా అనుకోవచ్చు

కానీ ఇదేమి విడ్డూరం. ఎవరినీ, ఏనాడూ కన్నెత్తి చూడని బిడ్డ, ఇటువంటి విషయం చెపుతున్నాడు. మర్నాడు, మూడవనాడు ఆవిడ కొడుకు మొహం చూడలేకపోయింది. ఆవిడ మనసు కష్టపడింది. కొడుకు ఆ పిల్ల మోజులో పడి తమకు దూరమవుతున్నాడా అన్న భయం నీలినీడలాగా వెంటాడసా గింది.

శిరీష తండ్రి ఆనందరావు ఇది విని గయ్యిమని లేచాడు. ఒక వ్యక్తిని పెళ్లి చేసు కోవాలంటే ఎన్ని ఆలోచించాలి?

ఏం ఆలోచించాలి? శిరీష దృష్టిలో ఆలో చించే విషయాలు కొన్నే. తల్లిని గౌరవించే వాడు భార్యనూ గౌరవిస్తాడు. తన తమ్ముడి విషయంలో, చెల్లెలి విషయంలో బాధ్యత పడేవాడు రేపు భార్యాబిడ్డల బాధ్యతనూ ఆనందంగా నిర్వహిస్తాడు.

నేను మగవాడిని అనే గర్వంలేకుండా తన మనసుని విప్పి పరిచాడు. తనని అందలం ఎక్కించలేకపోవచ్చును. కానీ హృదయంలో పదిలంగా దాచుకోగలడు. అందం, ఉద్యోగం, బాధ్యత కలిగిన అతడిని ఏవంక చూసి కాదనగలదు?

ఆమె తండ్రి విసుక్కున్నాడు. ఏం సుగు ణాలున్నాయని ఔననాలి. కుటుంబ బాధ్యత ఎక్కువ! ఆస్తి అంతస్తు లేని వట్టి టీచర్ ప్రగతికి అవకాశం లేనివాడు. ఏం చూసి ఔననాలి?

అలా ఎవరి దృష్టికి తోచినట్లు వాళ్ళు ఆలోచించారు. ఏనాడూ అక్కలవలె ఐశ్వర్యం కోరుకోలేదంటుంది శిరీష. వారి లాగే బీదబతుకు బతుకుతావా అంటాడు తండ్రి.

ఆయనకి చిన్నకూతురు చేసుకొంటానం టున్న సంబంధం ఏమాత్రం ఇష్టంలేదు. తనకున్న ఆస్తిపాస్తులేమిటి? సమాజంలో తన గౌరవం ఏమిటి? మామూలు, మధ్య తరగతి కుటుంబంలో పిల్లనిచ్చాడంటే నవ్వరూ!



కాని, ఆయన శతవిధాల చెప్పినా శిరీష విన్పించుకోలేదు. ఆయనకి తన కూతురిని ఏభై ఎకరాల ఆసామి అయిన మేనల్లుడికి ఇవ్వాలని ఉంది. వాళ్ళకి ఆయన ఎంత చెప్పితే అంత. కాని అత్తకొడుకును తను ఆ దృష్టిలో చూడలేదంటుంది శిరీష. అక్కగారి దగ్గర తన మాట పోతుందనే బాధ ఒక వైపు, ఆస్తిలో ఆస్తి కలుస్తుందనుకొంటే ఈ తలనొప్పి ఏమిటని మరొకవైపు కలిసి ఆయనకి చిరాకు తెప్పించాయి.

రవీంద్ర శిరీష ఉత్తరం రాస్తుందని చూశాడు. నాల్గురోజులు దాటినా ఆమె నుండి ఏ ఉత్తరం లేదు. అతడికి ఏం చేయడమో తోచలేదు. ఆమె స్కూలువైపు వెళితే సెలవు పెట్టిందని తెలిసి కాలుగాలిన పిల్లిలా తిరగసాగాడు.

అతడికి శిరీష ఎందుకిలాగ కాలయాపన చేస్తోందా అన్పించింది. ఏ ఊరు వెళ్ళిందో! ఎప్పుడు వస్తుందో! అనుకుంటూ మినుకుమినుకుమంటున్న ఆశతో దుర్గ కోవెలకి బయలుదేరాడు. అరగంట కూర్చున్నా ఆమె జాడ లేదు.

ఆమె వచ్చే మార్గంవైపు చూసి చూసి అతడికి నిరుత్సాహం పెరిగిపోయింది. ఈ పెళ్ళి ఇష్టం లేకపోతే చెప్పవచ్చు కదా! ఇలాగ దోబూచులాట ఎందుకు?

అయినా తన పిచ్చిగాని ఇంతగా కుటుంబ బాధ్యతలు నెత్తిన ఉన్నవాడిని ఎవరు పెళ్ళి చేసుకొంటా మంటారు? ఏ స్త్రీకైనా సుఖంగా, హాయిగా బతకాలనే ఉంటుంది. తనదే బుద్ధితక్కువ. నోరు తెరిచి అడిగేశాడు. సర్లే... ఈ ప్రేమ వైఫల్యంతో బతుకు గడపాలని తనకి ఆ దేవుడు రాశాడు కాబోలు.

ఏనాడూ ఏదీ త్వరగా కావాలనుకోని తాను ఆమెను చూసి, జీవిత సహచరిని చేసుకోవాలనుకొన్నందుకు తననితానే తిట్టుకొన్నాడు. అడిగి ఎందుకు చులకనయ్యానా అని బాధపడ్డాడు. ఆమె ఏదో ఒక విషయం చెప్పవచ్చు కదా! వద్దంటే ఏమను కొంటానో అని మొహమాట పడిందా?

వియ్యానికైనా, కయ్యానికైనా సమాన స్థాయీ ఉండాలనే తల్లి మాటలు ఎంత సత్యమైనవో తెలియసాగాయి.

అతడు నెమ్మదిగా సైకిలు తీసికొని ఇంటివైపు అడుగులు వేస్తుంటే పార్కు మలుపు దగ్గర శిరీష, మరో యువకుడూ నిలబడి కనిపించారు.

ఆమెను చూడగానే పోయిన ప్రాణం తిరిగి వచ్చినట్లన్పించింది. ఆమె పక్కనున్న తను స్టయిలుగా, తెల్లగా ఎంతో బావున్నాడు. తనకి అతడిని పరిచయం చేసి, ఆ అబ్బాయిని చేసుకొంటానని చెపుతుందేమో! లేకపోతే ఏ అత్తకొడుకో?

రవీంద్ర ఒక్క నిట్టూర్పు విడిచాడు. సరే. ఏదైతేకానీ, ఆమె నోటినుండి ఏదో ఒకటి వినేస్తాడు కదా, ఇంక ఈ గుంజాటన ఉండదనుకొంటూ అటువైపు నడవసాగాడు.

శిరీషకి అతడిని చూస్తూంటే అంతా అర్థమైంది. ఆమె చిరుకోపంతో పక్కనున్న అతడివైపు తిరిగి "నాలుగడుగులు త్వరగా నడవరా" అంది.

"తల్లీ! నీ మొగుడు ఏం కందిపోడులేవే? మరీ అంతలాగ ఫీలైపోకు. ఆమాత్రం వేడి కలిగించకపోతే బావమరిది గుర్తుండ వద్దా? " అంటూ రవీంద్రను సమీపించాడు అతను.

రవీంద్రవైపు స్నేహపూరితంగా చూస్తూ నమస్కారం చేశాడతను. శిరీష మనసులో అతడిని తిట్టుకొంది. వెధవ ఫోజూ, వీడూను. తనెవరో చెప్పి నమస్కారం చేయవచ్చు కదా!





ఇంక తను ఉండబట్టలేక "బావగారిని చూస్తానంటూ వీడు నాతో వచ్చాడు" అంది.

రవికి ఆమె మాటలు అమృతప్రాయమ య్యాయి.

అలా రమాకాంత్, రవీంద్ర పరిచయ స్తులై, కొద్ది సేపటిలోనే మంచి ఆత్మీయులై పోయారు.

ఇంటికి వస్తుండగా రమాకాంత్ చెల్లిని అభినందించాడు. "అబ్బ... నీకింతమంచి టేష్టు ఉందనుకోలేదే. ఇదో అమాయకపు ముద్దపప్పు. దీనికి బావగారిని వెతకవలసిన బాధ్యత నేనే పడాలి అని అనుకొనేవాడిని. అమ్మో... నువ్వు ఘటికురాలివే" అని వేళా కోళం ప్రారంభించాడు.

శిరీష తండ్రికి కూతురు తన పెదతల్లిని, పెదతండ్రిని తీసికొని వచ్చి తనకే నచ్చ చెప్పిస్తుందన్న ఆలోచన రాలేదు సరిగదా తనే అక్కగారిని, బావగారిని, కూతుళ్ళను తీసికొని వచ్చి శిరీషకి నచ్చచెప్పిద్దామనుకొ న్నాడు. కాని శిరీష తన ముందుకాళ్ళకి బంధాలు వేయడంతో ఆయనకి ఒళ్ళుమం డింది.

సావిత్రమ్మ కొడుకు, కూతురు దెబ్బలాడి తల్లిని అన్నగారి పెళ్ళికి వప్పించారు. తమ అన్నగారు అందరిలాంటి వాడు కాదు కనుక తల్లి ఆమోదంకోసం ఆగాడు. అదే మరొకరైతే నా సంపాదన, నా ఇష్టం, నాకు తోచిన వాళ్ళను చేసుకొంటాను. అడగడా నికి మీరెవరు అనేవాడు. అన్నయ్య ఇస్తున్న మర్యాదను నిలుపుకో అని హెచ్చరించారు.

ఎలాగో క్లుప్తంగా వాళ్ళ పెళ్ళి శిరీష తండ్రి అయిందనిపించాడు. సావిత్రమ్మ వియ్యాలవారి బుద్ధులు చూసి మండిప డింది. తనంతట తాను పట్టుబట్టి కొడుకు ఆ పిల్లను కావాలనుకోవడం వలన కదా ఇలాగ చులకనయ్యాడని ఆవిడ వాపో యింది.

పెద్దపిల్లలిద్దరికీ అప్పచెప్పిన దాంట్లో సగ మైనా ఆయన శిరీషకి పెట్టలేదు. పెద్దపిల్ల లకులాగే బంగారమైనా ఓ 10 తులాలు పెట్టండని భార్య గోలపెట్టినా ఆయన విన లేదు.

"వాళ్ళ స్టేటస్‌లను బట్టి వాళ్ళకి అన్నీ చేశాం. వాళ్ళు మన గౌరవం నిలిపారు. ఇలాగ వట్టి జీతం రాళ్ళను నమ్ముకొన్న వాళ్ళను చేసుకోలేదు. తాహతులేనివాళ్ళకి ఈ మాత్రమైనా జరిపించానంటే చెడ్డపేరు తెచ్చుకోవడం ఇష్టంలేకనే" అన్నాడాయన.

ఆయన మాటలు విన్న సావిత్రమ్మ తారా జువ్వలాగ లేచింది. "నా బిడ్డ మంచితనం మీరు గుర్తించలేదు. తాహతులేనివాళ్ళని, అల్లులని ఎన్నెన్నో అన్నారు. నా కోడలి స్థితిచూసి మీరే ఈర్ష్య పడేరోజు వస్తుంది. నా మాట వృథాపోదు" అని ఆయనకి అప్ప చెపుతుంటే రవి వాళ్ళని వారించి బయలు దేరదీశాడు.

రవికి భార్య అంటే అపురూపం. ఏనాడూ ఎందుకు ఈ పెళ్ళి చేసుకొన్నానా అని అత డికి అన్పించనీయకుండా ఆమె ప్రవర్తిం చింది డబ్బు తేలేదే అని బాధపడ్డా, కొంత కాలం గడిచేసరికి కోడలి మంచితనం, కలు పుకోరుతనం ఆవిడకి బాగా నచ్చాయి.

పిల్లల్ని కడుపుతో ఉన్నప్పుడు తల్లి ఏడుపు చూడలేక రెండుసార్లు వెళ్ళినా, మారని తండ్రి ప్రవర్తన, అడుగడుగునా తమ హోదాలను ప్రదర్శిస్తూ హేళనచేసే అక్కల ప్రవర్తనలను భరించలేకపోయింది. వెళ్ళడమే మానుకొంది.

అక్కలిద్దరికీ డబ్బు, నగలు, సుఖాలు కావాలి. భర్తలు నిలబడమంటే నిలబడ తారు. కూర్చోమంటే కూర్చుంటారు. ఎన్ని అన్నా దులిపేసుకొంటారు. స్వేచ్ఛ అన్నది

ఎరగని వాళ్ళని చూసి శిరీష జాలిపడు తుంది. ఒకసారి పుట్టింట్లో సరదా కొద్దీ ఆమె పెద్దక్క భర్తను ఏదో వేళాకోళం చేసింది. ఇంక చూడాలి. ఆయన ఎంత ఎగిరాడో? చివరికి పరువుపోయి, చిన్న మొహం చేసికొని అక్క నలుగురి మధ్యా బావకి క్షమాపణ చెప్పడం ఆమెకి ఇంకా గుర్తుఉంది.

తమ ఇష్టాయిష్టాలను పెళ్ళి పేరుతో మరిచిపోయిన అక్కలంటే ఆమెకి సాను భూతి. అలాంటి బతుకు అంటేనే ఆమెకి ఏవగింపు. వాళ్ళు కూడా భర్తలంటే తమకి డబ్బు ఇచ్చేయంత్రాలనే అనుకొంటారు. శిరీషని చూస్తే ఆశ్చర్యపోతారు. ఆమె తమ చెల్లెలేనా అనుకొంటారు.



**రెం**డు నెలలు గడిచాయి. ఉద్యోగం ఆర్డర్స్ లేవు. సాధారణంగా నెల అవగానే పైనుండి రీ ఆర్డర్స్ పొందాలి. తిరిగి తిరిగి శిరీష అలిసిపోతోంది.

శ్రీనివాసు కొంత డబ్బు సర్దాడు. రవి వద్దన్నా వినలేదు. అశోక్ చదువుకి, వర్క్‌కి ఆ డబ్బు సరిపోయింది. శ్యామల వచ్చి అయిదువేలు ఇచ్చింది. శిరీష వద్దంటూ గొడవపెట్టింది.

శ్యామల నిష్ఠూరంగా అంది "శిరీ! ఎన్నిసార్లు నువ్వు కుటుంబ అవసరాలలో సర్ద లేదు? నేను ఏనాడైనా సిగ్గుపడ్డానా? ఇదైనా నేనేం అప్పుచేయలేదు. పి.యఫ్. లోను పెట్టాను. అందులో నీకు కొంత తెచ్చాను. వడ్డీ లేని అప్పు. నేను ఎన్నిసార్లు నీ పండుగ ఎడ్వాన్స్‌లు వాడుకోలేదు"

శిరీష మాట్లాడలేదు. తన అరచేతిలోని రేఖలను చూసుకొంటోంది. ఆమె మొహం వాడిపోయింది. మనిషి నీరసపడింది.

శ్యామలకి ఆమెను చూస్తే జాలి కలిగింది. మంచి వాళ్ళకే అన్ని బాధలూ అనుకొంది.

శ్యామల తర్వాత విసురుగా అంది. "నువ్వు ఇవ్వవచ్చును. మేం తీసికోవాలి. ఆనాడు ఎన్ని కబుర్లు చెప్పావు. కష్టంలో, సుఖంలో ఒకేలాగ మనతో ప్రవర్తించేది స్నేహితులే అని చెప్పలేదూ? నేను ఒక మూర్ఖురాల్ని. సిగ్గులేనిదాన్ని. లేకపోతే నువ్వు ఇచ్చిన డబ్బు అలాగ తీసుకొంటానా? నీలాగ పౌరుషం చూపగలిగానా? "

శిరీష వెంటనే ఒక చేత్తో ఆమె నోరు మూసింది. వెంటనే తన చేతిని చూపిస్తూ "ఈ చేతిలో రేఖలు చూడు. నన్ను ఎంతో అదృష్టవంతురాలంటారు. ఇదేనా అదృష్టం. ఏనాడూ ఎవరినీ నొప్పించి ఎరుగను. ఇంత బాధ ఎందుకు అనుభవిస్తున్నానో అర్థమవ డంలేదు" శిరీష కళ్ళనుండి నీళ్ళు జలజలా రాలాయి.

"శ్యామలా! నేను మళ్ళీ స్కూలుకి వస్తానా... మళ్ళీ నా పాఠాలు నేను చెప్పు కొంటానా అనిపిస్తోంది. ఎన్నిరోజులు... ఎన్నిరోజులు నిస్సారంగా గడిచిపోతు న్నాయో చూడు

"నా స్కూలు పిల్లలందరూ గుర్తువ

స్తారు. నిద్రపోయినా అది కలత నిద్రే. అన్నం సయించదు. ఏదో బాధ. వృత్తిని నమ్ముకోవడం నా తప్పా? హృదయాంతరాలలో నరనరాలను బాధపిండేస్తోంది. నన్నేంచేయమంటావు? "

శిరీష రెండు చేతులలో మొహం కప్పుకొని ఏడ్చింది. హృదయవిదారకంగా ఏడుస్తున్న ఆమెను చూస్తే శ్యామలకి ఏడుపు ఆగలేదు.

తన వృత్తిని తాను ప్రేమించడం తప్పా? అధికారుల నిర్లక్ష్యానికి, రాజకీయనాయకుల స్వార్థానికి ఇక్కడ ఒక ప్రాణి ఇలాగ కుమిలిపోతోందే ఎవరైనా ఆలోచిస్తున్నారా?

శ్యామల శిరీష భుజం తట్టింది. ఒక మహారాణిలాగ తమ స్కూల్లో తిరిగే ఒక టీచర్ ఇలాగ బాధపడటమా? శ్యామలకి హెడ్మాస్టర్‌గారి మాటలు గుర్తువచ్చాయి.

"లాస్ట్‌పీరీడ్ అయినా క్లాస్ వదిలేస్తారేమో, వాళ్ళకి గుర్తు చేద్దామని అనుకొంటాను. కాని ఇన్నాళ్ళ సర్వీసులో నాకా ఛాన్సు దొరకలేదు. ఇటువంటి స్టాఫ్ నా దగ్గరున్నారంటే నాకు చాలా గర్వంగా ఉంది"

నిజంగా ఏనాడూ వర్క్ విషయంలో వాళ్ళు వేలెత్తి ఎవరిచేతా చూపించుకోలేదు. నిజాయితీగా ఉండటం కూడా కొందరికి కన్నెర్రగానే ఉంటుందేమో!

కొద్దిసేపు ఏడ్చాక శిరీష మనసు తేలికపడింది. తలెత్తి పేలవంగా నవ్వుతూ అంది "ఈ మనసు ఉంది చూశావా! దానికి ప్రియమైన వాళ్ళను చూస్తే వద్దన్నా బయటపడిపోతుంది"

ఆ మాటలలోని నిర్లిప్తత శ్యామలను కదిలించింది. "మాష్టారి కొత్త స్కూలు టీచర్స్ ఏదో సలహా ఇచ్చారుట?"

శిరీష తల ఊపి చెప్పింది. "వేరొక మండలంలో అప్పర్‌ప్రైమరీలో ఒక బియిడి ఎస్ ఎస్ పోస్ట్ ఉందిట. అక్కడికి ఎలాట్ చేయమని అడగమన్నారు. ఇష్టంలేక ఉండిపోయాం. యు.పి. అయినప్పుడు వాళ్ళు వేసిన చోటికే వెళ్ళవచ్చును కదా.

"ఎంత కష్టపడి పోలిటిక్స్, ఇంగ్లీషు ఎం.ఏలు చదివానూ. ఆ చదువు విద్యార్థులకి ఉపయోగపడవద్దా? చదువుకొన్న చదువు వృథా చేసుకోవడం నాకు ఇష్టంలేని పని. పదవ తరగతి పాఠం చెపుతూ నేను పొందే ఆనందం, ఏడవ తరగతికి దిగి చెప్పడంలో ఉంటుందా?

"రేపు మళ్ళీ అధికారులను కలవడానికి వెళుతున్నాను. ఎలాగైనా పి.ఇ.వోగారినీ సి.ఇ.వోగారిని కలిసి వస్తాను"

శ్యామల ఇంక వెళతానంటూ లేచింది. ఇంట్లో ఎవరూ ఉన్న అలికిడి లేదు. సందేహంగా చూస్తూ ఆగిపోయింది.

"మా ఆడపడుచుకి రాజమండ్రీలో బి.యిడి సీటు వచ్చింది. చేరింది. మరిది హైదరాబాద్‌లో ఉన్నాడు. అత్తయ్యగారు పక్క ఇంటికి వెళ్ళారు" అంది శిరీష.

శ్యామల పరీక్షగా స్నేహితురాలివైపు చూసింది. ఈమధ్య పడుతున్న అశాంతివలన కళ్ళకింద నలుపు ఏర్పడింది. "నువ్వు ఉత్సాహంగా ఉండు. త్వరలో ఏదో ఒకటి జరుగుతుంది" అంది.

శిరీష నవ్వింది. ఏదో ఒకటి జరగాలి. ప్రతీ సమస్యకి ఒక పరిష్కారం తప్పక ఉంటుంది. నా సమస్యకీ దేవుడు చూపిస్తాడు అనుకొంది స్వగతంగా.

శ్యామల వెళ్ళాక పిల్లలకి టిఫిన్ చేయడంలో మునిగింది. అదయ్యేసరికి పనిమనిషి వచ్చింది. ఆమె పనులు పూర్తయ్యాక వంట మొదలుపెట్టింది.

పిల్లలు ఆడుకొని వచ్చాక, వాళ్ళకి స్నానం చేయించి, బట్టలు మార్పించింది. ఇద్దరినీ

కూర్చుని హోమ్‌వర్క్ చేయమని చెప్పి తను స్నానానికి వెళ్ళింది.

రవి వస్తాడనగా సావిత్రమ్మ ఇల్లు చేరింది. అంతవరకూ పక్క ఇంటివాళ్ళతో కలిసి కోవెలకి వెళ్ళింది. శిరీష మాట్లాడ కుండా అత్తగారికి మంచినీళ్ళు అందించింది.

కోడలిని వండినవంట గూర్చి అడుగు తోంటే రవి వచ్చాడు. "వంటల గూర్చి అడు గుతున్నావు. నువ్వు లేవా అమ్మా" అని అడిగాడు.

శశాంక అందుకొన్నాడు, "అమ్మ సెలవు పెట్టడంవలన మామ్మ కొత్త ఉద్యోగంలో చేరింది. మధ్యాహ్నం మూడునుండీ అయి దుదాకా కబుర్లు. సాయంత్రం కోవెలకి షికార్లు. లేదా పక్క మామ్మగారికి పురాణం చదివి విన్పించడం"

సావిత్రమ్మ మనవడి తలమీద మొట్టి కాయ మొట్టింది. "వెధవా! వేలెడు లేవు. నాపై నేరాలా? "

వాడు తల నిమురుకొన్నాడు "మామ్మా! నేరాలు కావు, నీ దినచర్య వివరిస్తున్నాను"

శ్వేత తమ్ముడిని ఇంక ఆపమన్నట్లు చూసింది.

శిరీష అందరినీ భోజనాలకి రమ్మంటే రవి తనకి ఆకలి లేదన్నాడు.

సావిత్రమ్మ కొడుకుతో సరిగ్గా మాట్లాడలే కపోయింది.

శిరీష అత్తగారికి, పిల్లలకి అన్నంపెట్టింది. వాళ్ళు కాసేపు చదువుకొని నిద్రపోయారు. రవి పడకకుర్చీలో పడుకొని ఆకాశంవైపు చూస్తున్నాడు. చంద్రుడి చుట్టూ మేఘాలు. అవి నెమ్మది నెమ్మదిగా, చంద్రుడిని ఆక్ర మించుకొంటున్నాయి. ఇంత కాంతిమం తుడూ మబ్బుల చాటుకి వెళ్ళక తప్పలేదను కుంటూ నిట్టూర్చాడు.

శిరీష భాగవతం చదువుతూ కూర్చుంది. రవి భార్యవైపు చూశాడు. ఇదివరకు ఎంత ఉత్సాహం. ఇప్పుడు పలకరిస్తేనే పలుకు తోంది. కోరికలు కోరడం ఏనాడూ అలవా టులేదు. చెల్లి, తమ్ముడు దూరంగా ఉండటం, తను ఉద్యోగమని తిరగడంతో ఆమె ఒంటరితనాన్ని అనుభవిస్తోంది.

"శిరీ! పద! త్వరగా అన్నం తిని సెకండ్ షోకి వెళదాం" అతడు ఉత్సాహంగా లేస్తూ అన్నాడు.

శిరీష పుస్తకం మూసి "మీరు ఉదయమే స్కూలుకి వెళ్ళాలి. ఇప్పుడు ఎందుకు? ఆది వారం వెళదాం. మీరు ఎప్పుడనగా తిన్నారో భోజనాలు చేసి, కాసేపు కబుర్లు చెప్పుకొని పడుకొందాం" అంది.

"కబుర్లా! ఏవి చెప్పుకొన్నా మన ఇల్లు గురించి, ఖర్చు గురించే. ఏవి మరిచిపోదా మనుకొంటామో? అది జరగదు. సినిమాకే వెళదాం."

భర్త మాట వింటే ఏమవుతుందో శిరీషకి తెలుసు. ఉదయం అతడివంటకి అవస్థప డాలి. ఇద్దరూ భోజనాలు పూర్తిచేశారు. అతడు భోజనాల దగ్గర తమ స్కూలు సైన్సు మేష్టారి కబుర్లు చెప్పాడు.

ఆయనకి ఓపిక తక్కువ. బోర్డుమీద బొమ్మవేసి సైన్సు పాఠం చెపుతారు. ఒక సారి చెపితే కొందరు అర్థమవలేదన్నారుట. మరొకసారి చెప్పారు. తర్వాత ప్రశ్నలడిగితే మరో నలుగురు జవాబులు చెప్పకపోగా "మాకు బాగా అర్థమవలేదండీ!" అన్నా రుట.

దాంతో సైన్సు టీచర్‌గారికి కోపం నసా ళానికి అంటిందిట. "మీరో గాడిదలు. మీకు చదువుచెప్పడానికి వచ్చిన నేనో అడ్డగాడి దని. చదువు చవగ్గా ఉందా? ప్రతీ వెధవా చదువుకొంటానంటూ చేరడం, క్లాసులలో నానా గొడవా చేయడం

"ఏరా వెధవా! పక్కవాడితో మాటలాపి




ఏనాడైనా పాఠం విని ఏడ్చావా. మీలాంటి వెధవలను తన్ని, తిట్టి నేను హై.బి.పి. తెచ్చుకోవాలా? వెధవల్లారా! బుద్ధిలేక మిమ్మల్ని ప్రశ్నలడిగినందుకు నన్ను నేను నా చెప్పుతో కొట్టుకొంటాను" అని వాళ్ళను క్లాసు బయటికి గెంటారుట.

రవీంద్ర అన్నాడు "మాష్టారు చాలా మంచివారు. ఆయన మన సమస్య గురించి బాధపడుతూ అన్నారు గదా! ఈ సమాజంలో చదువు చెప్పడమంత తప్పు మరొకటి లేదు. వెధవలకి చదువుచెప్పకుండానే వెధవ తెలివితేటలు. ప్రతీ వెధవలో హింసా ప్రవృత్తే. ఈ దిక్కుమాలిన సినిమాలు, పత్రికలు వాటిని మరింత ప్రోత్సహించి వాళ్ళను పెడదారి పట్టిస్తున్నాయి.

"మా చెల్లెలిని హాయిగా ఎలిమెంటరీ స్కూలు అయినా కాదనకుండా చేరమనండి. 'కాకి ఒకటి నీళ్ళకి కావుకావు అని అరచెను' అంటూ రెండు కాకి పాటలు చెప్పేసి, హాయిగా రావచ్చును. మన సిద్ధాంతాలు మనల్ని ఏం నడిపిస్తున్నాయి చెప్పండి. మరింత బాధపెడుతున్నాయి తప్ప" అన్నారు.

శిరీష వంటిల్లు సర్దుకొని వచ్చేటప్పటికి పావుగంట పట్టింది. అతడు తిరుగుతున్న సీలింగ్ ఫానుని చూస్తున్నాడు. శిరీష రావడం చూసి నెమ్మదిగా అన్నాడు "అమ్మ ఎందుకిలాగ ప్రవర్తిస్తోందో అర్థమవడం లేదు"

శిరీషకి అతడు పడుతున్న బాధ తెలుసు. అందుకే అంది "అత్తయ్యగారి గురించి ఇప్పుడెందుకాలోచన? "

"ఇంటిపని వదిలి ఏనాడైనా బయటికి వెళ్ళిందా? ఇంట్లో ఒక్కదానివి వున్నావని తెలిసే, బయటికి కాలక్షేపమంటూ తిరుగుతోంది. నువ్వు ఎలా ఉన్నావో తెలియని దానిలాగ పనులు అప్పచెప్పి, మరీ గుడులంటూ తిరగాలా? ఇంట్లో కృష్ణా, రామా అనుకుంటే పుణ్యం రాదా? "

శిరీష భర్తవైపు చూసింది. "చూడండి. మీరు అతిగా ఆలోచిస్తున్నారు. ఏ అత్తగారికైనా కోడలు వండిపెడితే తినాలని ఉంటుంది. ఇన్నాళ్ళు నాకా అవకాశం కలగలేదు. ఇప్పుడు ఎలాగూ ఇంట్లో ఉన్నాను" అంటూంటే ఆమె గొంతు గద్గదికమైంది.

"ఇంటిపని నాకేం కష్టంకాదు" ఆమె మామూలుగా అవుతూ అంది. "ఇది నాకొక కాలక్షేపం. అవునుగానీ రేపు నేను వెళ్ళి సి.ఇ.వో.గారిని, ఛైర్మన్‌గారినీ కలుస్తాను"

"అనవసరంగా ఎంతకని తిరుగుతావు? "

శిరీష స్థిరంగా జవాబు చెప్పింది. "మన పని అయ్యేవరకూ! ఏం చేస్తాం? మనుష్యులు ఎలాంటివారైనా ప్రతీ ఒక్కరిలో ఏమూలో మానవత్వం ఉంటుంది. అది మరుగున పడిన వారివిషయంలో కాస్త కష్టపడి దాన్ని పైకి తీయాలి"

రవీంద్ర ఏం మాట్లాడలేకపోయాడు. శిరీషకీ మనసు చాలా వేదనగా ఉంది. ఏనాడూ ఆఫీసులకి వెళ్ళటమంటే తెలియని తను ఈనాడు ఆఫీసుల చుట్టూ అదేపనిగా తిరుగుతోంది. వృత్తిని సక్రమంగా నిర్వహించేవాడు ఎవరికీ తల వంచవలసిన అవసరం లేదనుకొంది. కానీ ఈనాడు సమాజం మెప్పు మీదే వృత్తులు ఆధారపడుతున్నాయని అర్థమౌతోంది.

ఎవరైనా మండలానికి వెళ్ళి పోతానంటే మిమ్మల్ని ఆ హైస్కూల్‌కి వేస్తాం అంటారు. తను వెళ్ళి ఎవరు యు.పి. స్కూలుకి వస్తారని పేరు పేరునా అడగగలదా? ఈ రోజుల్లో ఎవరి సుఖం ఎవరు వదులుకొంటారు?

ఈ సమస్య ఎలా తెములుతుంది?

ఎన్నాళ్ళు ఇలాగ స్తబ్దంగా గడపాలి? ఈపాటికి స్కూల్లో క్వార్టర్లీ పాఠాలు పూర్తిచేసే హడావుడిలో ఉండేది. తనే ఇలాగ బాధపడుతోందే, తన విద్యార్థులు ఆ కొత్త టీచర్‌తో ఇమడలేక ఏం బాధపడుతున్నారో?

శిరీష కళ్ళనుండి జాలువారిన కన్నీళ్లతో తలగడ తడిసిపోతోంది. బయటికి దూకుతున్న ఏడుపును తలగడవైపు తిరిగి ఎలాగో ఆపుకొంది.

రవి నిద్రపోవడం లేదు. పక్కనే భార్య అంతలాగ కదిలి కదిలి ఏడుస్తోంటే ఏ భర్త హాయిగా నిద్రపోతాడు? శిరీష సున్నిత హృదయం నలిగిపోతోందని తెలుసు. ఏంచేయగలడు?

"వెధవ ఉద్యోగం మానేస్తే సరి" అనే తల్లిలాగ తను అనగలడా? ఆ ఉద్యోగం శిరీషకి ప్రాణం. ఆ జీవితం ఇచ్చే తృప్తి గురించి ఒకనాడు తన మనసు విప్పి పరిచింది. భగవాన్ మా సమస్యను త్వరగా పరిష్కరించు, అనుకొన్నాడు.

శిరీష నాలుగు గంటలకి లేచి వంటచేసి పూజ చేసికొని బయలుదేరింది. సావిత్రమ్మ ఆమె బయలుదేరే వేళకి నిద్రలేచింది. రవీంద్ర, తానూ సెలవుపెట్టి వస్తానంటే వద్దని తను బయలుదేరింది.

సి.ఐ.వో ఆమెను చూసి మొహం చిట్లించుకొని చిరాకుగా అన్నాడు, "మేం చేసింది బాగుండలేదంటూ ఇలాగ ఎన్ని నెలలు సెలవు పెడతారు? "

"నాకు న్యాయం జరిగేవరకూ"

స్థిరంగా చెప్పిన ఆమె జవాబుకి ఆయన ఖంగుతిన్నాడు.

"100 శాతం సాధించిన టీచర్లని కావలసిన చోటికి ట్రాన్సుఫర్స్ చేస్తామన్నారు. నా సర్వీసు అంతా అలాగే చేశాను. నాకు మీరు ఇచ్చిన బహుమతి ఇది కదూ! నేను చేసిన సేవలను ఇలాగ గుర్తించారు కదూ!"

ఆయనకి ఆమె ఇలాగ ధైర్యంగా నిలదీయడంతో అసహనం పెరుగుతోంది. అందుకే గట్టిగా ఏది తోస్తే అది అంటున్నాడు.

"మీ చుట్టుపక్కల నాయకులను మంచి చేసుకోలేకపోయారు. మాపై ఎందుకు నేరం మోపుతారు. ఇది పంచాయితీరాజ్ వ్యవస్థని తెలియదా? "

"తెలియదు. ఎందుకంటే మహామహానాయకుల దగ్గరనుండీ గురువులకు విలువ ఇచ్చి పొగుడుతూంటే ఆ విషయాలు నిజమనుకొన్నాను. పూర్వం ఎంత గొప్పవారైనా గురువుదగ్గర తాము చిన్నవారమనుకొనేవారు. ఈనాడు టీచర్లనే పక్కదారి పట్టించే వ్యవస్థ తయారైంది. మీరే అంటున్నారు నాయకులను మంచి చేసుకోలేకపోయానని. విద్యార్థులను లాలించాలి. విద్యార్థులలో మంచిని నిద్రలేపాలి అనుకొని బతికే నాలాంటి వాళ్ళు ఇప్పుడు నిద్రలేవాలి. అధికారుల చుట్టూ పని ఉన్నా, లేకపోయినా తిరగాలి. పొగడాలి. పనులు జరగాలంటే లంచాలు ఇవ్వాలి. అలాగే నాయకులను ఆశ్రయించుకొని, వారి కాళ్ళదగ్గర పడుండాలి. అంతేనా మీ ఉద్దేశ్యం, ఇదేనా? "

శిరీష తీవ్రంగా అంటుంటే ఆయన ఏం చెప్తాడు? శిరీష ఆయన్ని చూస్తూ అంది "పుడమి వివరంబులేదే అడిగెదమన్నట్టిదయ్యె నప్పుడు కర్ణా!" అన్నాడు దుర్యోధనుడు. అలాగ మీరు నా ఉద్యోగ జీవితంలో చేసిన అపచారం మరువలేకపోతున్నాను. నేను కార్చిన కన్నీళ్ళు ఏమిటో నా తలగడకి తెలుసును, నాభర్తకి తెలుసును"

ఆయన ఇంక ఆగలేకపోయాడు "నేనేం చేశానండీ! నా పని నన్ను చెయ్యనీయ




కుండా నాయకులు జోక్యం చేసుకుంటూంటే..."

శిరీష తీవ్రంగా చూస్తూ అంది "పదవతరగతి పరీక్షలలో వదిలెయ్యమని నాయకులు కబుర్లు పెట్టారు. వినలేదు. డబ్బు ఎరచూపారు. నేను కుదరదన్నాను. తంతామని రాళ్ళు తీశారు. కాదనకుండా ఎదురు నిలబడ్డాను. ఏం చేశారు? తోకముడిచి పారిపోయారు"

ఆయన అప్రతిభుడయ్యాడు. తన విధి గురించి పరోక్షంగా చెపుతోంది.

"అడ్డదారిన, శ్రమ పడకుండా డబ్బు వస్తోంటే ఎవరూ కాదనలేరు. కానీ నా విద్యార్థిని కాదంది. ఒక గొలుసు తులంన్నరది గ్రౌండ్‌లో దొరికితే నిజాయితీగా తెచ్చి, పోయినవారికి ఇచ్చెయ్యమంది. ఆ నీతికి కదిలిపోయాను. అలాంటి పిల్లలకోసం ఇంకా మంచి భావాలు పండించడంకోసం ఈ వృత్తి వదలకూడదనుకొన్నాను. పేపర్లో మీరూ చదివారనుకొంటాను. ఆ పిల్లని తల్లిదండ్రులు తిట్టారట. అయినా ఆ పాప చలించలేదు"

ఆమె గొణిగినట్లు అంది "స్కూల్లో మానేసి ఇలాంటి చోట్ల బోధన ప్రారంభించాలి కాబోలు"

"మీరు ఎవరిచేతనైనా సెలవు పెట్టించండి" ఆయన అంతకుమించి దారి లేనట్లు అన్నాడు.

శిరీష స్థిరంగా అడిగింది, "సెలవు పెట్టిస్తే వాళ్లను నా ప్లేసులో వేస్తారు. అంతేకదా! ఎవరు ఏ ప్రదేశాలు కావాలనుకొంటారో మీకు, మీ నాయకులకు తెలుస్తుంది? నాకెలా తెలుస్తుంది? "

ఆయన తల తిప్పుకొన్నాడు. "మీ చుట్టుపక్కల నాయకులు ఎవరూ ఇందులో కల్పించుకోవడానికి ఇష్టపడటంలేదు. వాళ్లను ఒప్పించి రికమెండ్ చేయిస్తే ఏ దారైనా దొరుకుతుందేమో"

"విద్యకి సంబంధించిన రంగంలో విద్యరానివాళ్లు వచ్చి మనకి రికమెండేషన్ లెటర్ ఇవ్వాలి. అదా మీరు నన్ను తెమ్మంటున్నది? నాకు నాయకులు తెలియరు. స్కూలు ఎగ్గొట్టి వాళ్లని మెప్పించడానికి శ్రమపడేవాళ్లకి తెలుస్తుందేమో? "

ఆయన మాట్లాడటానికి చాలా కష్టపడవలసి వస్తోంది. కాని మనసులో ఆమెపై జాలి కూడా కలుగుతోంది. ఏ గొడవలు వచ్చినా ముందుగా జాగ్రత్తపరులు మేలుకొంటారు. తమ కార్యాలు చక్కబెట్టుకొంటారు. ఇలాంటి అమాయకులే మధ్యలో దొరికిపోతారు.

"అప్పర్ ప్రైమరీలో కొంతకాలం చేస్తే వీలు చూసుకొని తెస్తాను" ఆయన మరో దారి లేనట్లు గొణుక్కున్నట్లు అన్నాడు.

శిరీష తన మనసుని దాచుకోదలచుకోలేదు. "ఏమాత్రం వీలు లేదని తెలిసీ మా ప్రదేశాల్లో మీకు కావలసిన వాళ్లను వేయగలిగారు. ఏమన్నా అడిగితే నాయకుల రికమెండేషన్ వాళ్లకి ఉందన్నారు. నేను ముఖ్యమంత్రిగారి రికమెండేషన్ తెస్తాను. నాకు చేయగలరా? ఎలా తెస్తానని అడగవద్దు. ఆయన కాళ్లమీద పడి బతిమాలతాను. లేదా ఆమరణ నిరాహారదీక్ష చేస్తాను. అప్పుడు మీకు సులువుగా ఉంటుందికదండీ"

ఆయన నోటమ్మట మరి మాట రాలేదు. ఈ టీచర్ అంత ధైర్యం చేస్తుందా? ఏమో! తన ఎదుట నిలబడి అన్ని మాటలు మాట్లాడిన మనిషి చేయగలదేమో?

శిరీష వెళ్లి వస్తానంటూ బయటికి వచ్చేసింది. అంతసేపూ ఒక టీచర్ కూడా అక్కడే ఉన్నారు. ఆయన తల అక్కడక్కడా నెరిసింది. ఆయన పి.ఎఫ్ లోను పెట్టుకొ



న్నాడు. పాప పెళ్లి దగ్గరపడిందని, అధికారులను అర్థించడానికి వచ్చాడు. ఆయన ఆ గదిలోని సంభాషణంతా విన్నారు. ఇంకా వివరాలు కొరకు సిఇవో గారి పియేని కలిశారు. ఆయన ఒక నిట్టూర్పు విడిచి శిరీష గొడవంతా చెప్పారు. చివరికి అన్నారు,

"ఆవిడపట్ల అన్యాయం చేశాం. ఇప్పుడు ఏం చేయడానికీ లేదు. అందరూ చేరిపోయారు. మొన్నామధ్య మా గుమాస్తాల దగ్గరికి వచ్చి ఏమన్నారో తెలుసా? నా ఒంటిమీదనున్న బంగారం తీసుకోండి. మీకు కావలసింది పైరాబడేకదా! నన్ను, నా చదువుని సమాజానికి ఉపయోగపడే అవకాశం ఇప్పించండన్నారు"

ఆయన జాలిగా చూశారు. నిజమే ఈ రోజుల్లో అందరూ రోడ్డు పాయింట్ స్కూళ్లు అయితే చాలంటున్నారు. పాఠాలు చెప్పనక్కరలేని క్రింద తరగతులకైనా డెప్టేషన్ అంటూ వెళ్లి సుఖపడుతున్నారు. ఏ అధికారులు వచ్చినా తమ ప్రతిభను చూపడానికి ఇష్టపడక వారికిలేని అలవాట్లు చేస్తున్నారు. ఆయనకి తాము చేసే ఇనస్పెక్షన్ హడావుడి గుర్తు వచ్చింది.

ఆయనకి శిరీష ఎంతో నచ్చింది. ఆయన తన పని త్వరగా పూర్తి చేసుకొని ఆమె కొరకు ఎదురుచూడసాగారు.

ఆమె ఛైర్మన్‌గారిని కలిసింది. ఆయన "నేనూ నీ సమస్య గురించే ఆలోచిస్తున్నానమ్మా!" అన్నారు.

"త్వరగా ఆలోచించండి. నాకు మనసు ఎంతో నిరుత్సాహంగా ఉంటోంది. ఈ కాలం నన్ను మింగేస్తుందా అన్పిస్తోంది" అంది తల వంచుకొని.

ఆయన ఆ మాటలకి చలించిపోయారు. "మావాళ్లకి ఎన్నో మార్గాలు చెప్పానమ్మా! తప్పు చేయడం ఎంతో సులువుగా అయింది. ఇప్పుడు న్యాయం చేయడానికి రూల్స్ అడ్డు వస్తున్నాయి"

శిరీష నవ్వింది. ఆ నవ్వులోని నిరాశ, నిస్పృహ ఆయనని ఖిన్నుడిని చేశాయి. "అవును సార్! మన సుఖంకోసం, సామాజిక న్యాయం కోసం ఏర్పరచుకొన్న రూల్స్‌ను మనం స్వార్థంకోసం తృణీకరిస్తున్నాం. వాటిని అధిగమించి మనవాళ్లకి కిరీటాలు తొడుగుతున్నాం" అంది శిరీష.

"ఏం చేయమంటావమ్మా! మా నాయకులు ఏమంటారో తెలుసా? రూల్స్ ప్రకారం మూలనున్న ముసలమ్మ అయినా పరిపాలన చేస్తుంది. ఈ రూల్స్‌ని ఇతరుల కొరకు పెట్టాం. మన కొరకు కాదని అంటున్నారు"

ఎటువంటి హిపోక్రసీ లేకుండా అంటున్న ఆయనని శిరీష అభినందనగా చూసింది.

ఆయన అనునయంగా అన్నారు "ఎక్కడో అక్కడ చేరి పోవమ్మా! జీతం రాకపోతే ఇబ్బంది కాదూ? "

అప్పుడు వచ్చాయి ఆమెకి కన్నీళ్లు.

"మధ్య తరగతివాళ్లమే. జీతం లేకపోతే ఇబ్బందికన్నా ఉద్యోగం లేకపోవడం, ఖాళీగా కూర్చోవడమే ఇబ్బందిగా ఉంది"

ఆయన దీర్ఘంగా ఆలోచించారు. ఇంకా ఈ సమస్య తెమలడానికి ఎన్ని నెలలు పడుతుందో?

శిరీష నెమ్మదిగా నవ్వుతూ అంది "తప్పు చేసింది నా పైవాళ్లు. కానీ శిక్షింపబడుతున్నది నేను. నా బిడ్డలు, విద్యార్థులు, నా భర్త ఎంత నలిగిపోతున్నారో మీకు తెలుసా? "

ఆయన ఏమీ మాట్లాడలేదు.

"సర్లెండి. మీకోసం చాలామంది వేచి చూస్తున్నారు. నేను వెళతాను. ఎలాగో సెలవు పెట్టేస్తున్నానుకదా! ఎప్పటికి తెమి




లితే అప్పటికి తెములుతుంది"

శిరీష కాంప్లెక్సువైపు నెమ్మదిగా నడుస్తోంది. వెనుకనుండి వచ్చిన ఆ పెద్దాయన తననితాను పరిచయం చేసుకొన్నాడు.

ఆయనతో సంభాషణ చేయాలని శిరీషకి ఏమాత్రం అన్పించడంలేదు. కానీ బావుండదని ఊరుకొంది.

ఉదయం నుండి తిరిగిన తిరుగుడుకి అలసటగా ఉంది. ఇక్కడికి వచ్చినప్పుడల్లా తన బాధ రెట్టింపవుతుంది. మౌనంగా దాన్ని దిగమింగుదామంటే ఈయన పడనీయడంలేదు.

ఆయన శిరీషను దీక్షగా చూస్తున్నారు. "నా పేరు మార్కండేయులు. నేను కుసుమూరు హైస్కూల్‌లో ఎస్.ఎస్ అసిస్టెంటుగా పనిచేస్తున్నాను."

శిరీష చప్పున తలెత్తి చూసింది. కుసుమూరు రవీంద్ర పనిచేస్తున్న వైపునకు మరో తోవలో ఉంది.

ఆయన నవ్వుతూ "ఆడపిల్లకి ఉద్యోగం చేయడమే గొప్ప. వేసిన చోట చేరిపోక పోయావామ్మా" అన్నారు.

శిరీష ఒక నిముషం ఊరుకొంది. తర్వాత అంది "విద్య వ్యాప్తిని పొందాలి. నేను ఒక్కదాన్ని పాఠంచెప్పకపోతే ఏమవుతుందనుకొంటే ఏమీకాదు. కానీ నేను ఒక్కదాన్ని కష్టపడితే కొంతమంది ఉత్తమ విద్యార్థులు తయారవుతారు.

"కొన్ని విలువలను వారిద్వారా నేను ఈ సమాజానికి నేర్పవచ్చును. ఈ దేశాన్ని అంతటినీ బాగుచేయలేకపోవచ్చును. కానీ ఒక విద్యావతిగా పాడుచేయడం నాకిష్టంలేదు. నాకు నేను చివరివరకూ ఈ సమాజానికి ఉపయోగపడాలనుకోవడం తప్పా? "

ఆయన తరువాత ఏవేవో విషయాలపై ఆమెతో సంభాషణ జరుపుతూనే ఉన్నారు. శిరీషకి పెద్దలంటే ఉన్న గౌరవం వలన ఓపికగా అన్నీవింది, మాట్లాడింది.

తన ఊరు రాగానే ఆయన "ఇక్కడ మా చెల్లెలుందమ్మా! చూసి రేపు వస్తాను. నిన్ను నేను మరిచిపోనమ్మా! నువ్వు కూడా నన్ను గుర్తుంచుకొంటావుకదూ" అన్నారు.

ఇంటికి వచ్చేటప్పటికి శ్రీనివాసు, భర్త మాట్లాడుకొంటూ కన్పించారు. ఇద్దరూ శిరీషకోసం వద్దామనుకొంటూంటే ఆమె వచ్చేసింది. "శిరీ! మన శ్రీనివాసుకి కంగ్రాట్స్ చెప్పు" అన్నాడు రవీంద్ర.

శిరీష తలెత్తి ఆశ్చర్యంగా "ఎందుకూ? " అంది.

"వాళ్ల చెల్లికి, అతడికి మంచి ధనవంతుల సంబంధం వచ్చిందిట. ఎలాగైనా ఈ కుండ మార్పిడి సంబంధాలు కుదర్చాలని వాళ్ల నాన్నగారు అనుకొంటున్నారు"

శిరీష శ్రీనివాసువైపు చూసింది. అతడు నవ్వుతూ "వాడి మాటలకేంగానీ మీరు వెళ్లిన పని చెప్పండి" అన్నాడు.

శిరీష అంతకన్నా పట్టుదలగా "నా పని కేంగానీ మీరు మీ పెళ్లి సంబంధం తాలూకా వివరాలు చెప్పండి" అంది.

శ్రీనివాసు తప్పట్లు కొడుతూ "మా వాడి బుద్ధులు మీకూ వచ్చేశాయన్నమాట. ఆరు నెలలు సహవాసం చేస్తే వాళ్లు వీళ్లవుతారట. అలాగుంది మీ వ్యవహారం" అన్నాడు.

అందరూ కాసేపు పెళ్లిళ్ల మీద కబుర్లు చెప్పుకొన్నారు. శ్రీనివాసు "నాకు ధనవంతుల అమ్మాయి వద్దు రవీ! నన్ను అర్థం చేసుకొని, నా జీవితంలో కలిసిపోయే అమ్మాయి కావాలి. నాకు ఒక సామాన్యమైన అమ్మాయి చాలు. ఆమె ప్రవర్తన మాత్రం అసామాన్యమైనదిగా ఉండాలి"

రవి మనసులో అస్పష్టంగా ఒక రూపం



కన్పించింది. ముందు తన సందేహం నివృత్తమైతే అప్పుడు పైకి అనవచ్చును. తర్వాత అందరూ శిరీష ఉద్యోగ సమస్య గురించి కాసేపు మాట్లాడుకొన్నారు.

"తాను ఈ ఉద్యోగం ఒక్కటే చేయగలదా? పదిమంది పిల్లలతో తనే ఒక స్కూలు ప్రారంభిస్తే... తన ఆలోచనకి ఆమెకి నవ్వు వచ్చింది. ఈమధ్య తన ఆలోచనలకి అంతు ఉండటంలేదు. కొత్తగా వచ్చిన జబ్బు ఇది అనుకొంది.

దసరా సెలవులకని లావణ్య వచ్చింది. అశోక్ పండుగ ముందు వస్తానని ఫోను చేశాడు.

వదినగారు వంటపనితో బిజీగా ఉండటంతో లావణ్య, తనూ సాయంచేస్తూ "ఈ కొత్త డ్యూటీలు ఎప్పటినుండి? " అని అడిగింది.

"ఎలాగూ ఉద్యోగంలేదు. ఖాళీగా ఉంటే ఏమొస్తుందని మొదలెట్టాన్లే" అని శిరీష అన్నా లావణ్య తృప్తి పడలేదు.

ఆమె వస్తూ వదినగారికి, తల్లికి కొత్త చీరలు తెచ్చింది. పిల్లలకి బట్టలు తెచ్చింది. అక్కడ సాయంత్రం వేళలో ఒక రెసిడెన్షియల్ స్కూల్లో పిల్లలను దగ్గరుండి చదివించడానికి, తెలియనివి చెప్పడానికి లావణ్య ఒప్పుకొందిట. ప్రైవేటు స్కూల్ కనుక ఏడు వందలు ఇస్తామన్నారుట.

శిరీష దెబ్బలాడిందిగానీ "నా కాళ్లమీద



నేను నిలబడి చదువుకొంటూంటే నీకు గొప్పగా లేదూ" అంది లావణ్య. శిరీష నవ్వుతూ లేదంది.

లావణ్య విషయం తెలిసి ఉదయం కొందరు చుట్టుపక్కలవాళ్లు తమ పిల్లలకి ప్రైవేటు చెప్పమన్నారుట. ఉదయం గంటన్నర ఆ పని.

రవీంద్ర రాగానే శిరీష ఈ విషయాలు చెప్పేసింది. అతడు చెల్లిని సాలోచనగా చూశాడు. ఇంటి పరిస్థితులు లావణ్య కన్నా ఎవరు బాగా అర్థం చేసుకోగలరనుకొన్నాడు.

సాయంత్రం రవీంద్ర భార్యను, చెల్లిని సినిమాకి వెళదామని పిలిచాడు. లావణ్య

తను ఉండిపోయి వదినని పంపింది. తల్లితో మాట్లాడే అవకాశంకోసం ఆమె చూస్తోంది.

తల్లికి తాను చెప్పవలసి రావడం కష్టం కలిగించినా, చెప్పక పోతే ఆవిడ ప్రవర్తన నలుగురిలో నవ్వుల పాలవుతుంది. వదిన ప్రవర్తన ఎలాంటిదో ఆవిడకి తెలుసుకదా! మరి ఎందుకు ఈ సమయంలో ఆమెను కష్టపెట్టాలి? అందుకే చెప్పడానికుపక్రమించింది.

ఉద్యోగ జీవితంలో చేదు అనుభవాన్ని ఎదుర్కొంటున్న శిరీషను ఇంకా సాధించడం అర్థమైన పనా? పన్నెత్తి ఏనాడూ ఎదురు జవాబు చెప్పని కోడలు ఆవిడకి గుర్తు వచ్చింది. తను రెండు పూటలా వంట చేయలేదంటే మౌనంగా పని అందుకొంది. తాను చిన్నా, చితకా మాటలు అన్నా ఎవరికీ ఎప్పుడూ చెప్పలేదు. నిజమే లావణ్య చెప్పినట్టు మనుష్యుల విలువ తెలుసుకుని ప్రవర్తించాలి. అలా సావిత్రమ్మ కోడల్ని గురించి ఆలోచించేలా లావణ్య మాట్లాడుతూ ఉండగా పాల వాడికేక. గిన్నె పట్టుకొని వెళుతూ, వసారాలోకి వచ్చిన లావణ్య శ్రీనివాసుని చూసి తెల్లబోయింది. తనని తాను నిలవరించుకొని "మీరు వచ్చి ఎంత సేపయింది? అన్నయ్య, వదిన సినిమాకి వెళ్లారే. పిల్లలు చెప్పలేదా? " అంది.

అతడు మెల్లగా నవ్వాడు "పిల్లలు బిస్కట్ పాకెట్ తెచ్చుకొంటామని వెళ్లారు" అన్నాడు.

"ఒక్కరూ కూర్చుండకపోతే నన్ను పిలవ వచ్చుకదా!" అంది. తల్లికి, తనకి మధ్య జరిగిన సంభాషణ విన్నాడేమోనని అనుమానం. అన్నయ్యకి చెపుతాడేమో! ఇద్దరూ ప్రాణమిత్రులు కదా?

లావణ్య ఆలోచనలన్నీ అతడికి అర్థమైనట్లు నవ్వాడు. "ఈ రోజు లేచిన వేళ బావుంది. రవి లేడు ఎలాగా అనుకొన్నా, మంచి సూక్తి విన్పించారు. మనుష్యుల విలువ తెలిసికొని ప్రవర్తించాలి. ఇంక వస్తాను" అంటూ లేచాడు.

లావణ్యకి అతడి నవ్వు, ప్రవర్తన కొత్తగా ఉంది. అతడు తమ ఇంట్లో చనువుగానే తిరుగుతాడు. కానీ ఈనాడు ఏదోలాగ అన్పిస్తున్నాడు. తన మాటలను అతడు రిపీట్ చేయడం గుర్తువచ్చి నవ్వుకొంది.

ఇంట్లో మళ్లీ సందడి. దసరా పండుగ వచ్చింది. అశోక్ వచ్చాడు. సరదాగా గడిచింది. "అందరం ఇంట్లో ఉంటే ఎంత బావుంది! వదినా మీరు ఇంక ఉద్యోగం మానెయ్యండి. ఇంక ఈ అయ్యగారు సంపాదిస్తారు" అంటూంటే లావణ్య అందుకొంది...

"ఈ అయ్యగారు సంపాదిస్తే మరో అమ్మగారు వచ్చి నా భర్త, నా డబ్బు అంటూ హోదా చలాయిస్తారు. మా వంతు పెంచడం, బాధ్యతలు పడటమే నాయనా?" అంది తల్లిని అనుకరిస్తూ. సావిత్రమ్మ కూతురిని ప్రేమగా చూసింది.

"శిరీషా! నువ్వు, లావణ్య ఒకసారి వెళ్లి మీ దొడ్డమ్మగారిని చూసిరండి" ఆవిడంతట ఆవిడే పర్మిషన్ ఇచ్చింది. ఏదో అనబోయిన శిరీష తననితాను నిలవరించుకొని అలాగేనంటూ తల ఊపింది.

మర్నాడు పోస్టులో శిరీషకి ఆర్డర్స్ వచ్చాయి. అశోక్ వాటిని తెచ్చి చూపిస్తోంటే ఆమె నమ్మలేకపోయింది.

తనకి మళ్లీ హైస్కూల్లో వేసినట్లు ఆర్డర్స్. నిజమా... ఎన్నాళ్లకి? నాలుగు నెలలకాలం నిర్దాక్షిణ్యంగా నడిచిందే. ఈ కళ్లు చూస్తున్న విషయం నిజమా?

నిజమే... తనని కుసుమూరు హైస్కూల్లో ఎస్.ఎస్. అసిస్టెంట్‌గా వేసి




నట్లు, అక్కడి ఎస్ఎస్ అసిస్టెంటును మరో మండలంలోని అప్పర్ ప్రైమరీ స్కూల్‌కి బదిలీ చేస్తున్నట్లు ఆర్డర్స్. శిరీష కళ్లు మరొకసారి తన ఆర్డర్‌ని చూసుకొన్నాయి.

ఆమెకి ఆనాడు జరిగిన సంభాషణ గుర్తు వచ్చింది. తన పేరు మార్కండేయులంటూ ఆయన పరిచయం చేసుకోవడం గుర్తు వచ్చింది. ఆయన తనకోసం తన ఉద్యోగాన్ని వదులుకొన్నారా! మండలానికి వెళ్లడానికి ఒప్పుకొన్నారా! నిజమా?

ఆయనెవరు? తనెవరు? ఇదేమిటి? ఆయాచితంగా ఇంత వరం ప్రసాదించారు. తన ఏడుపుని, బాధని చల్లార్చడానికి ఆ పరమశివుడే మార్కండేయులను ఈ రూపంలో పంపాడా?

సాయంత్రం రవీంద్ర వచ్చి ఆర్డర్స్ చూసి ఆనందించాడు. ఇంతగా ఇతరులకి ఉపకారం చేసే ఆయనని వెంటనే కలుసుకోవాలన్పించింది.

మర్నాడు ఆయనని కలుసుకోవాలని బయల్దేరబోతూంటే ఒక అబ్బాయి వాళ్లింటికి వచ్చాడు. రవీంద్ర ఆ అపరిచిత యువకుడివైపు ఎవరా అన్నట్లు చూసి కూర్చోమన్నాడు.

"నేను మార్కండేయులుగారబ్బాయినండీ! మా నాన్నగారు మీకు ఈ ఉత్తరం ఇచ్చి రమ్మన్నారు" అంటూంటే శిరీష గబుక్కున ఇవతలికి వచ్చింది.

అతడు ఆమెను ఆరాధనగా చూస్తూ "మీరు శిరీషగారుకదూ? " అన్నాడు. శిరీష ఆశ్చర్యపోతూ తల ఊపింది. తండ్రి రాసి ఇచ్చిన ఉత్తరం ఆమెకిచ్చి, పనుందంటూ అతడు వెళ్లిపోయాడు. శిరీష ఆతృతగా ఉత్తరం తెరిచింది.

"చి. సౌ. శిరీషకి,

మీ బాబయ్య దీవించి రాయునది. ఆర్డర్స్ చూసి ఉంటావు. ఈ పని ఎందుకు చేశానా అని ఆలోచిస్తూ ఉంటావు. మా అమ్మాయి వయసు దానివి కనుక నిన్ను మన్నించడంలేదు. మరో పది నెలలలో రిటైర్ కాబోయే నేను ఈ పని చేయడం, నీకు న్యాయం చేయడానికే. ఒక మంచి ఉపాధ్యాయురాల్ని భావితరాలకి ఇద్దామన్న ఆలోచన నన్ను ఈపనికి పురికొల్పింది. ఎలాగూ రిటైరయ్యే నేను ఎక్కడ ఉన్నా ఫర్వాలేదు. నా సెలవు కూడా కొన్నాళ్లు వాడుకొంటాను. నీకు జరిగిన అన్యాయం తెలిసింది. నీ ఆవేదన నన్ను కదిలించింది.

వయస్సు మళ్లిన నేను ఈ వ్యవస్థతో రాజీ పడవచ్చును. వయసులో నున్న నువ్వు రాజీ పడనందుకు అభినందిస్తున్నాను.

"నీ ఉద్యోగంలో నువ్వు చేరాక, నేను ఆనందంతో నిన్ను చూడటానికి వస్తాను. నిన్ను స్కూల్లో, నీ కుర్చీలో మాత్రమే చూడాలనుకొంటున్నాను. ఉంటాను.

మీ బాబయ్య మార్కండేయులు"

ఉత్తరం చదివిన శిరీష కళ్లల్లో కన్నీళ్లు. ఏనాటి రుణం ఇది. ఇంతలాగ తనని అర్థం చేసుకొని, తన లక్ష్యంవైపు తనని నడిపించిన ఆయనకి ఎలా కృతజ్ఞతలు చెప్పుకోగలదు?

కొత్త ఉత్సాహంతో మర్నాడు పెందరాళే స్కూల్‌కి బయలుదేరింది శిరీష.

ఆ హైస్కూల్ ప్రాంగణంలోకి అడుగుపెడుతూంటే గుండెల్లో చిత్రమైన సందడి. చెప్పలేని వింత అనుభూతి. శరీరమంతా విచిత్రమైన గగుర్పాటు.

విద్యార్థులందరూ వరండాలో నిలబడి ఆసక్తిగా గమనిస్తోంటే, శిరీష చిరునవ్వుతో ముందుకు నడిచింది.



# చతుర కతలు

## అచ్చర ఇజయం

ఎన్నికలు దగ్గరపడ్డాయి. టిక్కెట్టు లేని ప్రయాణికుల జాబితాలో చేరి తిరుగుబాటు అభ్యర్థిగా నామినేషన్ వేస్తే ప్రమాదం అని మళ్ళీ ప్రస్తుత శాసనసభ్యునికే టిక్కెట్టిచ్చేరు.

అయితే అతన్ని గతంలో గెలిపించిన నియోజకవర్గపు గ్రామస్థులు తిరగబడ్డారు.

"అదేటి బాబయ్యా! ఆల్లెప్పుడో అచ్చర ఇజయంతో రేత్తిర్లు బడికెల్లి అఆలు నేర్చేసుకున్నారండయ్యగోరూ!" అన్నాడు పాలేరు.

"అదికాదురా వెర్రిమొగమా! వాళ్లందుకనే తెలివిమీరేరు. మనం వాళ్లకి వేరే అఆలు నేర్పాలి" అన్నారు ఎమ్మెల్యేగారు.

అనేసి మర్నాడు రాష్ట్ర రాజధానికి వెళ్ళిపోయారు

రెండ్రోజులు పోయాక ఎమ్మెల్యేకి వ్యతిరేకంగా వున్న ఓ ఊళ్లో ప్రమాదవశాత్తు



ఛస్తే మళ్ళీ ఆ ఎమ్మెల్యేకి ఓటు వెయ్యబోమని మొరాయించుక్కూచున్నారు. ఈ విషయం, పాలేరు ద్వారా ఆ ఎమ్మెల్యేగారికి తెలిసిపోయింది.

"వాళ్లకి అఆలు నేర్పకపోతే మనకు ఓటెయ్యర్రా! అఆలు నేర్పాలి" అన్నారు ఎమ్మెల్యేగారు.

పేదల గుడిసెలు తగలబడిపోయాయి. పాపం! కట్టుబట్టల్తో రోడ్డుమీద పడ్డారు ప్రజలు. అసలే వేసవి మండిపోతోందికూడాను.

ఈ విషయం ఎమ్మెల్యేగారికి ఫోన్ ద్వారా తెలిసి ఆయన గుండె తరుక్కుపోయింది. తన నియోజక వర్గ ప్రజలు కష్టాల పాలు కావడమా? వీల్లేదు.

హుటాహుటిన ఓ లారీతోసహా బయలుదేరి ఆ గ్రామప్రజల్ని పరామర్శించి,





పంచెలు, చీరలు, దుప్పట్లు పంచిపెట్టారు. వండుకుందికి బియ్యం, పప్పుధాన్యాలు, పాత్ర సామాన్లు ఇచ్చారు.

ఆ సంగతెలిసి ఆ ఎమ్మెల్యేగారు ఆ గ్రామప్రజల దృష్టిలోనేకాక నియోజకవర్గం మొత్తం ధర్మప్రభువైపోయారు. మళ్ళీ ఆయనకే అఖండవిజయం చేకూర్చారు జనం.

"ఇప్పుడు తెలిసిందిరా అఆలు నేర్పడం అంటే ఏంటో?" అన్నారు ఎమ్మెల్యేగారు హైదరాబాద్ బయలుదేరేముందు నిదానంగా మీసాలు మెలేస్తూ.

"తెల్దు బాబయ్యా!" అన్నాడు పాలేరు.

"అ అంటే అగ్రెట్టేయ్ అనీ

ఆ అంటే ఆదుకో! అనీ అర్థంరా వెర్రిమొగమా" అన్నారు ఎమ్మెల్యేగారు.

**-బులుసు- జి-ప్రకాష్**

---

# అసలు విషయం!

సుబ్బారావుకి రూల్స్ అంటే రూల్సే. రూల్స్‌ని గౌరవించని బ్రతుకు ఒక బ్రతుకా అంటాడు. అన్ని పనులు తు.చ. తప్పకుండా రూల్స్ ప్రకారం చేయడం సుబ్బారావు అలవర్చుకున్నాడు.




చిన్నప్పుడు హోమ్‌వర్క్ సకాలంలో పూర్తిచేయడం దగ్గరనుంచి, పెద్దయ్యాక రేషన్‌షాప్‌కి వెళ్ళినా, రైల్వేస్టేషన్‌కి వెళ్ళినా రూల్స్‌ప్రకారం క్యూని పాటించడమూ నేర్చుకున్నాడు.

సైకిల్‌మీద రాత్రి వెళ్ళేటప్పుడు లైట్ లేకుండా వెళ్ళేవాడు కాదు. పరీక్షలు పాసయి ఉద్యోగంలో చేరాక స్కూటర్ కొనుక్కున్నాడు. స్కూటర్‌మీద వెళ్ళేటప్పుడు ట్రాఫిక్ రూల్స్ మరీ పకడ్బందీగా పాటించేవాడు. స్కూటర్లకి నిర్దేశించిన 'లేన్'లోనే వెళ్ళేవాడు. అనుమతించిన వేగంకన్నా తక్కువ వేగంతోనే వెళ్ళేవాడు. 'స్టాప్, లుక్, ప్రొసీడ్' ట్రాఫిక్ రూల్స్‌ని హద్దుమీరేవాడు కాదు.

అటువంటి సుబ్బారావు ఈరోజు ట్రాఫిక్ రూల్స్‌ని అతిక్రమిస్తూ, స్పీడ్ లిమిట్‌ని లెక్క చెయ్యకుండా స్కూటర్‌తో మెయిన్‌రోడ్‌మీద దూసుకుపోతున్నాడు.

అది చూసిన ట్రాఫిక్ ఇన్‌స్పెక్టర్ తన మోటార్ సైకిల్‌మీద సుబ్బారావుని వెంబ

డించి తపి "ఏమిటి బాబూ ఏ లోకానికి ప్రయాణం" అని అడిగాడు.

"పెళ్ళికండీ, ముహూర్తం టైమ్ ముంచు కొచ్చేస్తోందండీ" అన్నాడు సుబ్బారావు.

"ఏం కొంప మునిగింది. ముహూర్తానికి వెళ్లకపోయినా లంచ్‌కి అందుకుని లాస్ట్ బ్యాచ్‌లోనైనా కూర్చోవచ్చుగదా" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"బాబ్బాబు, నేను ముహూర్త సమయానికి వెళ్ళక తప్పదు" అని బతిమాలుకున్నాడు సుబ్బారావు.

"ఏం ఎందుకు? పెళ్ళాగిపోతుందా? " అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"ఔను సార్" అన్నాడు సుబ్బారావు.

"పెళ్లికి వెళ్తున్నా, ప్రమాణ స్వీకారానికి వెళ్తున్నా నిన్ను వదిలిపెట్టను. కేసు బుక్ చేస్తాను" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"సార్. నేను వెళ్ళకపోతే పెళ్ళాగిపోతుంది" బతిమాలుకుంటూ అన్నాడు సుబ్బారావు.

"అలాగా. అసలు కథ ఏమిటి? " ఫోర్స్ తగ్గించి అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"సార్... నేనే పెళ్లికొడుకును. సరైన ఉంగరం దొరక్క షాపులో ఆలస్యమైంది సార్!" చెప్పాడు సుబ్బారావు.

**-తాజీప్రసాద్**

## విష(మ) పరిస్థితి

ఓట్ల బలం లేకపోయినా నోట్ల బలంతో రాజ్యమేలుతున్న మాజీమంత్రి టోపేశ్వర్రావుని చంపేయాలన్నంత కసిగా వుంది పాపారావుకి.

కుకింగ్ గ్యాస్ డీలర్‌షిప్ ఇస్తానంటే రిటైర్‌మెంట్ బెనిఫిట్స్ బాపతు లక్షరూపాయలూ బిళ్లకుడుముల్లా టోపేశ్వరరావు టోపీలో పోశాడతను. అది జరిగి ఆర్నెల్లయినా అదిగో ఇదిగో తప్ప ఏదీ కనిపించ లేదు. పైపెచ్చు ఆమధ్య అడ్డదారుల్లో సంపాదించిన డీలర్‌షిప్పులూ, ఏజెన్సీలూ సుప్రీంకోర్టు సుత్తిదెబ్బలకు కూలిపోవడంతో తన సొమ్ము తనకు వాపసు చేసేయమని అడిగాడు టోపేశ్వరరావుని.

టోపేశ్వర్రావు టోపీ ఎగిరిపడేలా నవ్వాడు. "భిక్ష కావల్సొస్తే ఓ పదిరూపాయలు అడిగి పట్టుకెళ్లు. అంతేగాని లక్ష అంటూ జోకు వెయ్యకు. జోకులింటే నాకు డోకులొస్తాయి. జోకులేస్తే పోలీసులొచ్చి నిన్ను లాఠీలతో డొక్కలో పొడిచి బొక్కలో తోస్తారు" అంటూ కసురుకున్నాడు.

షాక్ తిన్నాడు పాపారావు. జీవితమంతా ధారబోసి సంపాదించుకున్న సొమ్మది. బక్కవాడికోపం పక్కవాడు కూడా పట్టించుకోడు. ఇక తన గోడు విని ఆదుకునే నాథుడెవడు? ! కడుపుమండిన పాపారావు టోపేశ్వర్రావుని లేపేయాలనుకున్నాడు.

టోపేశ్వర్రావుకి రోజూ తెల్లవారుఝామున తోటలో తిరిగే అలవాటుంది. ఆ సమయంలో పాముచేత కరిపించాలని ప్లాన్ వేశాడు పాపారావు. తనకు తెలిసిన ఓ పాములవాణ్ణి సంప్రదించాడు.

"పాము గురి తప్పితే మనిద్దరికీ ముప్పే జాగ్రత్త" అంటూ హెచ్చరించాడు వాడికి అడ్వాన్సు ఇస్తూ.

"ఇది సిసలైన నల్లత్రాచు. దీని కాటుకు దీటైనది లేదు" అంటూ హామీ ఇచ్చాడు వాడు. "మనిషిని చూపించి మీరు తప్పుకోండి. నేను నాగును ఉసిగొలుపుతాను. ఆనక కబురందుకుని శవాన్ని చూడ్డానికి వద్దురుగాని" అన్నాడు వాడు ధీమాగా.

మర్నాడు చావు కబురుకోసం ఎదురుచూస్తూన్న పాపారావు దగ్గరకు ధుమధుమలాడుతూ వచ్చాడు పాములవాడు.

"నువ్వు చంపదలచుకున్న మనిషి రాజకీయ నాయకుడని ఎందుకు చెప్పలేదు నాకు? " అంటూ విరుచుకుపడ్డాడు.



"చెబితే? " తెల్లబోయాడు పాపారావు.

"ఈ పనికి వొప్పుకునేవాణ్ణి కాదు"

"భయమా? "

"నా బొంద! రాజకీయ నాయకుణ్ణి కాటేసిన ఏ పాము బతికి కుబుసం పోసుకుందయ్యా? " అంటూ ఎదురుప్రశ్న వేశాడు వాడు.

"అంటే? "

"రాజకీయ నాయకుడికి నిలువెల్లా విషమే. ఆ విషం ముందు పాము విషమెంత? !"

"ఆc? !"

"ఔనయ్యా. నువ్వు చూపించిన మనిషి బ్యాక్‌గ్రౌండ్ తెలీక నా నాగుని పంపించాను. ఆణ్ణి కాటేయగానే అక్కడికక్కడే గిలగిల తన్నుకుని చచ్చిందది"

అదిరిపడ్డాడు పాపారావు "మరి అతనో? '

"ఆడికేం? నిక్షేపంలా వున్నాడు"

"మైగాడ్! చాలా విషమ పరిస్థితి!" అంటూ తల పట్టుకుని కూలబడిపోయాడు పాపారావు.

**- తిరుమలశ్రీ**

---

# ప్రేమలేఖ

**ర**చయిత రవిచంద్ర మరోసారి జుట్టు పీక్కున్నాడు. చేతిలో ఉన్న సిగరెట్ విసిరేసి మరో సిగరెట్ వెలిగించి తృప్తిగా దమ్ములాగి అరవయ్యోసారి తల విదిలించాడు. అతని కాళ్లదగ్గర దస్తా తెల్లకాగితాలు ఉన్నాయి. మరో దస్తా అతనిచేత రాయబడి చిరిగి ముక్కలైపడివున్నాయి.

అతను అంతగా ఆలోచిస్తున్నది కథ కోసమో సీరియల్ కోసమో కాదు. అతని ప్రియురాలు రేఖ సరిగ్గా ఇరవైనాలుగు గంటలక్రితం ఓ చిన్న కోరిక కోరింది.

"చంద్రా! ప్రతీ మగాడు తన ప్రియురాలికి ప్రేమలేఖ రాస్తాడుకదా? నువ్వు రచయితవికదా? గొప్పగా డిటెక్టివ్ నవల్సే రాస్తావని పేరుందికదా? అలాగే నాక్కూడా ఓ అద్భుతమైన ప్రేమలేఖ రాయవా? " అని అడిగింది గారంగా.

"ఓస్ అదెంతపని రేపీపాటికల్లా అద్భుతమైన ప్రేమలేఖ నీ చేతుల్లో ఉంటుంది" ధీమాగా హామీ ఇచ్చాడు.

కానీ అదెంత కష్టమైన పనో ప్రేమలేఖ



రాయడానికి కూర్చున్నప్పుడు కానీ తెలిసిరా లేదు. అతనికి చాలా అవమానంగా ఉంది. ఆంధ్రప్రదేశ్‌లో పేరున్న డిటెక్టివ్ కథల రచయితగా, భేతాళ కథలు రాసే రైటర్‌గా పేరున్న తను ఓ ప్రేమలేఖ రాయలేకపోతు న్నాడు ఛీ! ఛీ! ఎంత షేమ్. తను కాస్తో కూస్తో శృంగార నవలలు చదివినా బాగుం డేది. కాని ఇప్పుడు ఏం ప్రయోజనం?

ఆలోచనలనుండి తేరుకుని మరోసారి తృప్తిగా దమ్ములాగాడు. కళ్లు మూసుకొని ఆలోచించాడు. చటుక్కున అద్భుతమైన ఆలోచన వచ్చింది. తనకు తెలిసిన ఓ రొమాంటిక్ రైటర్ ఇంటికి ఫోన్‌చేసి తన బాధ చెప్పుకొని ఓ ప్రేమలేఖ ఎలా రాయాలో చెప్పమని ప్రార్థించాడు.

వెంటనే అటువైపునుండి రొమాంటిక్ రైటర్ చెబుతుండగా రాయసాగాడు ప్రేమ లేఖ.

"ప్రియసఖీ! నీ ముఖం చంద్రబింబం. నీ నవ్వు వెన్నెల కిరణాలు. నీ నడక చూసి హంస కూడా సిగ్గుపడుతుంది. మయూరం ముఖం మాడ్చుకొంటుంది. నీ చేతిమీదుగా విషం తాగిన మరుక్షణం అది అమృతంగా మారిపోతుంది. నిన్ను విడిచి ఒక్కక్షణం నేనుండలేను. నీ మాటలు వింటూ ఎంతసే పైనా అలానే ఉండిపోవాలనిపిస్తుంది" అంటూ ఓ రెండు పేజీలు రాసి ముగిం చాడు.

తర్వాత ఆ రైటర్‌కు థాంక్స్ చెప్పి వెంటనే ఆ లెటర్ పోస్ట్‌చేసి నాలుగు రోజులు పోయాక రోజూ వాళ్ళిద్దరూ కలు సుకొనే పార్క్‌కు వెళ్ళాడు.

అతన్ని చూస్తూనే తోక తొక్కిన తాచులా కస్సున లేచి "మంచి ప్రేమలేఖ రాయ మంటే ఇంత ఛండాలంగా రాస్తావా?" అంటూ ఆ ప్రేమలేఖను అతని ముఖాన విసిరికొట్టి విసవిసా వెళ్ళిపోయింది.

రవిచంద్ర ఆమె ప్రవర్తనకు విస్తుబోతూ "ఇదేంటి ఇలాగయింది. ఏమై ఉంటుంది చెప్మా?" అనుకొంటూ ఆ ప్రేమలేఖను తీసి చదివాడు. చదివిన మరుక్షణం జరిగిన పొరపాటు అర్థమై నిస్సత్తువుగా కూలబ డ్డాడు.

అలవాట్లో పొరపాటుగా ప్రేమలేఖ చివర "ఇది కేవలం కల్పితం. ఇందులోని సంఘ టనలు నూటికి నూరుపాళ్లు కల్పితం" అని రాసి సంతకం చేసివున్న అక్షరాలు వెక్కిరిస్తూ కనిపిస్తున్నాయి.

**- కలపర్తి సత్యం**

# 'చీకటిముడులు' పై సమీక్షలు

జూన్ 'చతుర'లో ప్రచురితమయిన వి.ఆర్. రాసాని రచన 'చీకటి ముడులు'పై మాకందిన ఉత్తమ సమీక్షలు.

## కనిపించని కోణాలు

*(ప్రథమ బహుమతి రూ.100/- పొందిన సమీక్ష)*

గతించిన పల్లెసీమల వెతలబతుకుల్ని మన కళ్లముందుంచిన నవల 'చీకటి ముడులు'.

ఒకప్పటి పల్లెసీమల పచ్చదనాన్ని, వ్యవసాయప్పనులను మన ముందుంచారు. కపిలబాన, బారి, వరివాద లాంటి పదాలను బట్టి రచయితకు పల్లె పనులపైన మంచి అవగాహన ఉన్నట్లు అన్పిస్తుంది. పొలాల్లో జరిగే ప్రతి చిన్న సంఘటనను కూడా ఎంతో చక్కగా చెప్పారు.

ఇందులో కుశాలన్న పాత్రద్వారా మధ్యతరగతి రైతులు ఎదుగూ బొదుగూ లేక ఎలాంటి దీనస్థితికి చేరుకొంటారో, వెట్టిచాకిరీ వలయంలో ఎలా ఇరుక్కొంటారో చాలా బాగా వివరించారు. కుశాలన్న గోనె సంచులు దొంగతనం చేయడంద్వారా ఆకలి మనిషిలో కల్గించే మార్పును స్పష్టంగా తెలియజేశారు. దేవకి పాత్రద్వారా భూస్వాములకు కూలీ స్త్రీలు ఎందుకు ఉంపుడుకత్తెలుగా మారుతారో చెప్పారు.

తరతరాలుగా వెట్టిచాకిరీ చేయిస్తూ అబలల మానాన్ని దోచుకొనే నిరంకుశ భూస్వామిగా మంగరాజు పాత్రను చిత్రించిన తీరు మన కళ్లముందు జరుగుతున్నట్లే అన్పిస్తుంది.

రేయింబవళ్లు కష్టపడినా కన్నీళ్లు తొలగని పల్లెవాసుల జీవనాన్ని చాలా సహజంగా చిత్రించారు. మనది వ్యవసాయ దేశం. డెబ్భైశాతం గ్రామాలే. అలాంటి గ్రామాల పురోగతి ఏమాత్రం? అందులో ఉండే ప్రజల స్థితిగతులు ఎలా ఉన్నాయి? అన్నది ఈ నవలద్వారా రచయిత స్పష్టం చేశారు. పాలేటి పాత్రద్వారా పీడితుల్లో విప్లవానికి నాంది ఎలా జరుగుతుందో ఎంతో హృద్యంగా మలచారు.

కాకపోతే నవల ప్రారంభంలో గ్రామణి బస్‌లో కండక్టర్‌చేత నాలుగుసార్లు డోర్ మూయించి రైట్ చెప్పించారు రచయిత. కానీ గ్రామణి బస్‌కు డోర్‌లు ఉండవనే విషయం మరిచారేమో! కుశాలన్న వయసు రెండు పాతికలు దాటింది. మరి అతడి అక్క గల్లపల్లోల్ల ముసలమ్మకు తొంభై ఏళ్లుండచ్చునన్నారు. ఒకే తల్లి బిడ్డల మధ్య నలభై సంవత్సరాల వ్యత్యాసం ఎలా సాధ్యం? మంగరాజు కొడుకు చిన్నరాజు ఎనిమిది సంవత్సరాలవాడు. తప్పిపోయి తిరిగొచ్చిన ఆరు నెల్లకే అతనికి పది సంవత్సరాల వయసు ఎలా వచ్చిందో?

ఇలాంటి ప్రాథమిక దోషాలున్నా ఇందులోని సన్నివేశాలన్నీ సహజంగా ఉన్నాయి. మొత్తంమీద మనసును కదిలించే నవలేగాక చీకటి ముడులు విప్పడానికి ఆలోచన

చేయించేది కూడాననడంలో సందేహం లేదు.

–సుంకోజి దేవేంద్రాచారి
తిరుపతి- 517501

## బాగుంది... కానీ...!

*(ద్వితీయ బహుమతి రూ.75/– పొందిన సమీక్ష)*

రాయలసీమ గ్రామీణ నేపథ్యంలో శ్రీ వి.ఆర్.రాసాని రాసిన 'చీకటి ముడులు' నవల తరతరాలుగా కరవు రక్కసి కోరల్లో చిక్కి విలవిలలాడుతున్న సీమ ప్రజల దుస్థితి కుశాలన్న పాత్ర కేంద్రంగా నడిచిన కథలో ప్రతిభావంతంగా ప్రతిబింబించింది. కథలోని శైలీ, పాత్రలకుపయోగించిన సజీవమైన సీమ మాండలికమూ చివరివరకూ ఆసక్తికరంగా చదివించాయి.

వంటవాడిగా జీవితం ప్రారంభించిన కుశాలన్న, ఫ్యాక్టరీ కార్మికుడిగా అవతారమెత్తి వ్యవసాయ కూలీగా మారి రకరకాల వృత్తులు చేపట్టి, ప్రతిచోటా ఆర్థికంగా, నైతికంగా ధనిక వర్గాల చేతుల్లో ఎలా వంచింపబడ్డాడో రాసానిగారు సహజంగా చిత్రించారు.

కథలోని కుశాలన్న భార్య దేవకి పాత్ర మనసుల్ని కలచివేస్తుంది. మనుషులు నైతికంగా పతనమవడానికి ఆ ప్రాంతపు సాంఘిక, ఆర్థిక పరిస్థితులు ఎంతగా ప్రభావం చూపిస్తాయో ఈ పాత్రద్వారా అర్థమవుతుంది.

నవలలో చాలా అసమగ్రంగా చిత్రించబడిన పాత్రలు రెండు. ఒకటి దాసన్నగారి పెద్ద కొడుకు పెద్దిరెడ్డి, రెండోది కుశాలన్న కొడుకు పాలేటి. పెద్దిరెడ్డి కమ్యూనిస్టు. నిస్వార్థ ప్రజాసేవకుడుగా పేరు తెచ్చుకున్నాడు. పేదలంటే ప్రేమ అని మాత్రమే వర్ణించి ఊరుకున్నారు రచయిత. అంతటి సచ్చరిత్ర కలిగి, ఆ గ్రామానికి సర్పంచ్‌గా కూడా ఉన్న ఈ వ్యక్తి ప్రస్తావన కథలో మళ్లీ ఎక్కడా లేకపోవటం ఆశ్చర్యమనిపిస్తుంది... అదీ తన కళ్లముందు స్వంత కుటుంబ సభ్యుల చేతుల్లో పేదలు అంతగా వంచింపబడ్తున్నప్పుడు.

కథ మధ్యలోనే పొట్టకూటికోసం బెంగుళూరు వెళ్లిపోయిన పాలేటి మళ్లీ సినిమాటిక్‌గా కథ చివరి అధ్యాయంలోనే ప్రత్యక్షమవుతాడు. బెంగుళూరులో అతనికి ఎదురైన పరిస్థితులుగాని, అక్కడినుంచి తిరిగి రావటానికిగల బలమైన కారణాల గురించిగాని రచయిత మాట మాత్రంగానైనా చెప్పకపోవటంవల్ల ఏదో లింకు తెగిపోయినట్టుగా ఉంది.

కథలో ఒకటీ, అరా ఇలాంటి లోపాలున్నా ఉన్న వాళ్ల దాష్టీకానికి లేనివాళ్లు పల్లెపట్టుల్లో ఇంకా ఎలా బలి అవుతున్నారో సహజసిద్ధమైన పాత్రలు, కథాగమనం ద్వారా చెప్పటంలో రచయిత చాలావరకు కృతకృత్యులయ్యారు.

–మేడేపల్లి శేషు
న్యూఢిల్లీ- 110058

## వన్నెతెచ్చిన భాష

*(తృతీయ బహుమతి రూ.50/– పొందిన సమీక్ష)*

బడుగు ప్రజల క్షుద్బాధని, వ్యధార్త జీవుల జీవనవిధానాన్ని, అక్షరీకరించిన ఒక మంచి నవల 'చీకటిముడులు'.

సైంటిఫిక్ ప్రపంచంవైపు దూసుకుపోతున్నామనే భ్రమలో బతుకుతున్నాం మనం. పల్లె ప్రజల బతుకులని ప్రతిబింబించేలా సాగిన రచనలు అరుదుగా వస్తుంటాయి. అందులో కొన్ని మాత్రమే పఠితల హృదయాన్ని చేరగల్గుతాయి. ఈ కోవలోదే 'చీకటిముడులు'.

భారతదేశం సాంకేతికపరంగా అభివృద్ధి





చెందుతోందన్నమాట నిజమేగానీ నివురుక ప్పని నిప్పులా బీదరికం కూడా శరవేగంతో వ్యాప్తి చెందుతూనే వుంది.

రచయిత వి.ఆర్.రాసాని ఈ బీదపల్లె ప్రజల వెతల్ని, రొదల్ని, మనోవేదనల్ని సూటిగా సరళమైన శైలిలో బలంగా చెప్పగ ల్గారు.

గ్రామీణ భారతం ప్రతిబింబించిన ఈ నవలలో ఆలిని సైతం పోషించుకోలేక, కాముకుల గాలికి వదిలివేయలేక, స్వార్థపరు లైన యజమానులకే శక్తినంతా ధారపోసిన కుశాలన్న పాత్ర....

సగటు గృహిణిగా కుటుంబాన్ని నెట్టుకు రావటం కోసం, రెక్కలు ముక్కలు చేసు కున్నా చాలని కూలీ డబ్బుతో బతకలేక, భవిష్యత్తుపై భయంతో అక్రమ సంబం ధాల ఊబిలో దిగి వేశ్యగా బలైన దేవకి పాత్ర...

తల్లి చీకటి చరిత్ర తనని నీడలా వెంటా డటంతో నిప్పులా బతకలేక నూతిలో పడి ఆరిపోయిన గౌరి పాత్ర...

భర్త- భార్య- కుమార్తె- ఈ కుటుంబ పాత్రలమీదుగా నడిచిన కథ కన్నీటి చరిత్ర లని ఆవిష్కరించింది.

"తుఫాను ముంచుకొచ్చినా అప్పుడు అట్టే అణగారిపోయుండి, ఆ తర్వాత తిరిగి తలె త్తుకుని పైకిలేచి నిలబడే గరికపోచ మాది రిగా వుండాల" అంటూ కుశాలన్న నవల అంతంలో కుమారుడికి అందించే జీవితస త్యాలు నూటికి నూరుపాళ్లూ నిజం.

శైలి, శిల్పం పల్లె సౌష్టవాన్ని పుణికిపుచ్చుకో వడం, భాషలోని యాస సహజసిద్ధంగా వుండటం నవలకి అదనపు అలంకారాల య్యాయి.

ఏదిఏమైనా అణు వస్త్రాలా, బీదలకి అన్న వస్త్రాలా అనే సందిగ్ధ చర్చ కొనసాగుతున్న నేపథ్యంలో వచ్చిన ఉత్తమ నవల 'చీకటిముడులు'. ఆణిముత్యాన్నందించిన రచయితకు, చతురకు ధన్యవాదాలు.

-యక్కటి సుధాకర్‌బాబు
కాకినాడ-533003

## నవల కాదు జీవితకథ

*(నాలుగవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

ఏ విధమయిన కల్పిత సంఘటనలు, పాత్రలు లేవనిపించేలా స్వచ్ఛమయిన ప్రకృతి సిద్ధమయిన సజీవపాత్రలతో సంఘ టనలతో, మాటలతో కూడిన అతి చక్కని చిక్కని నవల 'చీకటిముడులు'. అసలు ఇది నవలకాదు దేశంలోని దీనాతిదీనుల ప్రతి నిధి కుశాలన్న జీవితకథ. వి.ఆర్.రాసాని గారు ఒక బడుగు జీవి జీవితగాథ రచించి అసలుసిసలయిన బడుగు వర్గాల ప్రజా రచయిత అనిపించుకున్నారు. రాయలసీమ జిల్లాలలోని మాండలిక పదాలు, మాటలు వాడి ఈ నవలకు ఒక ప్రత్యేకతను ఆపా దించారు రచయిత. 'చీకటి ముడులు'లోని ప్రతి ఒక్క పాత్ర, సంఘటన, సంభాషణ సజీవమే. ఇవేవీ కలంలోంచి పుట్టినవికావు. నిత్యజీవితంలో ప్రతిరోజూ ఎదురయ్యేవే. ఉదాహరణకు చీటికిమాటికి కరెంటుకోతలు, వీటిమూలంగా ప్రజలు, ముఖ్యంగా చిన్న కారు పరిశ్రమలు ఇబ్బందుల పాలవుతున్న నైనం, ప్రజలసేవే మా ధ్యేయం అని డబ్బాలు కొట్టుకొనే బస్సులు సమయాసమ యాలు పాటించకుండా తమ ఇష్టం వచ్చి నట్లు రావటం, బస్తాలలో చింతపండును పూరతొక్కినట్లు ప్రయాణీకులను బస్సులలో నింపడంతో ప్రయాణీకులు పడే అష్టక ష్టాలు, తమ క్రింద పనిచేసే కూలీలపై ధనిక వర్గాల దౌర్జన్యం, బడుగువర్గాల ఆడ వారిపై జరిపే పైశాచిక కృత్యాలు, లేనిపోని దొంగతనాలు అంటగట్టి కిందామీదా చూడ

కుండా 'చస్తారో బతుకుతారో అని కూడా గమనించకుండా తమ నౌకరును చితకబాదే యజమానుల రాక్షసత్వం, ఇలా ప్రతిఒక్క సంఘటన ఆయా ప్రాంతాలలో నిత్యం జరుగుతున్నవే.

ఒక బడుగుజీవి జీవితాన్ని నవలగా అందించి కంటతడిపెట్టించిన రచయిత కలంబలానికి జోహార్లు.

బి.గంగానాథ్
సికింద్రాబాద్-500061

## సామాజిక బాధ్యత

*(అయిదవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

యంత్రంలా శ్రమించటం తప్ప అన్యాయాన్ని ఎదిరించే ధైర్యంలేని కుశాలన్న జీవిత చిత్రణే రాసానిగారి నవల 'చీకటిముడులు'. బడుగువర్గాల బానిస బతుకును, గ్రామీణ వాతావరణాన్ని చిత్రీకరించిన వైనంచూస్తే రచయితకు గ్రామీణ జీవితంతో వందశాతం పేగు సంబంధం ఉండి తీరుతుందని తేలిగ్గానే తెలిసిపోతుంది.

పది సంవత్సరాలనాడు కడుపు కక్కుర్తికై చేసిన చిన్న తప్పుకు బలై, వెలియై భార్యాబిడ్డలతో పొట్టచేతపట్టుకుని ఊరు విడిచిన కుశాలన్న అవిటివాడుగా మారి కన్న మమకారాన్ని, ఊరిమీది అభిమానాన్ని వొదులుకోలేక ఏకాకిగా బండారోళ్లపల్లెకు తిరిగి రావటంతో నవల కుతూహల జనకంగా మొదలయింది. గతం నెమరు వేసుకుంటే అన్నీ చేదు జ్ఞాపకాలే. తను చేయని చేయలేని సాహసం తన కొడుకులో చూడటంతో ఆశావహంగా ముగుస్తుంది నవల. కథనంలో జీవన వాస్తవానికి పెద్దపీటవేసిన నవల 'చీకటిముడులు'

కానీ నవలకుండవలసిన కొన్ని ముఖ్య లక్షణాల విషయంలో ఒక రకంగా అవాస్తవికతను, అయోమయాన్ని సృష్టించిందని చెప్పక తప్పదు. కథా నిర్మాణం చాలా లూజ్‌గా ఉంది.

నూనె మిల్లును ఒక పెద్ద పరిశ్రమగా చూపించటం అసమంజసంగా ఉంది. ఒక మేనేజర్, అసిస్టెంటు మేనేజర్ గుమాస్తాలు, ఇద్దరు వాచ్‌మేన్లు, కూలీలు ఇంతమంది ఒక మామూలు నూనెమిల్లుకు అవసరం లేదు. (బ్రాన్‌ఆయిల్ మిల్లుకు తప్ప). శెనక్కాయపంటలు సీజనల్ వ్యవహారం. సంవత్సరం పొడవునా మిల్లు నడవటం అనూహ్యం. దేవకి పతనానికి ప్రేరేపించిన ముఖ్య కారణం పేదరికమే ఐనా ఆమె మానసిక స్థితిని విశ్లేషించి చెప్పటంలో రచయిత అయిష్టత ప్రదర్శించారు. పేదరికమే కారణమైతే మంగరాజుకు లొంగిపోవటాన్ని సమర్థించగలం. కాని మొగరాల ముద్దయ్యతో రాజీపడటంతో ఎలా సమర్థించగలం? మంగరాజు ప్రవర్తన చూస్తే తెలుగు సినిమా గ్రామీణ విలన్ తెరమీది నుంచి నవలలోకి నడిచి వచ్చినట్లనిపిస్తుంది.

జీవన వాస్తవికతను సామాజిక స్పృహతో సాహితీ కళా రూపావిష్కారం చేయదలుచుకున్నప్పుడు కల్పన అవసరమే గాని పక్క వాయిద్యం పై వాయిద్యం కాకూడదు.

కథా నిర్మాణంలో లోటు పాట్లున్నా, సామాజిక బాధ్యతతో రాసిన రాసానిగారు అభినందనకు అర్హులే.

–సి.హెచ్.శ్రీనివాసమూర్తి
కొత్తగూడెం-507101

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad Tel: 290328 Office Address: CHATURA Monthly, Eenadu Compound, Somajiguda. Tel. Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75291; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942; Nellore: 331080

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78

# కొందరికి కారం అంటే మమకారం!

అవును... ఇప్పుడు కారం కారంగా, తియ్య తియ్యగా, పుల్ల పుల్లగా, ఘాటు ఘాటుగా, మీకు నచ్చే మీరు మెచ్చే ఏ రుచి కావాలన్నా అందిస్తోంది 'ప్రియ'. 23 రకాల 'ప్రియ' పచ్చళ్లు... మీ ముందు సిద్ధం.

• నోరూరించే, మైమరిపించే 'ప్రియ' ఘుమ ఘుమలు పసందైన విందును ప్రేమించే మీ కోసమే ప్రత్యేకం సుమా!

వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ, ఆవనూనెతోనూ, నువ్వుల నూనెతోనూ కూడా సంసిద్ధమై లభిస్తోంది. సాటిలేని 'ప్రియ' మాధుర్యం... 300, 500 గ్రాముల సీసాల్లోనూ, 1 కే.జి., 5 కేజీలు, 20 కేజీల ప్యాకింగులలోనూ లభించును.






Mango Avakaya · Mango Thokku · Cut Mango · Tender (Vadu) Mango · Sweet Mango Chutney · Amla · Gongura · Drumstick · Lime · Tomato · Mixed Vegetable



Bitter Gourd · Green Tamarind · Ginger · Sweet Ginger · Mango Ginger · Garlic · Onion · Red Chilli · Green Chilli (Sliced) · Green Chilli (Paste) · Gongura & Red Chilli · Green Tamarind & Red Chilli




Pickles
ఏ పచ్చడంటె
ఆ పచ్చడి సంసి

**ఉషోదయ ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్,** (ప్రియ ఫుడ్స్ డివిజన్), **ఈనాడు** కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్ **500 48**